





# ధర్మము

## విచారణ

## మాటల మధ్యలో రాలిన ముత్యాలు- 1 , 2





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120000793,2020120029364



**SaiRealAttitudeManagement**(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మాటల మధ్యలో
# రాలిన ముత్యాలు 1

కర్త :

డా॥ మోపిదేవి కృష్ణస్వామి
ఎం. ఏ., పిహెచ్. డి.

కూర్పు :

సిహెచ్. మధుమోహన్ రావు

ది యూనివర్సల్
హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్
ట్రస్ట్ ప్రచురణ

# కృతజ్ఞతలు

సోదరుడు మధుమోహన్ దీక్షతో చేసిన కృషికి ఫలితంగా ఈ గ్రంథం వెలువడుతోంది. అతనికి మా శుభాకాంక్షలు. ఇలాంటి ప్రయత్నం అతడింకా కొనసాగించాలని, ఈ ముత్యాల హారాలను ఇలాగే అందిస్తూ ఉండాలని కోరుతున్నాము. మరికొందరు యువకులు కూడా తాము మాష్టరు గారినుండి పొందుతున్న శిక్షణ ఆధారంగా ఇలాంటి ప్రయోజనాత్మకమైన గ్రంథాలను రూపొందిస్తూ ఉండాలన్నది మా ఆకాంక్ష.

సోదరుడు చేసిన ఈ ప్రయత్నానికి చక్కని రూపమీయడంలో తాముగా కృషిచేసిన శ్రీ ఎల్. ఎన్. శర్మగారికి, వారి బృందమునకు మా కృతజ్ఞతలు. శుద్ధప్రతిని రూపొందించి ఇచ్చినటువంటి శ్రీమతి ధారా భవానీదేవిగారికి మా కృతజ్ఞతలు. ముఖచిత్రానికి రూపకల్పన చేసిన సోదరుడు దాసు. అతనికి మా శుభాకాంక్షలు.

మన సంస్థపేరు మానవధర్మ శిక్షణ సంస్థ. మానవధర్మాన మన సంస్థనుండి తయారవుతున్న శిక్షణ సరసమైన పద్ధతిలో ఈ సంపుటాలుగా అందించబడుతున్నది. ఆబాలగోపాలం ఈ మా ప్రయత్నాన్ని హృదయంతో స్వీకరిస్తారని విశ్వసిస్తున్నాము.

ప్రచురణ విభాగము,

మానవధర్మ శిక్షణ సంస్థ.

# ఇందులో....


పుట

ఆ విశ్వాసం నాకున్నది

ముత్యాల సరం

దివ్యమైన ఆహారం

మాటల మధ్యలో రాలిన ముత్యాలు

1. క్షీర సందేశం - 1
2. నిద్ర - ఉపవాసం - యోగసాధన - 4
3 గోవు కొరకు - 11
4 ఆ తల్లీ బిడ్డల్ని చూడు ! - 13
5 ఉద్యమానికి తెలుసు - 17
6 రూపాయలు - రూపాలు - 20
7. తలుపును కొట్టినా ! - 22
8. పిసునుబట్టి - 29
9. జీవిత చక్రం - 30
10. అలా ఆవలించకు - 32
11. లోటులనుండి లోతులకు - 33
12. ఇంక వారికి శ్రమెందుకు ? - 38
13. పెద్ద దిక్కు - 41
14. కస్తూరి నుండి కర్తవ్యం వరకూ - 46
15. దబ్బు - జబ్బు - 52
16. అందరూ వినవలసినదే - 56

17. పెద్దలకేం నష్టంలేదు — 60
18. లోకం గొడ్డుపోలేదు — 63
19 బ్రహ్మకుకూడా అప్పులు ఉన్నాయి — 65
20. పూలమొక్క — 68
21. పెద్దల కోరిక — 69
22. ముడి విప్పాడు — 75
23. నిజమంతే — 77
24. నా షైను నా కివ్వండి — 78
25. నేలవిడిచి సాముచేయుట — 81
26. జన్మ దర్థమవుతోంది — 84
27. పట్టాలెక్కిస్తూనే ఉంటారు — 87
28. అగ్గిపుల్ల గీసేముందు — 91


※ ※

# ఆ విశ్వాసం నాకున్నది

మహనీయులతో కలిసి జీవిత ప్రయాణాన్ని నడిపే అవకాశం లభించడం ఒక గొప్ప అదృష్టం - ఒక మంచి అవకాశం. అందుకే మన పెద్దలు మహాపురుషుల ఆశ్రయం లభించడం అనేది ఒక అరుదైన అదృష్టంగా భావించారు. అటువంటి అదృష్టం నా జీవితానికి లభించడం, పరమగురువుల అనుగ్రహానికి నేను పాత్రుడ్ని కావడం నా పూర్వపుణ్య విశేషంవల్ల జరిగింది అనడంకన్న పరమ భేదాలు ఎరుగని పెద్దల కరుణాకటాక్ష వీక్షణాలవల్ల జరిగినది అని నా కనిపిస్తున్నది.

విద్యార్థిదశలో ఉన్న నేను మాస్టర్ ఇ. కె. గారి రచనలకు దగ్గరై ప్రబోధింపబడ్డాను. నాకు వారిని చూడాలనిపించింది. వారితో కొంతకాలం గడపాలనిపించింది. కాని అంతలోనే వారు దేహత్యాగం చేశారన్న వార్త నా చెవులకు సోకింది. మనస్సు కలవరపరిచింది.

ఇంతలో నేను సోదరులు రామనాథంగారికి దగ్గరయ్యాను. ఆయన మాస్టర్ ఇ. కె. గారి స్పర్శను బాగా పొందినవారు. మీరు కృష్ణస్వామి గారిని కలిస్తే మీకు కావలసింది మీకు దొరుకుతుంది అని ఆయన చెప్పారు. ఆ తరువాత గుంటూరులో జరిగిన ఇ. కె. మాస్టరుగారి జ్ఞానయజ్ఞంలో నేను కృష్ణస్వామిగారిని కలుసుకోగలిగాను. రామనాథంగారు చెప్పినమాట నిజమేననిపించింది. ఆపైన వరంగల్‌లో ఉంటూనే తరచు కృష్ణస్వామి గారికి లేఖలు వ్రాస్తూండేవాడిని. ఆయన శ్రమ అనుకోకుండా ప్రేమతో కావలసిన జవాబులు ఇస్తూండేవారు. వారు నాకు రాసిన లేఖలలో కొన్ని "స్వామి లేఖలు - కాంతిరేఖలు" లో కూడా చోటుచేసుకున్నాయి. ఆ

గ్రంథంలో "మనకథ దారిన పడుతుంది" అని ఒక లేఖ ఉంది. అది నాకు వ్రాయబడినదే. అంతచిన్నలేఖలో మనిషికి కావలసినదంతా చెప్పారాయన. ఆ లేఖ నాకు ఇప్పుడూ గుర్తొస్తూ ఉంటుంది. ఇలాంటి స్వామి లేఖలు నన్ను మానసికంగా కృష్ణస్వామిగారికి మరింత దగ్గరచేశాయి. ఆయనదగ్గర నీకు కావలసింది దొరుకుతుంది అన్న రామనాథంగారి మాటలు నిజమవుతున్నట్లుగా నాకు అనిపించసాగింది.

నా గ్రాడ్యుయేషన్ పూర్తి అయిపోయింది. అక్కడ విశాఖలో World Teacher Trust అనే వేదికపైన కృష్ణస్వామిగారి పాత్రపోషణ కూడా పూర్తయినట్లు నాకు తెలిసింది. "మానవధర్మ శిక్షణ సంస్థ" విజయవాడ శాఖ ప్రారంభోత్సవానికి రమ్మని నాకు ఆహ్వానం అందింది. ఆహ్వానం అందినరోజే ప్రారంభోత్సవం. వెంటనే బయలుదేరాను. ఉత్సవానికి అందుకున్నాను. కార్యక్రమం పూర్తయినతరువాత ఏంచేస్తున్నావు అని అడిగారు కృష్ణస్వామిగారు. ప్రెస్ పని నేర్చుకుందామని ఉంది అని చెప్పాను. అదేదో ఇక్కడే చేయవచ్చుగదా! అన్నీ కలిసివస్తాయి అన్నారాయన. అంతే! నేనిక వారి అంతేవాసి నయిపోయాను

ఇక శిక్షణ ప్రారంభమయింది. శాఖ ప్రారంభమయిన తొలినాళ్లు గదా! ఎక్కువమందిమి లేము. ఇక ఆయన తమ దృష్టినంతా మాపైనే లగ్నం చేశారు. ఆయన విజయవాడలో ఉన్నన్నిరోజులు మాకోసమే ఉన్నట్లనిపించేది. మాకువచ్చే ప్రతి ఆలోచననీ, మేం మాట్లాడే ప్రతి మాటని, మేంచేసే ప్రతిపనిని ఆయన శ్రద్ధగా గమనిస్తూ కావలసిన సర్దుబాట్లు చెప్పేవారు. చేయవలసిన దిద్దుబాట్లు చేసేవారు. ఆ సర్దుబాట్లు, దిద్దుబాట్లు మరచిపోలేనివిగా ఉండేవి. వాటిని ఒక గ్రంథంగా కూర్పుచేస్తే చాలా బావుంటుంది అనిపించింది. కృష్ణస్వామిగారికి నా సంకల్పం చెప్పాను. "మాటల మధ్యలో రాలిన ముత్యాలు" గా కూర్పుచేయదలచాను

అని చెప్పాను. నవ్వుతూ ఆయన ఒకవిధంగా చూస్తే భగద్గీత కూడా మాటల మధ్యలో రాలిన ముత్యాలేనోయ్ అన్నారు. రూపుదిద్దుకుంటే ఇది మాత్రం భగవద్గీత కాదా! అన్నాన్నేను. ఆయన చిత్రంగా నవ్వారు. ఆ నవ్వురూపంలోనే తన ఆమోదాన్ని తెలియజేశారు. యువతరం అనే అర్జునుడికి ఉపదేశింపబడిన భగవద్గీతగా ఈ గ్రంథం రూపు ధరించింది. వారికి వివరించాను. మొత్తంమీద సాధించావు అన్నారాయన. మీరు సాధించేటట్లుగా చేశారు అన్నాను నేను. మళ్ళీ ఆయన చిత్రంగా నవ్వారు. ఆయనలా నవ్వినప్పుడల్లా ఇలాంటి చిత్రాలు జరుగుతూనే ఉంటాయి.

గ్రంథాన్ని అందరిచేతా అన్నగారుగా పిలువబడే శ్రీ యల్. ఎన్. శర్మగారు చూశారు. నిత్యజీవితానికి అవసరమయ్యే ఇలాంటి గ్రంథాలు ఎంతైనా అవసరమన్నారు. ఈ గ్రంథం శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ చూశారు. చాలా బాగున్నదని ముందుమాట వ్రాసియిచ్చారు. ఇప్పుడు మీకు అందిస్తున్నాను. మీరు చాలా బాగున్నదని, తప్పక చదివి తీరుతారు - మీ ప్రక్కవారిచేత కందస్తారు. ఆ విశ్వాసం నాకుంది.

మీ

సి. హెచ్. మధుమోహన్‌రావు

27 — 5 — 87.

# ముత్యాలసరం

ఇవి మాటల మధ్యలో రాలిన ముత్యాలు కాదు - సత్యాలు. మనం ఒక్కొక్కటిగా ఒక్కొక్కరుగా ఏరుకోవలసిన శ్రమ తప్పించి సోదరుడు చక్కని దండ గుచ్చాడు. ఇక దానిని మనం కంఠస్థం చేసుకోవడమే మిగిలింది.

ఈ పుస్తకం ముత్యాలసరం ఎలా అవుతుంది? ముత్యాలున్నాయి. వాటికి ఏకసూత్రత ఏది? అనే ప్రశ్న ఎదురవచ్చు. ఈ ముత్యాలను దండగా విడిపి వాటిల్లో దాక్కున్న సూత్రం యువతరమే. ఆ సూత్రానికి ఔన్నత్యం తేవడానికే ముత్యాలు తమ గుండెలను ఛిద్రాలు చేసుకున్నాయి. తమలో దానికి చోటిచ్చాయి. తమ గుండెల్లో దాచుకొన్నాయి.

నిద్రాపరాయణమైన యువతకు ఇది పారాయణగ్రంథం కావాలి. క్రమశిక్షణ, కార్యనిర్వహణ దక్షత, సన్నివేశాల అంతర్యాలను ఆవిష్కరించగలిగే ఆలోచనా విధానం, జీవనపథంలో పవిత్ర సౌందర్య దర్శనం - ఈ ముత్యాలదండను కంఠస్థం చేయడంవలన కలిగే సుగుణాలు.

ముక్తాహారులై ముక్కుమూసుకొని మూల కూర్చోవడంకాదు తపస్సంటే. పదిమందిలో సమన్వయపూర్వకంగా పదిమందికీ పనికివచ్చే విధంగా జీవించటం చేతకావాలి. అదెలాగో ఈ ముక్తాహారం చెబుతుంది. ఇటువంటి ముత్యాల మూటలు, రతనాల రాసులు మనందరం యథాశక్తి కూడబెట్టుకుంటే జీవనానికి లోటు ఉండదనీ, లోతు తెలుస్తుందనీ మనవి చేస్తున్నాను.

విజయవాడ,

19-5-86. — పాలపర్తి శ్యామలానందప్రసాద్.

# దివ్యమైన ఆహారం

ఈ మాటలమధ్యలో దాలిన ముత్యాలు ఒక హారంగా గ్రుచ్చి అందరికీ అందిస్తున్న చిరంజీవి మధుమోహన్ క్రమశిక్షణ కలిగిన యువకుడు. చిన్నప్పటినుండీ ఒక పద్ధతిలో జీవించడానికి అలవాటుపడినవాడు. మహానీయులన్నా, వారి రచనలన్నా అమితమైన గౌరవం, శ్రద్ధాసక్తులు కలిగినవాడు. జరుగవలసిన కథ ననుసరించి చిత్రంగా నాకు దగ్గరయినాడు. దగ్గరయినప్పటినుండి తన కప్పచెప్పబడిన పనిని తాను చేస్తూనే నాక్కావలసిన నిత్య అవసరాలను చూడటం ఒక వ్రతంగా పెట్టుకున్నాడు. అంతేకాక అవకాశమున్నప్పుడల్లా నాకు దగ్గరగా ఉంటూ నే నెవరితో దేనిని గూర్చి మాట్లాడుతున్నా శ్రద్ధగా వింటూఉండటం అలవాటు చేసుకొన్నాడు. ఊరికే వినటంవల్ల ప్రయోజనమేమున్నదని ఆయా అంశాలను చక్కటి పద్ధతిలో వ్రాసిఉంచటం మొదలుపెట్టాడు. ఈ వ్రాసిఉంచినవి వ్రాతప్రతిగా ఉంటే నాఒక్కడికే పనికివస్తాయి - గ్రంథరూపం ధరించి బయటకుపెడితే ఎంతోమందికి ఎల్లకాలం పనికివస్తాయి అన్న ఆలోచన అతనికి కలిగింది. నాతో చెప్పాడు. ఆలోచన బాగున్నదీ అన్నాను. సందేశం వెలువడటానికి ఈ నా దేహం ఎలా వినియోగపడుతున్నదో - ఆ సందేశాన్ని క్రోడీకరించి అందించడానికి అతనిదేహం అలాగే వినియోగపడుతున్నదని గ్రహించాను. మానవధర్మ శిక్షణ వ్యవస్థ వెలిసింది. ఆ ధర్మశిక్షణ ప్రారంభమైంది. ఆ శిక్షణకు సంబంధించిన అంశాలు ముద్రింపబడి అందరికీ అందితే ఆ శిక్షణ కావలసినవారందరికీ అందుబాటులోనికి వెడుతుంది. అందుకే అతనికి సంకల్పం కలిగింది అనిపించింది. కథనుబట్టి పాత్రలు ప్రవేశిస్తాయి. ప్రవేశిస్తున్న పాత్రల ఊతంతో కథ ముందుకు సాగిపోతూ ఉంటుంది. ప్రారంభమైన ఈ క్రొత్తకథకు కావలసిన పాత్రధారులు ఒక్కొక్కరే ప్రవేశిస్తూ కథను ముందుకు తీసుకొని వెడుతున్నట్లుగా గోచరిస్తున్నది

ఈ "మాటల మధ్యలో రాలిన ముత్యాలు" అనే గ్రంథం ఒక శిక్షణ గ్రంథం. నిత్యమూ మన మలవరచుకోవలసినవీ, మనం అనుష్ఠించవలసినవీ ఎన్నో అంశాలు ఈ గ్రంథంలో ఉన్నాయి. అలాఅని ఈ గ్రంథం చదువరిని ఇబ్బంది పెట్టదు. ఔషధం మంచిదని తెలిసినా సేవించడానికి రోగి ఇబ్బందిగా ముఖం పెడతాడుకదా! కనుక నీ వందించబోయే గ్రంథం మంచిదైనంతమాత్రంచేత సరిపోదు. అది ఔషధంలా కాకుండా ఆహారంగా రూపుదిద్దుకోవాలి. ఆహారం ఏం చేస్తున్నది? బాగున్నదని మనం తింటున్నాం. ఆ తింటున్నప్పుడు మనకు కావలసిన రుచిని అందిస్తూనే మనకు కావలసిన శక్తినికూడా అనుగ్రహిస్తోందికదా! అలాంటి దివ్యమయిన ఆహారంగా రూపొందాలి నీ రచన" అనిచెప్పాను. శ్రద్ధతో అలాంటి ప్రయత్నమే చేశాడు చదివి వినిపించాడు. చెప్పబడిన అంశాలను చక్కగా ఆకళించుకున్నాడనిపించింది. యువకులకు కావలసిన గ్రంథాన్ని ఒక యువకుడే పూనుకొని అందించినందుకు ఎంతో సంతోషం కలిగింది.

రోజురోజుకూ మనం కొంతయినా ఎదగాలి. కొంతయినా వికసించాలి అని అభిలషించే మనస్తత్వం మధుమోహన్‌ది. తనతోపాటు తనతో ఉన్నవాళ్ళలోకూడా అలాంటి ఎదుగుదలను, వికాసాన్ని గమనించి మురిసిపోతూ ఉంటాడతను. తనతో ఉన్నవారిలో ఎవరిలోనైనా ఆ ఎదుగుదల, వికాసం అంతగా గోచరించనపుడు బాధపడిపోతాడు. స్నేహపూర్వకమైన ఆర్తితో ఎదిగిరమ్మని వారిని హెచ్చరిస్తూ ఉంటాడు. ఈ మాటలమధ్యలో రాలుతున్న ముత్యాలను మరిన్ని భాగాలుగా కూర్పుచేసి లోకానికి అందించాలని అతని సంకల్పం. శుభం. అతని సంకల్పం తప్పక రూపుదిద్దుకుంటుంది. అతని ఆశయం తప్పక సిద్ధిస్తుంది. ఇలాగే జాతికి కావలసిన అనేక రంగాలలో ఇతడినుండి కృషి వ్యక్తం కావాలని శుభాశంసనం చేస్తున్నాను.

విజయవాడ,

26-5-1987.

మోపిదేవి కృష్ణస్వామి.

# క్షీర సందేశం

ప్రేయరు చివరకువస్తోంది. తలుపు దబదబా మ్రోగింది. యువకు డొకడు అయిష్టంగానే లేచి తలుపుతీసి పాలప్యాకెట్ తీసుకొని లోపలపెట్టాడు.

ప్రేయరు పూర్తి అయింది. కృష్ణస్వామి మంచంమీద కూర్చునిఉన్నారు. యువకుణ్ణి పిలిచి కూర్చోబెట్టుకున్నారు.

"రోజూ పాలమనిషి తలుపుబాదడం వినబడటంలేదే." అన్నారు.

"ఈ కిటికీతలుపు తీసి అట్టిపెడతాం, కిటికీలో నుండి పాలప్యాకెట్ లోపలకు పెట్టి వెళ్ళిపోతుంది" అన్నాడతను.

"మరి ఈరోజు ?" అన్నారు కృష్ణస్వామి.

"కిటికీ తలుపు తీసిపెట్టడం మరచి పోయాం." అన్నా తను బాధగా.

ఉక్క మొక్కలైన జంతువులకు తేడా ఏముంది? వాటికన్నా విశిష్టమైన, సౌకర్యవంతమైన, పరిపూర్ణమైన మానవదేహం మనకీయబడినందుగాను మనం ప్రత్యేకించి చేస్తున్నదేమున్నది? ఏమంటావ్! దేశానికి న్యాయం కాదు, ముందు నీ దేహానికి న్యాయం చేకూర్చు. అది నీ కీయబడినందుకు సద్వినియోగం చేయి. అప్పుడు దేశశ్రేయస్సు దానికదిగా సిద్ధిస్తుంది." అంటూ ఆ యువకుణ్ణి వెన్నుతట్టారు కృష్ణస్వామి ●

## నిద్ర - ఉపవాసం - యోగసాధన

"ఇవాళ భోజనం కొంచెం ఎక్కువైనట్లుందండీ! ఏమిటోగా మత్తుగా ఉందంటూ" ఆవలించాడు మాలోని ఒక యువకుడు. ఇంచుమించుగా మిగిలినవాళ్ళంకూడా అదేస్థితిలో ఉన్నాం. మిత్రుల ఇంటిలో అందరికీ ఆతిథ్యం. కొంచెం వేళ తప్పింది ఎంతవద్దనుకున్నా దోసుకొంచెం ఎక్కువగానే పడింది.

మావాడు మరొక ఆవలింత తీస్తూ, "భోజనం ఎక్కువ కావడానికీ, కునిద్ర ముంచుకు రావడానికీ సంబంధం ఏమిటి మాస్టారూ?" అంటూ అరమోడ్పు కన్నులతో ఆయనవైపు చూశాడు.

మాస్టరుగారు చిన్నగా నవ్వుతూ "ఆ వస్తువ్వానివని చూడు. సమాధానం తరువాత సావధానంగా చెప్పుకుందాంలే. ఒకవేళ నేనిప్పుడు చెప్పటం మొదలుపెట్టినా, నిద్రాదేవి ఇప్పుడు నిన్ను విననివ్వదు. నీ రెప్పలపైన కూర్చుంటుంది. దానితో నీరెప్పలు బరువెక్కుతాయి. నీచెవులు మూసేస్తుంది. దానితో నీచెవులకు ఘడియలు పడతాయి. నీశరీరాన్ని నెట్టేస్తుంది. దానితో నువ్వు వేసుకొనివుంటే పక్కపైన లేకపోతే ప్రక్కనున్నవాళ్ళపైన పడిపోకతప్పదు. అదిగో చూశావా అప్పుడే అవన్నీ జరుగుతున్నాయి. ఆ ప్రక్కనున్నవాళ్ళ రక్షణార్ధం, ఆ కొంచెం తెలివుండగానే, నీ పక్కపైన నీవు వాలిపో. నేనూ ఒక కునుకుతీస్తాను. లేచినతరువాత కాఫీత్రాగుతూ సాఫీగా మాట్లాడుకొందాం" అంటూ మాస్టరుగారు ప్రక్కకుతిరిగి పడుకున్నారు. పడుకున్నదే తరువాయి నిద్రలోనికి వెళ్ళిపోయారు. మేమూ నిద్రలోనికి వెళ్ళిపోయాం. నిద్రాదేవి ఒడి ఎంతపెద్దదో! ఆ ఒడిలో ఎంతమందికైనా ఇట్టే చోటు దొరుకుతుంది.

కాఫీలు త్రాగుతూ ఉండగా మావాడు మళ్ళీ కదిపాడు "మాస్టరుగారు చెప్పండి" అంటూ.

"ఏమిటీ." అన్నారు ఆయన.

"నిద్రకదండీ" అంటూ సాగదీసాడు మావాడు.

“ఏదీ, రోజానికీ, పిల్లకీ మధ్యమధ్య చెప్తుంటేనా: తెలియాలనివుంది: మీ ఇంట్లో గ్రైండరు ఉందికదా. ఓసారి జ్ఞాప కాల ఆ గ్రైండరుతో కొంచెం ఎక్కువమోతాదులో పప్పు రుబ్బవలసి వచ్చిందనుకో; ఏంచేస్తారు? మిగతాగదుల్లో ఉన్న లైట్లు, ఫ్యానుల్లో ఎక్కువభాగం తీసేస్తారు. ఎందుకో తెలుసా? అన్నీ అలా వెలుగుతూ, తిరుగుతూఉండగా నువ్వు గ్రైండ్ చేయడం మొదలుపెడితే ఓల్టేజి డౌనై ఫ్యూజ్ ఎగిరిపోవచ్చు. అందుకనే ముందుగానే జాగ్రత్తపడతారు. కావలసిన ఓల్టేజీలో కరెంటు గ్రైండరుకు అందడంకోసం మిగిలినవాటిని ఆర్పేస్తూ తగ్గిస్తారు. అప్పుడు పని సాఫీగానడచిపోతుంది. గ్రైండరుతో పని పూర్తికాగానే మనం మళ్ళీ అన్నింటిని యథాతథంగా వాడుకుంటూ ఉంటాం అవునా?” అడిగారు కృష్ణస్వామి.

అవునంటూ తల ఊపాడు మాధవ్. అతనితో పాటు మేమూ ఊపాము.

శ్రద్ధగా వినండిసుమా! అన్నట్లు చూస్తూ కృష్ణస్వామిగారు ఇంకా ఇలా కొనసాగించారు. “మన శరీరంలోని ప్రాణశక్తి కూడా ఆ కరెంటులాంటిదే. లాంటిది ఏమిటి! ఏది మనం కరెంటని పిలుస్తున్నామో అదే ఇక్కడ మనశరీరంలో ప్రాణశక్తిగా పనిచేస్తున్నది. ఇప్పుడు భోంచేసావ్, ఇంట్లో మీ అమ్మగారు గ్రైండరుకు పనిపెట్టినట్లు, నీ శరీరానికి పెద్దమోతాదులో పని అంటగట్టావ్. అప్పుడేం

చేయాలి? జీర్ణాశయం తనకప్పచెప్పిన పనిని సక్రమంగా పూర్తి చేయాలి. అంటే కరెంట్ కూడా ఎక్కువ మోతాదులో కావాలి. మనకు విద్యుత్ పనిచేస్తున్న కరెంటు - అంటే ప్రాణశక్తి అటువైపు మొగ్గుతుంది. దానితో మనస్సు చురుకుగా పనిచేయటానికి, కష్టం. చెవులు మొదలైన ఇంద్రియాలద్వారా ఆ యా వ్యాపారాలను నిర్వహించడానికీ కావలసిన కరెంటు ఆ కాసేపు అందదు దానినే మనం నిద్ర అంటున్నాం. జీర్ణాశయం తనపని తగుమాత్రం పూర్తిచేసుకోగానే మళ్ళీ వీటికి కరెంట్ సప్లయ్ అందుతోంది. దానినే మనం మెలకువ అంటున్నాం. అయితే మీ ఇంట్లో లైట్లు, ఫ్యానులు మీరు స్వయంగా తగ్గించి జాగ్రత్తపడాలి మనశరీరంలో ఈ పనులు ఆటోమేటిక్‌గా జరిగిపోతుంది. అది ఎన్నో వరాలతోపాటుగా ప్రకృతిమాత మనకందించిన మరోవరం"

మేం వింటున్నాం. ఆ చెబుతున్నది ఎంతగా అర్థం అవుతోందో అంతగా ఆశ్చర్యమూ కలుగుతోంది. సైన్సును కామన్‌సెన్సుతో జోడించి అనుభవానికి అందిస్తున్నారాయన. ఇది ఒకకళ, ఒక నైపుణ్య విశేషం.

శ్రద్ధగా వింటున్న మమ్మల్ని చూస్తూ ఆయన ఇంకా ఇలా అన్నారు. "అందుకే ఉపవాసాది వ్రతాల్లో లఘువుగా ఆహారం తీసుకోమన్నారు పెద్దలు. ఉపవాసం అంటే ఏమిటి? సమీపాన వసించటం. అంటే దైవానికి దగ్గరగా జీవించగల

గడం, అంటే మనస్సు ఆయన స్మరణలో నిలబడగలగడం. ఇప్పుడు పని మనస్సుకు పడింది. ఇప్పుడిక కరంటు ఇటు కావాలి, కనుక అటు తగ్గించమన్నారు. జీర్ణకోశానికి భోజనంపేరిట ఎక్కువ పనిపెడితే ఇందాక నేను చెప్పిన కథంతా మళ్ళీ జరుగుతుంది. కనుక మనస్సు చురుకుగా పని చేయటం కోసం ఆహారాన్ని తగ్గించమన్నారు. తగ్గించడం అంటే మానడం అని అర్థంకాదు మనిషి. చేస్తే ఇటు చేస్తాడు, లేకపోతే అటుచేస్తాడు. శుభ్రంగా లాగించి నిద్ర అయినా పోతాడు. లేదా ఉపవాసంపేరిట కడుపును మలమలా మాడ్చిఅయినా వేస్తాడు.

ఉపవాసవ్రతంలో శరీరాన్ని మాడ్చకూడదు. ఆహారాన్ని తగుమాత్రం అందించాలి, మనస్సు భగవంతుణ్ణి స్మరించుకోవడానికి అడ్డురాకుండా అందించగలగాలి. ఘనాహారం తక్కువగాను, ద్రవాహారం ఎక్కువగాను అందించడం మంచిది. బరువైన పదార్థాన్ని అందించడం మాని లఘువైన, శక్తిమంతమైన పదార్థాన్ని అందించాలి. అంటే క్వాంటిటీ తగ్గి క్వాలిటీ పెరగాలి, అంటే జీర్ణకోశానికి పని పెరగకూడదు. శరీరానికి అందేశక్తిలో తరుగుదల ఉండకూడదు. అప్పుడు మనస్సు చురుకుగా ఉత్సాహంగా పని చేస్తుంది. దైవస్మరణలో అప్రయత్నంగా నిలబడుతుంది. అంటే దైవానికి సమీపాన వసిస్తున్నది. అనగా ఉపవాసం

చేస్తున్నది. చూశారా! నిజానికి ఉపవాసంచేస్తున్నది. మనస్సు. దానికి సహకరిస్తున్నది మన జీర్ణకోశం. కానీ మన మేమను కొంటున్నాం. ఉపవాసంచేస్తున్నది మనజీర్ణకోశమని భ్రమపడి దానిని మాడ్చిపారేస్తూన్నాం. ఉపవాసం అంటే అసలర్థం మనకు తెలియకపోవడంవల్ల ఈ అనర్థం అంతా జరుగుతోంది. బాబోయ్! అంటూ విలవిలలాడిపోతుందా జీర్ణకోశం. విలవిలలాడి పోతూ కొందరిని దారిలోనికి తెచ్చేసుకుంటోంది. అన్నాన్ని భిన్నంచేసి తిను ఫరవాలేదు అని నచ్చచెబుతోంది కొందరికి - రకరకాల ఫలాలను తిన్పిస్తోంది - ఇంకొందరిచేత వండింది తినకుండాఉంటేచాలు అని నచ్చచెప్పుకొనేటటుచేస్తుందివారిని. ఇంకొందరిని అన్నంరూపంలో కాకుండా, అదికూడా వరి అన్నం రూపంలో కాకుండా ఇంకా ఏరూపంలో ఎంతతీసుకున్నా అది ఉపవాసమేనని అనుకునేటట్లు చేస్తుంది.

దానితో పళ్ళకొట్లకూ, బేకరీలకూ, మిఠాయి దుకాణాలకూ, హోటళ్ళకూ, రద్దీ పెరుగుతుంది. ఉపవాసం చేసిన వారి సిద్ధిమాట ఎలాఉన్నా, అందువల్ల పెరిగినరద్దీతో ఆయా వ్యాపారాలవాళ్ళకు ఎక్కువమోతాదులో లాభంమాత్రం సిద్ధిస్తూ ఉంటుంది. ఇలా రకరకాల వికారాలపాలైన ఉపవాసవ్రత నిర్వహణతో జరగవలసిన ధర్మసంస్థాపన చాలా ఉంది."

ఉపవాసవ్రతం, దాని ఫలం మాకు సిద్ధించినట్లయింది. ఆయన మాటల ఊతంతో మామనస్సు ఆయనకు మరింత దగ్గరౌతోంది.

మాలోని అశక్తిని గమనిస్తూ ఆయనింకా ఇలా అన్నారు: ఉపవాస వ్రతంలోనే కాదు. మనస్సుతో పని చేయవలసిన వాళ్ళందరూ జీర్ణకోశానికి బరువైన పని చెప్పకుండా మెలకువ గలిగి ఉండాలి. మనం చూస్తూఉంటాం: కాయకష్టం చేసేవారు తీసుకున్నంత ఆహారం మానసికంగాపని చేస్తున్నవారు తీసుకో లేరు. శరీరంతో పని చేయవలసినవాళ్ళకు జీర్ణకోశానికి పని చెప్పకతప్పదు. చెప్పడం అవసరం వాళ్ళకు మనస్సుతో పెద్దగా పని ఉండదు. వాళ్ళమనస్సు పెద్దగాపని చేయుదుకూడా మానసిక మైన కృషి చేయవలసినవాళ్ళకూ జీర్ణకోశానికి తగుమాత్రంగా, వాళ్ళ కృషికి తగినమాత్రంగా పని చెప్పవలసిఉంటుంది. వీళ్ళకు మనస్సు పని చేసినంత శక్తిమంతగా శరీరం పని చేయకపోవడం మనకు కన్పిస్తూనే ఉంటుంది.

ఒక్క యోగసాధనలో ఒడుపు చిక్కినవారికిమాత్రం వారు పాటించే క్రమశిక్షణనుబట్టి శరీరం మనస్సు సందర్భాన్ని బట్టి శక్తియుక్తులను వ్యక్తం చేయగలిగిన స్థితిలో ఉంటాయి. కనుకనే వారు కర్తవ్యనిర్వహణానికి అనుగుణమైన ఆహారాన్ని ఎప్పటికప్పుడు ఎన్నుకొని స్వీకరిస్తూ ఉంటారు.

ఆయన చూపులు వివరణ ముగిసిపోయింది కదా! అని అడుగుతున్నట్లున్నాయి. ఇప్పటికే కాదు. ఎప్పటికీ కావలసినది కనిపెట్టి అందించే ప్రేమస్వరూపం ఆయనది. అడిగినదే తడవుగా ఆయాలోకాలలోనికి అడుగులు వేయించేస్తారాయన.

# గోళ్ళు కొరక్కు

ఒకరోజు రాత్రి పనిని పూర్తిచేసి పడుకోబోయేముందు మాస్టరుగారితో ఇష్టాగోష్ఠి నడుపుతున్నాం. రోజూ అలా కాసేపు ముచ్చటలాడుకొని ఆ అనుభూతిలో నిద్రలోనికి వెళ్ళిపోవడం మాస్టరుగారితో ఉన్న మాయువకులందరికిఅలవాటు. నడుస్తున్న సంభాషణలోపాల్గొంటూనే ఒక కుర్రవాడు తనకు మరీ ఇష్టమైన పనిని కొనసాగిస్తున్నాడు. అంటే గోళ్ళుకొరుక్కుంటూ కథను వింటున్నాడు. మాస్టరుగారి కళ్ళు అతనిపైన బడ్డాయి. అది గమనించిన ఆ కుర్రవాడిముఖంలో కొంచెం జంకు గోచరించినది. కాని చేయకుండా ఉండలేక పోతున్నాడతను.

కృష్ణస్వామి అతని కళ్ళలోనికి సూటిగా చూస్తూ ఇలా అన్నారు: ఒరేయ్! గోళ్ళు కొరక్కు! అది ఏవిధంగాను మంచి అలవాటుకాదు. పెద్దవాళ్ళలో ఉన్నప్పుడు అలాచేస్తే అసభ్యంగా ఉండి అసహ్యాన్ని కలిగిస్తుంది. పెద్దవాళ్ళముందు కొరకడం మానాలిఅంటే విడిగా, ఒంటరిగా ఉన్నప్పుడుకూడా నీవు గోళ్ళు కొరకడం మానాలి.

కొంచెంసేపాగి కృష్ణస్వామి ఇలా అన్నారు. గోళ్ళు కొరకడం నరాల బలహీనతను [Nervesness] తెలియజేస్తుంది. సన్నివేశాలు ఒకస్థితినిదాటినపుడు అవి మంచివైనా, చెడ్డవైనా, ఎక్కువగా స్పందిస్తారనీ, తట్టుకోలేరనీ తెలుస్తుంది. కొందరు మరీ నరాలవత్తిడి అనుభవించే వారుంటారు. (Emmotional Fellows) వాళ్ళు రక్తం కారిపోతున్నా గోళ్ళు

కొరుకుతూనే ఉంటారు. అంతే గోళ్ళనుదాటి వ్రేళ్ళకూడా కొరికేస్తున్నారన్నమాట!

ఒకసారి మేము ఒక సినిమాకు వెళ్ళాం. సినిమా హాలులో మా ప్రక్కన ఒక కుర్రవాడు కూర్చునిఉన్నాడు. చాలా చురుకైనవాడే. ఇంటర్వెల్‌లో మాతో కబుర్లుకూడ చెప్పాడు. ఆతరువాత ఒక అరగంటకు అతనివైపు చూశాను. అతని మోచేతిక్రిందనుండి రక్తం ధారగా కారుతోంది. అతనిచేయంతా రక్తంతో తడిసిఉంది. ఇంకా అతను గోళ్ళు కొరుకుతూనే ఉన్నాడు. ఏంలేదు. సినిమాలో పట్టయిన సన్నివేశం నడుస్తూ ఉన్నది దానికితట్టుకోలేక ఆపనిచేస్తున్నాడతను. కొద్దిగా అతన్నితట్టాను. నావైపు చూసిన అతనిచూపుల్ని ఆచేతివైపుకు మరల్చాను. ఆదంతా ఎప్పుడుజరిగిందో తనకు తెలియదన్నట్లు చూస్తున్నాడతను. జేబురుమాలుతో తుడుచుకున్నాడు. మళ్ళీ సినిమాలో నిమగ్నమయ్యాం కాసేపాగి అటు చూశాను. మళ్ళీ అతనుతనకుతెలియకుండానే గోళ్ళుకొరకడానికి ఉద్యుక్తుడవుతున్నాడు. నేను చెయ్యిపట్టుకున్నాను. "సారీసార్! ఏమిటో ఇదొక బాడ్‌హాబిట్. మనస్సుకేమాత్రం టెన్షన్ వచ్చినా నాకు తెలియకుండానే ఇలా జరిగిపోతూ ఉంటుందండి అన్నాడతను.

"మాస్టరుగారూ, మరి హోమియోలో దీనికికూడా మందుఉంటుందంటారుగదా", అడుగాడొక సోదరుడు.

"దీనికని ఉండదు. మనిషికని మందువేస్తే ఈలక్షణం కూడా దానికదిగా తగ్గిపోతుంది" అంటూ అసలుసంభాషణలోకి వచ్చాడు కృష్ణస్వామి.

# ఆ తల్లీ బిడ్డల్ని చూడు!

ఉదయం తొమ్మిదిన్నర అవుతోంది. డిస్పెన్సరీ అప్పుడే పూర్తయింది. మాస్టరుగారు మంచంమీద కూర్చుని జవాబులు వ్రాయవలసిన ఉత్తరాలను పరిశీలిస్తున్నారు. ఆ జవాబులను వ్రాసిపెట్టేందుకు అంతరంగికుడైన యువకుడొకడు తగిన పరంజామాతో తనపనికి తాను సిద్ధమవుతున్నాడు. మేము ఒక ముగ్గురం యువకులం ఇవతలగా కూర్చుని ఏదో అంశంమీద మాట్లాడుకొంటున్నాం. మాస్టరుగారు మమ్మల్ని గమనిస్తోన్నట్లుగా మాకు తెలియదు. మా కబుర్లను విన్నంతసేపు విని, మాలోని ఒక యువకుణ్ణి తన చెంతకు పిలిచారు ఆయన.

"ఏరా! మంచి గ్రాంధికభాషలో మాట్లాడేస్తూన్నావ్! నీ ఆవేశం, నీ భాష ఒకదానితోఒకటి పోటీపడుతున్నాయి. మధ్యమధ్యలో మన పుస్తకాల్లోని అంశాలు పేరాలకుపేరాలు అప్పచెప్పేస్తున్నావ్. ఉపన్యాసాలిచ్చి జనాన్ని దుళ్ళగొట్టేయడానికి బాగా పనికివస్తావురా!" అన్నారు కృష్ణస్వామి.

"అంతా మీ అనుగ్రహం మాస్టరుగారండీ!" అంటూ మరింత ఆవేశంతో ఊగిపోతూ పలికాడా యువకుడు.

"నీ ఆనందంకూడా ఆవేశంగానే ఉందిరా! అదిసరేగాని భోజనం చేసేటప్పుడు మీ అమ్మకుకూడా ఇలాంటి డైలాగులే వినిపిస్తున్నావటగా!" అని అడిగారు కృష్ణస్వామి.

"మీకెలా తెలిసిందండీ! అయ్యో! నా మొహం, మీకు తెలియకపోవటమేమిటండీ! అవకాశంవచ్చినప్పుడల్లా ఇలా

వినిపించేస్తూనే ఉంటానండీ" అంటూ ఇక మీరు మెచ్చుకోవ
దమే తరువాయి అన్నట్లు చూశాడా యువకుడు

"అయితే కొంప ముంచేస్తూన్నావన్నమాట," అన్నారు
కృష్ణస్వామి.

"అదేమిటండీ! అలా అంటారు" అన్నాడు ఆ యువ
కుడు ఆశ్చర్యపడుతూ

"లేకపోతేఏమిట్రా! మీఅమ్మ అసలే అమాయకురాలు.
ఉత్త వెర్రిబాగులది. నీ డైలాగులుచూసి హడలిపోతోంది -
ఎప్పుడు ఏక్షణంలో నీవేంచేస్తావోనని. ఈ డైలాగుల పిచ్చితో
పడి నీవెక్కడ ఇల్లొదిలిపెట్టి వెళ్ళిపోతావోనని బెంబేలెత్తి
పోతోంది. నీకిటు అన్నంపెడుతూ తానటుతిరిగి కొంగు అడ్డం
పెట్టుకొని వెక్కివెక్కి ఏడుస్తోంది. నువ్వేమో నీలోకంలో
విహరిస్తూ ఉంటావు. "తల్లిరూపంలోఉన్న ఓ జీవీ! నీ తృప్తి
కోసం తింటున్నాను. పోసిరే కొంచెం అన్నంపెట్టు! అన్నట్టు
ఆమెవైపు చూస్తూవుంటావ్. ఆ నీ చూపుల్ని చూస్తోన్నకొద్దీ
ఆవిడకు మరింత పిచ్చెక్కిపోతోంది" అన్నారు కృష్ణస్వామి
మందలింపుస్వరంతో.

ఆ యువకుడు తనకు ఎదురుదెబ్బ తగిలినట్లుగా
అయ్యాడు. తానేదో ఉత్సాహంతో సాగిపోతున్నాననుకొంటు
న్నాడు. ముందువెనుకలు చూసుకోవటంలేదని ఇప్పుడే అతని
కర్థమవుతోంది. తనలోతాను ఆలోచనలోపడి కొంచెం దీనంగా
చూసున్నాడతను మాస్టరుగారివైపు.

మాస్టరుగారిలా అన్నారు : నీవు నీలోకంలో ఉండి నీ భాషలో మాట్లాడుతున్నావు. మీ అమ్మ తనలోకంలో ఉండి నీవేమిటో అంతుపట్టక బెంబేలుపడుతూ చూస్తోంది. కొంచెం ఆవేశం తగ్గించు. తల్లిదగ్గర ఉపన్యాసకుడిగా ఉండటం మాని, బిడ్డగా ఉండటం నేర్చుకో. నీ ఉపన్యాసాలలో ఉదరపోషణం, పాత్రపోషణం అంటూ దంచుతూ ఉంటావుగా, ముందిక్కడ నీ పాత్రపోషణగురించి చూడు. తల్లిదగ్గర బిడ్డగా ఉండటంలో నీకు ప్యాసుమార్కులన్నా వచ్చాయో లేదో చూసుకో. పెద్దల గ్రంథాల్లోని పేరాలను అప్పచెప్పడం కాదు, ఆ పేరాలలోని సూత్రాలను అభ్యసించడం చేతకావాలి. ఏమంటావ్ ?

"అర్థమయిందండీ ఇంతకాలం ఈ అంశాన్ని గమనించలేకపోవడం నాలో కరుడుగట్టుకుపోయిన మూర్ఖత్వాన్ని తెలియజేస్తోందండీ" అన్నాడా యువకుడు చెమ్మగిల్లుతున్న కన్నులతో.

"ఎవరితో ఎలావుండాలో వారితో అలా ఉండగలగడమే పాత్రపోషణం అంటే. అలా ఉండగలగడానికే ఈ సాధనంతా. ఇలాంటి పాత్రపోషణలో పరిపూర్ణుడు శ్రీకృష్ణుడు భారత భాగవతాలు చూస్తే, ఎవరికి కావలసిన కృష్ణుడు వారికుంటాడు తప్ప అసలు కృష్ణుడంటూ ఒకడు ప్రత్యేకించి కనబడడు. గోపికల కృష్ణుడు గోపికల కృష్ణుడే! యాదవుల కృష్ణుడు యాదవుల కృష్ణుడే. పాండవుల కృష్ణుడు పాండవుల కృష్ణుడే. కౌరవుల కృష్ణుడు కౌరవుల కృష్ణుడే. ఎవరికి కావలసిన కృష్ణుడు వారికుంటాడు, కొంచెం ఎక్కువా ఉండడు, కొంచెం తక్కువా

ఉండడు ఎక్కడ ఎలా అవసరమో అక్కడ అలా ఉంటాడు. ఎవరికివారికి వారి కృష్ణుడుగానే ఉంటాడు ఎవరినీ వదలడు. ఎవరికీ చిక్కడు.

కురుక్షేత్రం అయిపోయిన తర్వాత ద్వారకకు వెళ్ళాడు కృష్ణుడు. అప్పటికాయన వయస్సెంతో తెలుసా? డెంభై ఏళ్ళకు పైన. అంతఃపురంలోనికి ప్రవేశిస్తూఉంటే అతణ్ణి చూచిన తల్లులకు స్తన్యం స్రవిస్తుంది అంటే అర్థం ఏమిటి? ఆ తల్లులకు అతడు చంటిబిడ్డగానే గోచరించాడన్నమాట. మూర్ధాభిషిక్తుడైన బిడ్డడుగా గోచరించాడు తప్ప వయస్సు ముదిరిన వృద్ధుడిగా గోచరించలేదు భగవద్గీత చెప్పిన ప్రవక్తగా గోచరించలేదు. ఆ తల్లులు అతనిలో తమ బిడ్డను చూడదలుచుకొన్నారు తప్ప, ఒక పెద్దనో, ఒక ప్రవక్తనో చూడదలుచుకోలేదు కనుక వారికి వారి బిడ్డగానే గోచరించాడు. చూశావా! ఆ తల్లీబిడ్డల కథ. కనుకనే అతడు పాత్రపోషణలో పరిపూర్ణుడు. ఈ జగత్తుకు గురువు అయ్యాడు. ఏమంటావ్!" అంటూ అతణ్ణి వెన్నుతట్టారు కృష్ణస్వామి.

"ఎలా నడచుకోవాలో బోధపడిందండీ! ఇంకెప్పుడూ ఇలా ఎదుటివాళ్ళకు ఇబ్బంది కలిగేటట్లుగా ప్రవర్తించను" అంటూ కృష్ణస్వామి పాదాలకు నమస్కరించాడు ఆ యువకుడు. అతని హృదయం ఆర్ద్రమై అతని కన్నులనుండి బాష్పాల రూపంలో వెలువడి మాస్టరుగారి పాదాలను స్పృశిస్తోంది.

ప్రేమకురిసే కన్నులతో చూస్తూ అతని వెన్ను నిమురుతున్నారు కృష్ణస్వామి.

# ఉద్యమానికి తెలుసు

"మీకు తెలుసుగా! మనవాడు! అతనికి స్టేషనరీషాపు ఉన్నదిగదా! మనకు కావల్సిన స్టేషనరీని అతనినుండి డొనేషన్‌గా తీసుకోమంటారా! అతనికిదేం పెద్దవిషయం కాదుగదా!" అడిగాడు మాలోని ఒక యువకుడు.

కృష్ణస్వామి అతనిలోనికి చూస్తూ ఇలా అన్నారు: "తొందరపడకూడదు. మనకు కావల్సినవి వాళ్ళదగ్గర ఉన్న మాట నిజమే! కానీవాళ్ళు ఈ మంచిపనికి సిద్ధంగా ఉండొద్దూ! వాళ్ళు సిద్ధపడకుండా నీవు అడిగావు అనుకో. వాళ్ళు మన ఉద్యమాన్ని చిన్నచూపుచూస్తారు వాళ్ళపైన ఆధారపడి ఇది బ్రతుకుతున్నట్లుగా భావిస్తారు. ఇప్పుడు అవకాశంలేదు. ఇంకో సారి చూద్దాం అంటూ అవమానిస్తారు.

మనం మన ఉద్యమాన్ని ప్రాణంగా చూచుకొంటున్న వాళ్ళం మన ప్రాణాలన్నీ దానిపైనే నిలుపుకొన్నవాళ్ళం. అనుక్షణం దానికి అనుగుణంగా జీవించడానికి ప్రయత్నిస్తున్న వాళ్ళం అలాంటప్పుడు చిన్నచూపు చూడబడేస్థితిలో మన ఉద్యమాన్ని మనం పెట్టవచ్చా? దాన్ని పెంచడంకోసం అని శ్రమపడుతూ దాన్ని కించపరచవచ్చా?

మనఉద్యమం సజీవమైనది. సజీవమైనదిఅంటే లోక శ్రేయస్సుకై నిరంతరంపనిచేస్తున్నది. సజీవమైన ఈఉద్యమం

చాలా శక్తిమంతమయినది. తనకు కావల్సినవాళ్ళను తానే వరించగలదు. ఆకర్షించుకోగలదు. నిన్నూ, నన్నూ ఆకర్షించు కొన్నదెవరు ? ఆ ఉద్యమం కాదా ! పనిచేయడానికి మనలాంటి వాళ్ళను ఆకర్షించుకొన్నట్టే పనిజరగడానికి కావల్సినవాళ్ళను కూడా అదే ఆకర్షించుకొంటుంది. అడిగితే సహాకరించేవారు కాదు. అడుగువేసి సేవించుకొనేవారిని అదే స్వీకరిస్తుంది. ఉద్యమనిర్వహణలో నీ పనితనం వ్యక్తం కావాలితప్ప నీ తాప త్రయాలకు గుర్తై, ఆ ఉద్యమం పతనం కాకూడదు." ఆయన వదనం మరింత గంభీరంగా ఉంది. కాసేపు నిశ్శబ్దం.

ఉద్యమం పతనమౌతుందంటావా ! కాదు. అయినట్టు కనబడుతుంది. మనం దానికి తగినట్లు ప్రవర్తించనపుడు అది పడిపోదు. మనను విడిచిపెట్టిపోతుంది. ఎన్నోసంస్థలను అదలా విడిచిపెడుతూనే వచ్చింది. ఇపుడు మనవంతు వచ్చింది మన. పాత్రతనుబట్టి అది మనతోఉంటుంది. ఆ పాత్రత ఎంతకాలం మనలో నిలబడితే అంతకాలం అది మనతో నిలబడుతుంది. మనని నిలబెడుతుంది.

మళ్ళీ కాసేపు మౌనం ! ఆయన ఆకాశంవైపు చూస్తు న్నారు. మళ్ళీ కాసేపు ఆ యువకునివైపు చూస్తున్నారు. కొంతసేపు అలాగడిచింది.

"ఇంతకూ ఉద్యమాన్ని మనం నడిపిస్తున్నామా ? ఉద్యమం మనని నడిపిస్తున్నదా ?

ఉద్యమమే మనని నడిపిస్తున్నది. దానివల్లనే మనము నలుగురూ తెలుస్తున్నారు. వారిలో ఎవరెవరు ఎప్పుడెప్పుడు తన నిర్వహణలో పాలుపంచుకోవాలో ఆ ఉద్యమానికి తెలుసు. మనవంతుపాత్ర మనం నిర్వహిస్తూవుంటే ఎవరిపాత్ర వచ్చి నప్పుడు వాళ్ళు తెరలు తొలగించుకొని ప్రవేశిస్తారు. ఎవరినీ మనం చిన్నచూపు చూడనక్కరలేదు. అలాగే తొందరపడి వారి పాత్రరాకముందే వారినిపిలిచి ఉద్యమాన్ని వాళ్ళ చిన్న చూపు చూచేటట్లూ చేయగూడదు

మనం అందరినీ ప్రేమతో చూస్తూవుంటే వాళ్ళ సమయం వచ్చినపుడు ప్రవేశిస్తూ ఉంటారు. ఏమంటావ్ !"

ఆ యువకుడు తేరుకోలేకపోతున్నాడు. అతనికేవేవో దృశ్యాలు గోచరిస్తున్నాయి క్రమంగా తేరుకుంటూ అతనిలా అన్నాడు. "మీ వాక్కులు సరసంగా ఉండటమే ఇప్పటిదాకా గమనించగలిగానుగాని, ఇప్పుడీ వాక్కులు చాలా భారంగా, లోతుగా ఉన్నాయి".

కృష్ణస్వామి నవ్వుతూ ఇలా అన్నారు. "నవ్వుతూ నవ్వించేవాళ్ళు అమాయకులైనా అయివుంటారు, అతీతులయినా అయివుంటారు. కొందరు అతీతులై ఉంటూ, అమాయకులుగా నవ్వుతూ ఉంటారు."

ఆ యువకుడు అలా చూస్తూ ఉండిపోయాడు.

# రూపాయలు - రూపాలు

ఒక సోదరుడిలా అడిగాడు- "మాస్టరుగారూ! మనచేత ఎంతో సేవచేయించుకున్నవాళ్ళు, మనద్వారా మేలుపొందిన వాళ్లు ఎంతోమందివుంటారు. కానీ మనకు అక్కరకలిగినప్పుడు, మనం ఇరుకునపడినప్పుడూ వాళ్ళలో ఒక్కరూ సహకరించక పోతే ఎలావుంటుంది? ఈ చేసిన మంచిపనికి ఫలితం ఇంతేనా అనిపించదూ? అసలు మంచిపని చేయడమే అనవసరమనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు".

కృష్ణస్వామి ఇలా అడిగారు "ఔను, అదిసరేగానీ, నీవు ఇరుకునపడ్డప్పుడు నిజంగా నీకేవిధమైన సహాయమూ అందిరాలేదా?"

సోదరుడు: "వచ్చిందనుకోండి! అది నేనంటే పెద్దగా తెలియనివాళ్ళూ, నిజానికి నాతో పెద్దగా అవసరంలేనివాళ్ళూ ఆవేళటికి అనుకోకుండా కలిసివస్తున్నారు. పని గడచిపోతుంది. నా బాధ ఏమిటంటే, ఈపని చేయించుకున్నవాళ్ళెందుకు చేయరా! అని".

కృష్ణస్వామి ఇలా అన్నారు. "నీవు ఇవ్వాళ బ్యాంకులో డబ్బులు వేశావనుకో. ఒక వారంరోజులతర్వాత వెళ్ళి మళ్ళీ తీసుకుంటావు అప్పుడు లెక్క సరిపెడతాడుగానీ, ఆ వేసిన నోట్లే నీకు మళ్ళీ ఇస్తాడా? నేనువేసిన నోట్లే, ఆ నెంబర్లు

ఉన్నవే నాకు కావాలి అంటే. ఏదెవడురా! పిచ్చివాడిలా ఉన్నాడన్నట్లు చూస్తాడు.

అలాగే నీవు ఒకరికి సహాయం చేస్తున్నావు. ఇంకొకరు నీకు సహాయం చేస్తున్నారు .... సహాయం చేసినందుకుగాను నీవు సహాయం పొందుతూనేవున్నావు. అయితే ఆమనిషే చేయాలని నువ్వు మంకుపట్టు పట్టకూడదు అది పిచ్చితనం. అపట్టు విడిస్తే ఉన్నది సంతోషమే.

సహకరించినవాడు సహకారం పొందుతూనే ఉంటాడు. ఆదరించినవాడు ఆదరణ పొందుతూనే ఉంటాడు. అయితే బ్యాంకులో రూపాయలు మారినట్టు ఇక్కడ రూపాలు మారతాయి అంతే! నెంబర్లు మారినట్టు మెంబర్లు మారుతారు. నీవు ప్రకృతిలో ఒకరూపానికి సహకరించావు. ఆ ప్రకృతి మరొక రూపంతో నీకు సహకరిస్తున్నది. ఆకృతులను వేరుగాచూడటం గాకుండా ప్రకృతిలో భాగాలుగా చూడటం నేర్చుకో. ఆకృతులను వేరుగా చూచినపుడు కలిగేది ఆవేదన. ఆ ఆకృతులను ఒకే ప్రకృతిలోని భాగాలుగా చూచినపుడు పెరిగేది ఆరాధన".

ఆ సోదరుడి మనస్సుకుపడిన ముడివిడింది. మనస్సుతో పాటు అతని పెదవులు చిరునవ్వుతో వికసించాయి.

# తలుపును కొట్టినా!

ప్రేయరు పూర్తయింది. లేచివచ్చి తను పనిచేసేచోట కూర్చున్నారు కృష్ణస్వామి. అటువైపు దూకుడుగా దేనికోసమో వెతుకుతున్న మాలోని ఒక యువకుణ్ణి పనిచేసుకుంటూనే గమనిస్తున్నారు. ఇంతలో మళ్ళీ అతను తిరిగి అటువైపుకు వస్తున్నాడు. కృష్ణస్వామి అతన్ని దగ్గరకు రమ్మని సైగచేశారు. కూర్చోమని బల్లచూపించారు. అతణ్ణి కూర్చోనిచ్చారు. కొంతసేపు పనివైపు చూశారు. కాసేపాగి ఆ యువకుడివైపు చూశారు. అతడు మాష్టరుగారు ఏదో తెలియచెప్పటానికే పిలిచారని గమనించాడు.

కృష్ణ :- ప్రేయరుకుముందు స్నానం పూర్తి చేశావనుకుంటాను.

సోద :- చేశానండీ!

కృష్ణ :- చేసివచ్చేటప్పుడు తలుపు వేశావా?

సోద :- ఆ! బాత్‌రూం తలుపేనా? వేసేశాను.

కృష్ణ :- వెయ్యడానికీ, వేసేసెయ్యడానికి తేడా వుంది తెలుసా!

సోద :- కొద్దిసేపు ఆలోచించి అర్థమయింది. నేను ఆ తలుపును దఢాలున లాగాను. తప్పుజరిగిపోయింది మాస్టారూ!

కృష్ణ :- బాగా చెప్పావయింది. అంటే ఆ శబాపుకు అంతబాగా దెబ్బతగిలిందన్నమాట. అంతగా దెబ్బకగలడం అవసరమంటావా ?

సోద :- కాదు, కాని కంగారులో....

కృష్ణ :- ఏ ఆహార స్వీకరణలోనో హింస తప్పదుమరిం మాయమూలప్పుడుకూడా మనచుట్టూవున్న ప్రకృతితో ఇలా ప్రవర్తించడం ధర్మమా ? మనదృష్టిలో తలుపు ఒక చెక్కముక్క. దానికి ప్రాణం లేదూఅని చాలా పొరపాటు. ఈ సృష్టిలో ప్రాణంలేనిది అంటూ ఏదీలేదు. మీకు బయాలజీలో చెప్పిన జీవ, నిర్జీవవిభాగం (Living - non living) ఆధునికశాస్త్రంలోని అమాయకత్వాన్ని తెలియజేస్తుంది. మన పెద్దలు చక్కగా చెప్పారు. ప్రాణం అన్నివస్తువులకూ ఉంటుంది. అయితే కొన్ని కదలగలిగి ఉంటాయి మరికొన్ని కదలలేనివై ఉంటాయి. తమకుతాముగా కదలగలిగేవాటిని వాళ్ళు సచేతనాలు అన్నారు. తమకుతాముగా కదలలేనివాటిని అచేతనాలు అన్నారు. అచేతనాలు అంటే ప్రాణంలేనివిగా భావించి, వాటితో మోటుగా ప్రవర్తించడం నిద్రపోతున్నవాళ్ళమీదనుండి తొక్కుకుంటూ, గెంతుకుంటూ వెళ్ళిపోవడం లాంటిది. ఇది మంచి పద్ధతే నంటావా ?

సోద :- కాదు ! అంటూ తలవంచుకున్నాడు.

కృష్ణ :- "తలుపు వేయడమే కాదు. నడవడంలో కూడా నీవు నేర్చుకోవలసింది చాలావుంది. అలా భూమి అదిరిపోయేట్లు నడవకూడదు అలాగే ఆ టవలును చూశావా! ఎలా కుర్చీపైన పారేశావో! దానివల్ల కుర్చీకీ, టవలుకూ అన్యాయం జరుగుతుంది ఆ రెండూ కలిసి రూములోని వాతావరణానికి అన్యాయం చేస్తాయి. ఆ వాతావరణం ఆ రూములో పనిచేస్తున్న వ్యక్తులపై తన ప్రభావం చూపిస్తుంది.

అర్థమవుతోంది అన్నట్లు తలఊపాడా సోదరుడు.

కొంచెమాగి కృష్ణస్వామి ఇంకా ఇలాఅన్నారు! ఇలాంటి వాళ్ళం ఇవాళ తలుపులను వీటిని నిర్లక్ష్యం చేసినట్టే, రేపు మనతో ఉంటున్న వ్యక్తులనుకూడా నిర్లక్ష్యం చేయగలం. సమాజంలో చూస్తూ ఉంటాం. ఒక్కొక్క భర్త తన భార్యను తనకు కావలసినపనిని చేసిపెట్టే ఒక పనిముట్టుగామాత్రమే చూస్తాడు. ఆమెకూ ఒక మనసుంటుందనిగానీ, ఆ మనస్సుకూ కొన్ని భావనలుంటాయనిగానీ అతనికనిపించదు. బాత్‌రూం తలుపెంతో అతనికా భార్యకూడా అంతే. ఒక్కొక్క ఆఫీసరు తనక్రింద పనిచేస్తూన్న ఉద్యోగస్తులను ఆ ఆఫీసులోఉన్న కుర్చీలను బల్లలను చూసినట్టే చూస్తాడు. వాళ్ళకీ స్వంతబుద్ధి లున్నాయని గానీ, స్వంతపను లుంటాయనిగానీ అతను గమనించలేదు. అంటే వాళ్ళను తనలాంటివాళ్ళుగా చూడలేకపోతున్నాడన్న మాట".

"ఈ దీనస్థితినుండి బయటపడటం ఎలా మాస్టారూ?" అర్తిగా అడిగాడా సోదరుడు.

ప్రేమగా చూస్తూ కృష్ణస్వామి ఇలాఅన్నారు: అదే చెప్పబోతున్నాను. ముందు మనం అచేతనాలనుకూడా సచేతనాలను చూచినట్టు చూడాలి. అంటే మన తమ్ముళ్ళను మిత్రులను ఎలా చూస్తున్నామో తలుపులను, కుర్చీలను. అలా చూడటం మొదలు పెట్టినప్పటినుంచి, అంతా మనతోటివాళ్ళేనని, కొందరు కదలుతూ మనకు సహకరిస్తున్నారని, మరికొందరు మనకు సహకరించడంకోసమే కదలకుండా ఉంటున్నారని తెలుస్తుంది. ఇంటిగోడలో రాళ్ళున్నాయి. అవి కదలకుండా ఉండటానికి ఇష్టపడాయి కనుక ఆగోడ ఉంది. నీకు ఇల్లుఉంది. అరాళ్ళే కదలడం మొదలుపెట్టాయనుకో, నీకు ఇల్లుఉంటుందా? అలాగే కుర్చీలు, తలుపులు, గిన్నెలు కదలడం మొదలుపెడితే మనకథ ఇక ఎలా ఉంటుందో చూడు.

దైవం సృష్టికథ నడపడంకోసమే కొన్ని కదిలేట్టూ, మరికొన్ని కదలకుండా ఆ కదులుతున్నవాటికి సహకరించేటట్టూ ఏర్పాటుచేశాడు. ఈ ఏర్పాటును గమనించినకొద్దీ ఆకదలకుండా సహకరిస్తున్న మన సోదరజీవులమీద మనకింకా ప్రేమకలుగుతుంది. "తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?" అన్నాడు శ్రీశ్రీ కట్టించినరాజును గుర్తుపెట్టుకున్నారుకాని దానికి రాళ్ళెత్తిన కూలీలను మరచిపోయారని. నిజానికి తాజమహల్

రూపొందటానికి వాళ్ళే కారణమని ఆయన బాధతో ఉద్ఘోషించాడు. అలాగే ఈ కదలుతున్నవాళ్ళ కదలు నడవడానికి కదలకుండా అనేకరూపాలలో నిలబడి పనిచేస్తూ అచేతనాలుగా, జడపదార్థాలుగా మనచేత చిన్నచూపుచూడబడుతున్న ఈ మూగ కార్యకర్తల మాటేమిటి ? అని అడుగుతున్నాను నేను. వాళ్ళను చైతన్యమూర్తులుగా గుర్తించండి సోదరులుగా గౌరవించండి. దైవస్వరూపాలుగా ప్రేమించండని కోరుతున్నాను నేను. ఇది కోరిక మాత్రమే కాదు. ఒక హెచ్చరిక. ఆ కదలనివాళ్ళను ప్రేమించలేకపోతే క్రమంగా మీతో కదలుతున్న వాళ్ళను కూడా, కదులుతూ మీతో పనిచేస్తున్నవాళ్ళను కూడా ఆకదలనివాళ్ళ లిస్టులో చేర్చి మీకు తెలియకుండానే మీరు అవమానించగలరు.

చుట్టూఉన్నవారిని జడపదార్థాలుగా పొరపడి పొరపడి మనకళ్ళకు ఆ 'పొర' పడి చివరకు మనలోని ఆ ప్రేమ ఇంకిపోయి. మనతో ఉన్నవాళ్ళకు మనకూ లింక్స్ తెగిపోయి మనమే జడప్రాయంగా తయారయ్యే అవకాశమున్నది. కదలని కార్యకర్తలను కదలలేని జడపదార్థాలుగా పొరబడితే క్రమంగా మనం భావించిన జడత్వం మనకే సిద్ధించగలదు. అందుకు శిక్షగా భరించలేని ఒంటరితనం మనకు ప్రాప్తించగలదు. మనం ఎందరిలో ఉన్నా ఆ ఒంటరితనం నీడలా మనను వెన్నాడి ఎవరికీ చెందని శూన్యస్థితిలో మనను నిలబెట్టగలదు. మళ్ళీ మనం దిగివచ్చి తోటివారితో కోరి శ్రుతికలుపగలిగినప్పుడు మాత్రమే ఆ ఒంటరితనం మనను విడిచిపెడుతుంది ఆ శూన్యస్థితి క్రమంగా పూర్ణస్థితిగా రూపొందుతుంది.

ఆ యువకుడి కళ్ళు కృష్ణస్వామి పాదాలను కడుగుతున్నాయి. అతని దేహం సోలిపోయి ఆయన పాదాలపై వాలిపోయింది.

ప్రేమకురుస్తున్న కన్నులతో కృష్ణస్వామి అతనివైపునకు వంగారు. వీపుమీద అతని వెన్నుతట్టారు.

“అవి కదిలేవైన, కదలనివైన అన్నిటినీ అందరినీ ఒకేలా చూడటం, ఒకే ప్రేమతో చూడటం నేర్చుకోవాలి మనం. ఇన్ని రూపాలమాటున ఉండి నాటకమాడుతున్నది ఆ దైవమేనని గుర్తించగలగాలి. ప్రహ్లాదుడు చెప్పినట్లు ఇందుగలడు అందులేడని అన్న సందేహాన్ని విడిచి ప్రతిచోట అతడికోసం వెతకడం అలవాటు కావాలి. అందరినీవదలి దైవాన్ని చూద్దామనుకోవడం అవివేకమవుతుంది కాని ఆధ్యాత్మికత కాదు. అందరిలోనూ, అందరిగానూ, కదులుతూను, కదలకుండానూ ఉన్నది ఆ దైవమేనని మనం దర్శించగలగాలి. దర్శించగలగాలి అంటే అతన్ని వెతుక్కోవాలి. శ్రద్ధగా వెతికితే అతడు కనబడతాడు. ప్రేమతో స్నేహంచేస్తే అతడు అనుభవానికి వస్తాడు.

నిజానికి ఈ సృష్టి, దైవం ఆడుతున్న ఒక దాగుడుమూతలాట. రూపాలమాటున దాగి అందుకోమంటూ ఆడుతున్నాడతడు. అందుకున్నక్షణంలో తెలుస్తుంది. నిజానికి అతడూ మనమూ వేరుకాదనీ, వేరుగా కనబడటంకూడా ఆ ఆటలో ఒక భాగమేననీ - అన్నారు కృష్ణస్వామి.

ఆ యువకుని కళ్ళనుండి జలజలా బాష్పాలు రాలుతున్నాయి. పశ్చాత్తాపంతో రాలడం మొదలుపెట్టిన ఆ బాష్పాలు క్రమంగా ఆనందబాష్పాలుగా రూపొందుతున్నాయి. అతనికే కాదు, ఆ దృశ్యంలో వున్న మాకందరికీ అదే అనుభూతి, ఒక విధమైన అచేతనస్థితి. అనుభూతితో నిండిన అచేతనస్థితి అది. మా చేత అనుభవింపబడుతున్నది. బహుశా ఇలాంటి అనుభూతిలోనే ఉంటూ ఈ అచేతనాలన్ని సృష్టికర్తలో తమ తమ పాత్రలను నిర్వహిస్తున్నాయేమోనని అనిపించసాగింది. దైవాన్ని దర్శించడానికి అడ్డుగా వున్న తెర ఏదో తొలగింపబడినట్లయింది.

కొంత తేరుకొన్న తరువాత ఆ కుఱ్ఱవాడు ఇలా అన్నాడు: “నా జీవితం నిజంగా ధన్యమైందండీ. ఆనాడు హిరణ్యకశిపుడు స్తంభాన్ని కొడితే దైవం సాక్షాత్కరించాడు. ఈనాడు నేను తబుష్షను కొడితే మళ్ళీ అలాగే సాక్షాత్కరించాడు. ఆనాటి ప్రహ్లాదుడు, ఈనాటి మీరు “కొట్టకు నాయనా! వెతికి చూడు చాలు! అంటున్నారు” అంటూ ఒకవిధమైన భావోద్వేగాన్ని అనుభవించాడతను.

“ఆ వెతకడానికి శ్రద్ధ, ప్రేమ అనే రెండు కళ్ళు కావాలి కూడా అంటున్నాను” అంటూ అతని వీపుపైన చిన్నగా చరిచారు కృష్ణస్వామి.

## సినిమా భక్తి

విశాఖపట్నంలోని మన కార్యాలయంలో ఒక ప్రత్యేక సమావేశం జరుగుతోంది. పిలిచినవారిలో కొద్దిమందే వచ్చారని సోదరులొకరు బాధగా అన్నారు.

కృష్ణస్వామి ఆయనవైపు చూస్తూ "మీరు చెప్పదలచిన వారందరికీ చెప్పారా?"

"చెప్పాముకాని" అంటూ నీరసంగా ఏదో చెప్పబోయారా సోదరుడు

మాస్టరుగారిలా అన్నారు: "మీరు చేయవలసింది చేశారు ఇక బాధపడకండి. ఇప్పటి ఈ సన్నివేశానికి ఎవరెవరవసరమో వారిక్కడికి చేరారు ఎప్పుడూ అంతే ఒక నాటకముందనుకోండి. ఆ నాటకంలో సీన్లు ఉంటాయిగదా! ప్రతి సీన్లోనూ నటులందరూ ఉంటారా? ఆ సీనుకు ఎవరెవరవసరమో వారే ఉంటారు. ఏమంటారు! మరి ఇది జగన్నాటకంగదా! ఈ నాటకంలోనూ అంతే, అసలీ జగన్నాటకాన్ని దర్శించిన ద్రష్టనుండేగదా ఆ నాటకమనే ప్రక్రియ పుట్టింది".

ఆ సోదరుడు కోలుకోసాగారు.

"కానీయండి ఇక కథలోకి దిగుదాం" అంటూ కృష్ణస్వామి చిరునవ్వు నవ్వుతూ ఆయన వీపుపైన చిన్నగా చరిచారు. మిగిలిన సోదరులుకూడా లభించిన ఈ సమన్వయాత్మకమైన దర్శనానికి పరవశిస్తూ ఇక కార్యక్రమంలోకి దిగారు.

# జీవిత చక్రం

"ఏమిటో సార్! పరిస్థితులు మరీ జటిలంగా వున్నాయి. తట్టుకోవడం కష్టంగా ఉంటోంది. పట్టుమని పదిరోజులు కూడా ఒకవిధంగా సాగకపోతే ఎలాగండీ!" అన్నారొక సోదరుడు దుఃఖంతో పూడుకుపోతున్న గొంతుతో.

కృష్ణస్వామి ప్రేమగా చూస్తూ "ఫరవాలేదు. సర్దుకుంటాయి. తరచు వస్తూవుండండి. కొంత ఉపశమనం లభిస్తుంది" అన్నారు.

ఆయన ఓదార్పును పొందుతూ "అందుకే వచ్చాను. మిమ్మల్ని చూస్తే కొంత భారమైనా తగ్గుతుందని" అన్నారు.

కృష్ణస్వామి అనునయంగా ఇలా అన్నారు: సంవత్సర చక్రంలో ఋతువులు మారుతూవుండడం, ఆ ఋతువులనుబట్టి చెట్లూ, చేమలూ, పశుపక్ష్యాదులు మొదలైనవాటిలో మార్పులు వస్తూవుండడం మనం గమనిస్తూనే ఉన్నాంగదా! ఆకురాలు కాలంలో చెట్లు మోళ్ళుగా మిగిలిపోవడమూ చూస్తున్నాం. వసంతంలో అవెళ్లే వైభవంతో మెరిసిపోవడమూ చూస్తున్నాం. ఇలాగే మన జీవితచక్రమూ తిరుగుతూవుంటుంది ఆ చక్రభ్రమణాన్ని గమనించుకొంటున్నకొద్దీ జీవితంలో పట్టుచిక్కి కర్తవ్యం మనస్సుకందుతూ ఉంటుంది. ఎవరికివారు తప్పించుకొనిపోయే ఆకురాలు కాలాలూ, అందరూ కలిసొచ్చే వసంతకాలాలూ ఒకదానితర్వాత ఒకటి మళ్ళీమళ్ళీ వస్తూనే ఉంటాయి.

"మరి తట్టుకోవటం ఎలా?" అన్నాడతను.

"ముందు చక్రాన్ని చూచి బెంబేలుపడకుండా నిలబడగలగాలి. బెంబేలుపడితే విషాదం ఆవరిస్తుంది. పెద్దల సాంగత్యంలో ఆ విషాదాన్ని తొలగించుకుంటూ మళ్ళీ దారిపడుతూ ఉండాలి.

పిల్లవాడు తనకు భయంవేసినప్పుడేం చేస్తున్నాడు - భయపడని పెద్దవాళ్ళదగ్గరకు చేరుతున్నాడు. అంతే! ఇక వాడి భయంపోతోంది వాడూ సరదాగా కబుర్లుచెప్పగలుగుతున్నాడు. ఇక్కడో చిత్రముంది. అతడా దృశ్యాన్ని మారిపొమ్మనలేదు. తాను పారిపోనూలేదు. పెద్దవాళ్ళచెంతకు చెంగున చేరుకున్నాడు అంతే ఇంకా ఆ కుర్రవాడు ఏంచేస్తాడిపుడు. ఆ సన్నివేశాన్ని గురించి ఆరాలు తీస్తాడు. పెద్దవాళ్ళు చెబుతుంటే శ్రద్ధగా వింటాడు మరోసారి ఎప్పుడయినా తనకన్నా చిన్నవాళ్ళు అలాంటి దృశ్యానికి భయపడుతుంటే వాళ్ళప్రాణానికి తాను పెద్దవాడై అభయం పడతాడు. తానువిన్న వివరాలన్ని తానుగా వాళ్ళకు గురువై ఉపదేశిస్తాడు. జీవితంలో మనం చేయవలసిందీ అదే ఎదురైన సన్నివేశాన్నిచూసి అది మారిపోవాలి అనుకోకూడదు తాను పారిపోనూకూడదు. పెద్దలచెంతకు చేరాలి. అప్పుడు భయంపోతుంది. ఆస్థానంలో ఉత్సాహం ఉదయిస్తుంది. ఆ ఉత్సాహంతో ఆ సన్నివేశాన్ని అర్థంచేసికొని మనం కర్తవ్యోన్ముఖం కావటం జరుగుతుంది" అన్నారు కృష్ణస్వామి.

"అందుకేగా మాష్టరుగారూ! మిమ్మల్ని చేరవచ్చింది. వినంగానే విషాదం తొలగిపోయినట్లుంది" అంటూ విప్పారిన ముఖంతో నమస్కరించాడతను. ●

## అలా ఆవలించకు!

నలుగురం కూర్చున్నాం. మాష్టరుగారు ముచ్చటలాడుతూనే కావలసిన అంశాలను అందిస్తున్నారు. ఇంతలో మాలోని ఒకతను పెద్దగా, వికృతంగా ఆవలించాడు.

"ఆవలించుగాని అలా ఆవలించకు. నలుగురిలో ఉన్నప్పుడు ఆవలింత, తుమ్ము మొదలైనవి వస్తే తోటివారికి ఇబ్బంది కలుగకుండా, వాళ్ళు అసహ్యించుకోకుండా ఆపని జరుపుకోవాలి" అన్నారు కృష్ణస్వామి.

మా మిత్రుడు సిగ్గుతో తలదించుకొన్నాడు. కొద్దిసేపాగి కొంచెంగా తలపైకెత్తి ఇంకెప్పుడూ ఇలా చేయను అన్నట్లు మాష్టరుగారివైపు చూశాడు.

ఆ చూపును గ్రహించిన మాష్టరుగారు ఇంకా గ్రహించవలసింది చాల ఉన్నది అన్నట్లు చూస్తూ ఇలా అన్నారు: పదిమందిలో ఉన్నప్పుడూ, పెద్దవాళ్ళముందూ, ఇలాంటి అవసరాలు ఏర్పడితే, వాటిని ఎలాజరుపుకోవాలో విరాటపర్వంలో ధౌమ్యుడు పాండవులకు చాల చక్కగా తెలియచెప్పాడు.

పెద్దలతోగాని, పై అధికారులతోగాని, యజమానులతో గాని, యేయే అంశాలలో ఎలాప్రవర్తించాలో, ఎలా ప్రవర్తిస్తే మన స్వాభిమానికి నిందుదనమొస్తుందో, మనజీవితానికీ, జీవికకూ దెబ్బతగలకుండా ఉంటుందో తెలియాలీ అంటే ధౌమ్యుని ఉపదేశం తరచు చదువుతుంటూ ఉండాలి. రామాయణ భారతాలు తెరచిచూడటానికే భయపడేస్థితిలో ఉన్నాం మనం. అవి తరచూ తెరచి తరచితరచి చదువుకొంటుంటేతప్ప మానవ జీవితం దారినపడదు ధౌమ్యుడు సందేశం ఇచ్చిన ఆఘట్టాన్ని ఇంకెప్పుడైనా వివరంగా చదివి వినిపిస్తాలే." అంటూ అప్పటి విషయంలోనికి మళ్ళీ ప్రవేశించారు కృష్ణస్వామి.

ఇంతకూ మావాడి ఆవలింత పుణ్యమా అని మాస్టరుగారి నుండి విరాటపర్వ విశేషాలు తగుమాత్రం వినటానికి వీలయింది. ●

## లోటుల నుండి లోతులకు

"ఎంతోకాలంగా మన పెద్దవాళ్ళు ఎంతగానో చెప్పు కుంటూవస్తున్న ప్రయోజనమేమి కనిపించటంలేదు వింటున్నంత సేపు ఆ పెద్దవాళ్ళ మాటలకు తలలూగిస్తారు. తాళాలు వేస్తారు. ఆతరువాత మళ్ళీ మామూలుగానే కనపిస్తారు. మరి ఈజరుగు తున్న కృషంతా ఎందుకు జరుగుతున్నట్లు ? ఏమవుతున్నట్లు ?" అని అడిగారు ఒకసోదరుడు నిస్పృహ నిండిన గొంతుకతో.

కృష్ణస్వామి ఏదో ఆలోచిస్తున్నట్లుగా చూస్తున్నారు. కొద్దిక్షణాలతరువాత ఆయన ఇలా అన్నారు "మీరు చెప్పింది నిజమే। అలా జరగడం ఈ యుగధర్మంగా కనిపిస్తుంది. వేలం మీద జనంచేరడం, వేళ్ళమీద మిగలడం, ఈయుగంలో తప్పదు. వ్యాసుడంతటివాడే ఎన్నోవిధాలుగా ప్రజల భావాలకు అద్దం పట్టి, ప్రజలభాషలో మానవజీవిత పరమార్థాన్ని విప్పిచెప్ప డానికి యత్నించినవాడే, ఎంతగా చేతులెత్తి ఘోషించినా ఈజనా నికి అతంతమాత్రంగానే అంటుతోందని బాధపడ్డాడు. "స్వధర్మ నిర్వహణమే మానవజీవితానికి పరమావధి అర్థకామాలన్నవి మానవుడికి ఆ స్వధర్మనిర్వహణనుండే సిద్ధిస్తున్నాయి. కనుక, అవి అంటే ఆ అర్థకామాలు తిరిగి స్వధర్మ నిర్వహణానికే సమ ర్పించబడాలి" - అని ఎంతచెప్పినా ప్రజలు అర్థకామాలకే ప్రాముఖ్యమిచ్చి స్వధర్మ నిర్వహణను నిర్లక్ష్యం చేస్తున్నారని, ఆ స్వధర్మాన్ని అధర్మంగా ఆచరించడానికే ఉత్సాహపడుతున్నా రని ఆయన ఎంతో మధనపడ్డాడు ఘోషించాడు. ఇంకా చెప్పా లంటే ఆక్రోశించాడు. అచ్చం ఇప్పుడు మీరు చెప్పినట్లే చెప్పాడు. ఇలాగే బాధపడ్డాడు"

ఆ సోదరుడు "అలాగా...." అన్నట్టు వింటున్నారు.

కొంచెంఆగి కృష్ణస్వామి మళ్ళీ ఇలా అన్నారు. "ఇప్పుడు కూడా మనం చూస్తూవుంటాం - మా కష్టాలు తీర్చమనీ, అవి తీరేమార్గం చెప్పమనీ, ఆశీస్సులు, విభూతి అందించమనీ, తమ

తరవాత దేవునికి రికమెండు చేయమని అడిగేవాళ్ళే ఎక్కువ మంది ఉంటారు తప్ప. మాకు జీవించడం నేర్పమని అడిగేవాళ్ళు ఎందరుంటారు ? ఉదాహరణకు E. K. మాస్టరుగారిని ఒక వైద్యుడిగా ఉపయోగించుకున్నంతమంది ఒక గురువుగా, ఒక మార్గదర్శకునిగా, నవశకానికి నాందిపలికిన ఒక ఉద్యమకారునిగా వినియోగించుకోగలిగారా ? గురువుగా చూద్దామనుకొని చేరిన వారిలో కూడా ఎంతమందిమి ఆయన నిర్దేశించిన మార్గాన్ని సూటిగా చూడగలుగుతున్నాము ”

కృష్ణస్వామిగారి వివరణ వింటున్న సోదరుణ్ణి ఏవేవో లోతులకు తీసుకువెళుతోంది. ఆలోతులను తడిమిచూచే ప్రయత్నంచేస్తూనే ఆయన ఇలా అన్నారు: “మరి అలాంటప్పుడు ఇంత ప్రయత్నంచేసి ఏమిలాభం ?” కొంచెమాగి మళ్ళీ ఆయనే అన్నారు: “అందుకే అన్నాడేమో కృష్ణుడు నిష్కామకర్మ చేయమని.” ఆ సోదరుడి వదనం విషాదాన్నుండి తేరుకుంటూ ఒక విధమైన గాంభీర్యాన్ని సంతరించుకునే ప్రయత్నం చేస్తున్న ఆయన మనఃస్థితిని సూచిస్తోంది.

కృష్ణస్వామి చిరునవ్వుతో “మీరన్నది నిజమే. చేయవలసింది నిష్కామకర్మే. ఫలితంమీద ఏమాత్రం దృష్టిఉన్నా ఇలా ఇంతబాధా పడవలసివస్తుందని తెలిసే కృష్ణుడు నిష్కామకర్మను ఉపదేశించాడు. ఫలితాన్ని చూడకు, పనితీరు చూచుకో అన్నాడు. పనిచేయడంలో నైపుణ్యాన్ని సాధించడమే నీవంతు.

ఇక ఫలితం అంటావా। అది సృష్టికధలో అసన్ని వేశానికి ఉన్న స్థానాన్నిబట్టి ఉంటుంది. నీ సామర్ధ్యంతో దానికేమీ సంబంధం లేదు. నీ సామర్ధ్యంతో, నీ సంసిద్ధతతో నీవు పొందవలసింది కర్మాచరణలో కౌశలాన్ని మాత్రమే.

ఇప్పుడు మీరుఅన్న అంశంలోకూడ మనం అలాంటి కౌశలాన్నే చూపవలసిఉంది. ఏవేవో బాధలతో, కోరికలతో ప్రజలు మనదగ్గరకు వస్తూఉంటారు. ధర్మబద్ధంగా వారికి కావలసినసహాయాన్ని అందిస్తూనే క్రమంగా వారిని మనం దివ్య జీవనంలోకి మేలుకొలపాలి. వారు మనదగ్గరకు ఏ ఉద్దేశ్యంతో వచ్చినా మనదృష్టిమాత్రం వారిజీవిత సార్ధక్యంపైన ఉండాలి. ధర్మబద్ధమయిన వారికోరికలనుఆమోదించి సహకరిస్తనే వారి కేది శ్రేయోదాయకమో, ఏది వారి జీవితకార్యమో ఆమార్గానికి వారిజీవితాలు మళ్ళేట్టుగా చూడాలి సరైన తల్లితండ్రులు పిల్ల లను ఎలా పెంచుకుంటూవస్తారో, అలా మనం, మనకుదగ్గరైన వారి పెరుగుదలకు దోహదంచేస్తూ పోవాలి. ఇలా జరుగుతూ ఉండగా ఎప్పటికి మేలుకోవలసిన వారు అప్పటికి మేలుకుంటూ ఉంటారు. కొందరు ఇప్పుడేమేలుకొని తమ స్వధర్మాన్ని లోక హిత కార్యక్రమంగా రూపొందించుకొని కార్యకర్తలవుతూ ఉంటారు, మరికొందరు ఇంకొంత కాలనికి మేలుకుంటారు. ఇంకాకొందరు ఊన్పుర్నను ఇప్పుడందుకొని క్రమంగా కనబ డనిప్రయాణాన్ని సాగించి, రాబోయే జన్మల్లో మేలుకొంటారు.

మొత్తానికి ప్రతిజీవి ఎప్పటికో అప్పటికి మేలుకొని లోకహితంతో శ్రుతి కలుపవలసినవాడే.

ఎవరు ఎప్పుడు మేలుకొనాలనేది సృష్టికధకు సంబంధించిన అంశం. మేలుకొన్నవారూ, మేలుకొంటున్నవారూ, మేలుకొనడానికి ఇష్టపడనివారూ, అసలు మేలుకొలుపంటూ ఒకటుందని తెలియనివారూ.... ఇందరూ రకరకాల పాత్రలు పోషిస్తూఉండగా ఈసృష్టికథ కొనసాగుతూ ఉంటుంది. అందులో మనదీ ఒకపాత్ర. ప్రకృతి మేలుకొల్పదలుచుకొన్న వారిని మనద్వారా మేలుకొల్పుతుంది. బొమ్మగీయదల్చుకొన్న చిత్రకారుడికి కుంచెలా, జీవులకు మేలుకొలుపు అందించదలచిన ప్రకృతీపురుషులకు ఈమనశరీరం ఒక ఉపకరణంగా ఉపయోగపడుతుంది. దీనినే నిమిత్తమాత్రంగా నిలబడడం అంటారు. నిమిత్తమాత్రం అంటే నిర్లక్ష్యంగా కూర్చోవడం అని అర్థం కాదు. శరీరాన్ని, మనస్సును శుద్ధిచేసుకొని, బుద్ధిసారథ్యంలో, జరుగవలసిన కథలో మన పాత్రపోషణకు సిద్ధంగా ఉండడం అని అర్థం. అలా నిలబడే ప్రయత్నం చేయడానికే మనం ఇక్కడ ఒక బృందంగా చేరాం."

సోదరుడు విండుగావన్నారు "విషాదయోగంలో నుండి అర్జునుణ్ణి కృష్ణుడు ఎలాలేవనెత్తాడో ఇప్పుడు నాకర్థమయింది." అంటూ ఒకక్షణం కన్నులుమూసుకొని ధ్యానంలో ఉండిపోయారు. కాస్తాగి....మెల్లగా కన్నులు తెరిచారు. ఆ కన్నులు

కాంతివంతంగా ఉన్నాయి. ఆచూపులు కృష్ణస్వామిపై లగ్నమై ఉన్నాయి. ఏదో దివ్యమైన స్ఫూర్తిని పొందుతున్నట్లుగా కనిపించారాయన. ●

## ఇంక వారికి శ్రమెందుకు?

అప్పటికి మాస్టర్ E. K. శరీరంతో ఉన్నారు. ఆరోజు ఆగస్టు పదకొండవతేదీ. E. K. మాస్టరుగారి పుట్టినరోజు. ఉత్సవానికి రంగమై ఆంధ్రాయూనివర్సిటీ అసెంబ్లీహాలు కళకళలాడుతోంది. సమయం ఐదున్నర దాటుతోంది సోదర బృందం బృందాలు బృందాలుగా ఉత్సవ రంగానికి తరలివస్తున్నారు. అప్పటికే అక్కడకు చేరిన కృష్ణస్వామి సోదరబృందంలోని ప్రముఖులతో ఆహ్లాదకరమైన సంభాషణలు జరుపుతున్నారు.

అందులో ఒకాయన "ఇవ్వాళ మీ ఉపన్యాసం ఉందనుకుంటాను" అన్నారు.

"ఉందండీ!" అన్నారు కృష్ణస్వామి.

"అదీ! ఒక అదృష్టం! అదంతా పూర్వజన్మసుకృతం. మీరు పొందుతున్న అనుభూతుల్ని చక్కగా విప్పిచెప్పగలరు. ఆ చెప్పడంలో మీ రేఅనుభూతితో ఉన్నారో, అదే అనుభూతి లోనికి మమ్మల్నికూడా తీసుకొనివెళ్ళగలరు. అది నిజంగా విశే

షమే. అనుభూతులు అందరికీ కలుగుతూనే ఉంటాయి కానీ అందరూ అలా చెప్పగలరా? మాలాంటి వాళ్ళం అనుభవిస్తూ మూగపోతుంటాం తప్ప ఏంచేయగలం? మీరు చెబుతున్నపుడు ఒక ఆనందం కలుగుతుంది. మేం అనుభవిస్తున్నవి, మేం చెప్ప లేనివి మీరు చెబుతున్నారుగదాఅని! మేంచెప్పాలనుకొని చెప్ప లేక పోతున్నవాటికి మీరు అక్షరరూపం ఇస్తున్నారుగదాఅని. మాకదివాలు. అందుకే మీ, మా మధ్య ఏదో అనుభూతి. మా హృదయాలు మీగొంతునుండి పలుకుతున్న అనుభూతి అది"

ఆయన కనులనుండి ఆనందబాష్పాలు రాలుతున్నాయి. ఆయన రెండుచేతులు కృష్ణస్వామిని చుట్టేస్తున్నాయి. పరివారాలు ఆయన వ్యూహానుండి జారిపోతున్నాయి.

కృష్ణస్వామి ఆయన రెండుచేతుల్ని ప్రేమగా తన చేతు ల్లోకితీసుకొని చిన్నగానొక్కుతూ ఇలాఅన్నారు; మీరుచెప్పింది అక్షరాలానిజం మీ అందరిహృదయాలు నాగొంతునుండి పలుకు తున్నాయి. మనందరి గొంతుగా పనిచేయడమే నావంతుగా నాకు దర్శనమిస్తూ ఉంటుంది. మన బృందాన్ని ఒక మానవశరీరంతో పోల్చుతున్నప్పుడు, ఆశరీరానికి గొంతునేను. అలాగే మనలో ఎవరి స్వభావాలనుబట్టివారు మిగిలిన శరీరభాగాలుగా పనిచేస్తూనే ఉన్నారు. కొందరు ఊపిరితిత్తులుగా, కొందరు గుండెకాయగా, ఇంకొందరు అస్థిపంజరంగా, మరికొందరు రక్తనాళాలుగా ఇలా ఎందరెందరో, ఎన్నెన్నోభాగాలుగా పనిచేస్తూనే ఉన్నారు. ఎవరి

పాత్రవారు పోషిస్తూనేఉన్నారు. అలాపోషిస్తూఉంటేనే ఇంతకథ నడుస్తూఉన్నది. అన్నిపాత్రలూ కావలసినవే. ఏమంటారు?"

కృష్ణస్వామి ఆయనవైపు ప్రేమగా చూస్తున్నారు. 'అవునా?' అన్నట్లు కనురెప్పలు అల్లల్లాడిస్తున్నారు.

"మీరెప్పుడూ ఇంతే, ఏ విషయాన్నయినా ఇట్టే సమన్వయంచేసి చెప్పేస్తారు. అవతలవాళ్ళకు మళ్ళీ మాట్లాడేందుకు లేకుండాచేస్తారు" అంటూ అభినందనగా చూశారాయన.

"అందరితరఫున మాట్లాడేటందుకు నేనున్నానుగా. ఇంత వారికి శ్రమెందుకు?" అంటూ కోటులోపలికి దారితీశారు కృష్ణస్వామి, ప్రేయసుల సమయం సమీపిస్తున్నది అన్న భావన తమ ముఖంలో లీలగావ్యక్తంచేస్తూ.

ప్రేయసుల ముందునుండే ఆ దివ్యానుభూతి కలగడం ప్రారంభించింది. అన్నట్లు తృప్తిగాచూస్తూ సోదరులు ఆయనను అనుసరించారు.

# పెద్ద దిక్కు

ఒకరోజున సాయంత్రం ప్రార్థన పూర్తయింది. ప్రశాంతంగా కూర్చొనివున్న కృష్ణస్వామిగారి వద్దకు ప్రేయరులో పాల్గొన్న వడివయన్కులొకరు చేరారు. ఏదో చెబుదామని చూస్తూ ఉండగా అదేమిటో చెప్పండి ఫరవాలేదు అన్నట్లు చూశారు కృష్ణస్వామి.

ఆయన నిదానంగా ఇలాచెప్పారు: పరిస్థితులన్నీ తారుమారుగా ఉన్నాయి. ఏపనీ తెమలడంలేదు. ఊహించినట్టుగా ఒక్కటీ కలిసిరావడంలేదు. మనస్సంతా అయోమయంగా ఉంటోంది. ఏలినాటిశని నడుస్తోందిఅన్నారు సంధ్యావందనం, సాధనకూడా ఆగిపోయాయి. ఏమీపాలుపోవడంలేదు. నామట్టుకు నేనుఏమైనా ఫరవాలేదు, ఇంతవరకూ చూచుకొంటూవచ్చిన తల్లి దండ్రుల్ని ఇకపైనకూడా అలాగే చూడగలనాఅనీ దొడ్లోఉన్న ఆ రెండావులను పస్తుపెట్టకుండా బ్రతికించుకోగలనా అనీ మనస్సు మథనపడుతోంది. నాన్నగారు నిష్ఠాగరిష్ఠులు. ఆయన కన్నీ యథావిధాగా జరగాలి. అలా జరిపితేనే నాకు తృప్తిగా ఉంటుంది. కానీ జరపగలనా ? అని.

కృష్ణస్వామి ఇలాఅన్నారు ; మీ నాన్నగారి నియమబద్ధమైన జీవితమే మీ కుటుంబానికి శ్రీరామరక్ష. ఆయన నియమ నిష్ఠలే మీ కుటుంబసభ్యులు ఎక్కడఉన్నా ఏలోటూ లేకుండా

జీవించేటట్లు చూస్తున్నాయి మరి ఆయనకులోటు ఎందుకువస్తుంది? ఆదంపతులు మీఇంట్లో ఉండడం మీ అదృష్టం. అలాంటి దంపతులకు బిడ్డగాపుట్టామన్న తృప్తిచాలు మీకు. జీవితంలో ఎన్ని కష్టనష్టాలు, ఒడిదుడుకులు వచ్చినా, ఆతృప్తే మనను ముందుకు నడిపిస్తూవుంటుంది. ధనధాన్యాలతో కొనుక్కోందామంటే దొరికేది కాదు అతృప్తి. ఏమంటారు?

"నిజమేనండి మీరన్నది. అక్షరాలా నిజం! కానీ ఏదో భయం! ఇన్నాళ్లినుండి జరుగుతూవస్తున్న ఆ కార్యక్రమాలన్నీ ఇకపైన ఆగాల్సివస్తుందేమోనని ఏదో భయం" అన్నారాయన.

"ఎందుకాగాలి? మనం అపుదామనుకొన్నా ఆగదు ఆ గాలి. అది మనమీదుగా పాగుతూనే ఉంటుంది" అన్నారు మందహాసంతో కృష్ణస్వామి.

"ఆ గాలి అలా పాగాలనే కోరుకుంటున్నాను" అన్నారాయన తన్మయత్వంతో ఆదాకరకమైన అనుభూతినిపొందుతూ.

కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు: ఏలివాటి శవినిచూచి దడిసిపోకండి, శని ఉన్నది మనమ దడిపించడానికి కాదు, విడిపించడానికి. ఇంతవరకూ మనంచేసుకున్న అవకతవకలనుండి విడిపించడానికే అతడున్నాడు. జీవితంలో తగిన వర్దుబాట్లు చేసుకోవడానికి ఇది అనుకూలమైన సమయం. పరిస్థితులు తారుమారైపోయినట్లూ, ఏఒక్కటీ కలిసిరానట్లూ కనబడుతున్న

మాట నిజమే. ఇప్పుడు మనం చేయవలసింది బాధపడటం కాదు. అలా ఎందుకు జరుగుతోందో బోధపరుచుకొని సరిదిద్దుకోవడమే. శని ఒక చక్కని శిక్షకుని వంటివాడు. మనంచేసిన తప్పులకు తగిన శిక్ష విధిస్తున్నట్లు పైకి కనబడినా, మళ్ళీ తప్పులు దొర్లకుండా తగిన శిక్షణ ఇస్తున్నట్లు, కొంచెం లోనికి చూడగలవారికి తెలుస్తుంది. శిక్షగా అనుభవిస్తామా? శిక్షణగా స్వీకరిస్తామా అన్నది మనం నిర్ణయించుకోవాల్సి ఉంటుంది.

శిక్షగా అనుభవిస్తే కలిగేది వేదన, శిక్షణగా స్వీకరిస్తే జరిగేది సాధన. వేదనస్థితినుండి సాధనస్థితికి మనం ఎదగగలిగితే, శని మన తప్పులను మనం దిద్దుకోవడంలో మనకు సాయపడే ఒక పెద్దదిక్కుగా మనకు దర్శనమిస్తాడు. మనింట్లోనే మనలోని లోటుపాట్లను ఎత్తిచూపి, మందలించి దారిచూపే పెద్దవాడున్నాడనుకో. అది ఎంత అదృష్టం! మనం బుద్ధిమంతులమైతే ఆయనకు మరింతదగ్గరై మన లోటుపాట్లను సరిజూసుకొంటూ ఆయన సలహాప్రకారం నడుచుకోవడానికి ఇష్టపడుతాం కదా! ఈ సౌరకుటుంబానికి శని అలాంటి పెద్దదిక్కు. మానవుడు చేసిన దుష్కర్మలకు తగిన ఫలితాలు అతనికి అనుభవంలోనికి తీసుకురావడంద్వారా మరల అలాంటి దుష్కర్మలు చేయవద్దనీ, జీవితాన్ని తీర్చిదిద్దుకోమని హెచ్చరించే పెద్దదిక్కు ఆయన.

కనుక మీకు ఏలినాటిశని అని దడిసిపోకండి. సంధ్యా

వందనం. సాధన తిరిగి ప్రారంభించండి. వస్తున్న సన్నివేశా లను అర్థంచేసుకొంటూ జీవితాన్ని సరిదిద్దుకొనే ప్రయత్నం చేయండి. మీరు సరిదిద్దుకొంటున్నకొద్దీ ఆ శనైశ్చరుడు మీకు మరింత సహకరిస్తాడు. గ్రహాలు మనను శాసించేందుకు లేవు. మనకు సహకరించేటందుకే ఉన్నాయి. ఆ సహకారం స్వీక రించే స్థితికి మనం ఎదగవల్సివుంది. మానవజీవితంలోని లోటు లను గమనించుకొంటూ, జీవిత నిర్వహణంలోని లోటులను సరిదిద్దుకోవాలని అతని ప్రేమపూర్వకమైన హెచ్చరిక! ఏమంటారు?

“అంతేనంటారా!” అంటూ ఏదో బరువు దిగినట్టుగా ఫీలయ్యాడాయన. “ఇంతకీ శని మనకు పెద్దదిక్కంటారు” అంటూ చిన్నగా నవ్వాడు. మనస్సులోపల ఏదో వెలగవలసింది వెలిగినట్టుగా ఆ నవ్వులో గోచరించింది.

కొంతసేపు మౌనంగా గడిచింది.

కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు: “భారతంలో భీష్ముడు “కష్టాలు వచ్చినందుకు నేను కలతపడను. అప్పులు తీర్చుకున్నవాడు ఆ అప్పులు తీరినందుకు తృప్తిని అనుభ విస్తాడు. కాని దుఃఖపడడుకదా” అంటాడు. మనంకూడా అలాంటి దృక్పథాన్నే అలవాటు చేసుకోవాలి. “ఋణములు కడతేరెనటంచు, సుఖింతు” అన్న భీష్ముని మాట మనకు ఆదర్శం కావాలి. జీవితంలో కావల్సిన సర్దుబాట్లు చేసుకోవడా నికి వీలయిన సమయం వచ్చింది అని గ్రహించి సద్వినియోగం

చేసుకోవాలి కానీ, ఏలినాటి శని అని డీలా పడిపోకూడదు. ఏమంటారు ?

ఆయన మరికొంత కోలుకున్నట్లు కనిపించారు. కొంచెం సేపు ఆగి, ఆయన ఇలా అన్నారు : "నేను పెట్టిన మంచి కార్యాలు మాత్రం ఆగడం లేదు. ఏదో ఒక రకంగా పనులన్నీ ఒనకూడి అవి సాగిపోతున్నాయి. కాకపోతే వెనకేసింది ఏమిటీ అంటే ఏమీ లేదని మాత్రమే చెప్పాలి.

కృష్ణస్వామి నవ్వుతూ, "మీరు ముందు వేసుకుంటున్నారు. ఇంక వెనుక వేసుకోవాల్సిన అవసరమేముంది ? ముందు వేసుకోవడం చాతకానివారు వెనక వేసుకొంటారు" అన్నారు.

ఆ మాటలకాయన చిన్నగా నవ్వుతున్నారు.

కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు : "మీ నాన్నగారు ముందు వేసుకోబట్టే కదా ఈనాడు మీ అన్నదమ్ములు, అప్ప చెల్లెళ్ళు ఇలా ఉన్నారు. అలాగే ఇప్పుడు మీరు ముందు వేసుకొంటున్నారు. కనుక మీ పిల్లలకూ బెంగలేదు.

అదిగో ఆ మాస్టరుగారు ముందు వేశారు. కనుకనే ఈనాడు మేం పరిచయం అక్కరలేకుండా పని చేసుకు పోగలుగుతున్నాం. అలాగే మేం ఇప్పుడు ముందు వేస్తున్నాం. మా తరువాతివాళ్ళు కూడా ఇలాగే ముందుకు సాగిపోతుంటారు.

సంపద ఆర్జించేవాళ్ళల్లో మూడు తెగల వాళ్ళుంటారు సత్కార్యాచరణ రూపంలో ముందుకు వేసేవారు మొదటితెగ. మనం ఎలాగూ చేయగలిగిందిలేదు, పిల్లలకైనా ఉంటుంది అని వెనక వేసేవారు రెండవతెగ. ఇటూ, అటూ ఎందుకవి వ్యసనాల పాలయి వృధా చేసుకొనేవారు మూడవతెగ. ఇందులో ఏతెగకు చెంది ఉన్నామో ఎవడికి వాడు చూసుకోవాలి.

"మూడవతెగమాత్రం మరీ దారుణంలెండి." అన్నారాయన. ఒక్కక్షణంఆగి "ఇంతకూ మా ఇంటికి ఎప్పుడొస్తారు?" అనడిగారు.

"అది నాకు వదిలేయండి. నేను ఎప్పుడురావాలో నాకు తెలుసుకదా! అప్పుడు తప్పకుండావస్తాను. మీతో చెప్పకుండా వస్తాను" అంటూ ప్రేమగా చూశారు కృష్ణస్వామి.

"అంతకంటేనా! మహద్భాగ్యం." అంటూ వెలుగుతున్న వదనంతో సెలవు తీసుకొన్నారాయన.

## కస్తూరి నుండి కర్తవ్యం వరకూ

ఒకరోజు ఉదయం ఒక చురుకైన యువకుడు ప్రవేశించాడు. ఇప్పుడిప్పుడే మాస్టరుగారి ఉద్యమానికి దగ్గరై మనతో బ్రతికలపాలవి కోరుకొంటున్నవాడతను. ప్రార్థన

పూర్తయినతరువాత ఇష్టాగోష్ఠిగా మాట్లాడుతూ కృష్ణస్వామి మీ స్వగ్రామం ఏది? అని అడిగారు.

"మా అమ్మగారిది తమిళనాడు, నాన్నగారిది కర్ణాటక, మేం ఆంధ్రదేశంలో పుట్టిపెరిగాం" అన్నాడతను నవ్వుతూ.

"అయితే మీది త్రివేణీ సంగమం అన్నమాట!" అన్నారు మాస్టరుగారు చిరునవ్వు నవ్వుతూ.

ఆ యువకుడు నవ్వుకొన్నాడు.

"కన్నడ కస్తూరి అంటారు తెలుసా!" ప్రశ్నించారు కృష్ణస్వామి.

తెలుసు నన్నాడతను.

"ఇప్పటి కన్నడ కస్తూరి తెలుసునా?" అన్నారు కృష్ణస్వామి.

"ఎవరు" అన్నట్టు చూశాడతను

"పుట్టపర్తిలో బాబాగారిదగ్గర ఉంటారు. సనాతన సారధికి ఎడిటర్, మైసూరు యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా పని చేశారు రిటైరైన తర్వాత పుట్టపర్తిలో స్థిరపడ్డారు.

అలాగా అన్నట్టు చూశాడతను మంచివిషయం తెలిసిందన్నట్టుగా!

"అయినా, నేనూ చిత్రంగా కలుసుకొన్నాం. ఒకసారి నేను పుట్టపర్తి వెళ్ళాను. పెట్టెబేడా ఒకచోటపడేసి కస్తూరి గారిని కలవాలని బయల్దేరాను. ఆయన పేరు వినడం, రచనలు చదవడమేగాని మనిషిని అప్పటికి ఎరుగను. ఆయన ఎక్కడ ఉంటారో ఎవరినయినా అడుగుదామని అనుకుంటూ ఉండగా ఒక ముసలాయన కనబడ్డారు. పండుటాకులా ఉన్నారు. గట్టు మీదనుండి క్రిందకు మెట్లు దిగబోతూ ఉంటే కొంచెం తూలు వచ్చినట్టుంది. "బాబూ! కొంచెం చేయి అందిస్తావా?" అని అడిగారు. "తప్పకుండా!" అంటూ ఆయనతో చేయి కలిపాను.

చివరిమెట్టు దిగుతూ ఎవరుబాబూ నీవు? అనడిగారు. నాగురించి చెప్పి కస్తూరిగారు కావాలని అడిగాను.

ఆయన నవ్వుతూ "నేనేబాబూ కస్తూరిని" అన్నారు.

ఇద్దరం ఆదో రకమైన అనుభూతి పొందాం. ఆరాత్రి వారిని తాపీగా కలుద్దామని వెళ్ళాను. మరో వృద్ధుడెవరో ఆయనతో కలిసి భోజనం చేస్తున్నట్లు కనిపించింది. ఆ తర్వాత ఆయనవల్ల తెలిసింది, ఆ వృద్ధు డెవరో కాదనీ, వారి పెద్దకొడుకేననీ, రిటైర్ అయిపోయిన తర్వాత తండ్రితో కలిసి ఉండటానికై వచ్చారనీ.

బాగుందికదూ! తండ్రీ కొడుకుల కథ. "రిటైరైన కొడుకుతో తండ్రి! అదో అనుభూతి. అంతేకాదు వాళ్ళెంతో సరసాలాడుకొంటున్నారు నేను చూసినపుడు. ఆ తర్వాత విన్నాను

బాబాగారిపై బుర్రకథ రచించి ఆ తండ్రికొడుకు లిద్దరూ కలిసి గానంచేయసాగారని. ఇంకా సంతోషం కలిగింది. తండ్రీ కొడుకులు చాలామంది ఉంటారు. కానీ సజీవమైన అనుబంధం కలిగిన తండ్రీబిడ్డలు ఎందరుంటారు అని.

పాపం! ఆతర్వాత విన్నాను. ఆకొడుకు కాలంచేశాడని. చాలాబాధ కలిగింది. తండ్రిముందే కొడుకుపోవడం. కొడుకు తండ్రికి చేయాల్సిన విధులు తండ్రి కొడుక్కు నిర్వర్తించ వలసిరావడం, ఏమిటో చిత్రం!"

ఆ కాసేపటిలోనే ఉత్సాహం, సంతోషం, బాధ, అనుభవించాం ఆ సన్నివేశంలోఉన్న అందరం,

కాసేపు నిశ్శబ్దంగా గడచింది.

కృష్ణస్వామి ఇలా అన్నారు: చూడు ఏం జరిగిందో! ఆయనను చూడాలని గట్టిగా అనుకొనేటప్పటికి ఆయన ఎదురుగా నిలిచారు. మనం నిజంగా గట్టిగా అనుకోవాలేగాని అన్నీ జరుగుతాయి.

నాకప్పుడప్పుడు అనిపిస్తూఉంటుంది, ఈ రాజకీయనాయకులు జనాన్ని ఆకట్టుకోవడంకోసం దేశాన్ని తలచుకొంటున్నారుగానీ. వాళ్ళు నిజంగా, గట్టిగాఅనుకుంటే ఈదేశం ఎందుకు బాగవడదూ? అని, బాధపడుతుంది. కానీ వాళ్ళు గట్టిగా అనుకోవడంలేదు. ఏమంటావ్?"

"నిజమేనండీ" అన్నాడతను.

"దేశంగురించి మనకుచెబుతున్న సమయంలో ఆయా నాయకుల మనస్సుల్లో దేశం మెదలడంలేదు. వాళ్ళ పదవులు మెదలుతున్నాయి వాళ్ళు వాటినే గట్టిగాకోరుకొని, వాటినే సాధించుకొంటున్నారు. పదవికన్నా దేశశ్రేయస్సు ముఖ్యం అని వాళ్ళు గట్టిగా అనుకోగలిగితే వాళ్ళు దానిని సాధించగలుగుతారు. కానీ అలా అనుకోవడానికి చాలా తెగాలి" అన్నారు కృష్ణస్వామి.

'అవునండీ!' అన్నాడతను.

కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు: చూశావా? కస్తూరి గారిని కలవాలని నేను మనస్సులో అనుకొన్నాను. అంటే మనస్సుతో పిలిచాను. ఆ పిలుపుకు ఆయన ఎదుటనిలిచారు. అలాగే దేశం బాగుపడాలని, జాతి పునరుజ్జీవంపొందాలని మనం మానసికంగా గట్టిగా పిలుపునివ్వగలిగితే చాలు. ఆ పిలుపును జాతి తప్పక అందుకొంటుంది. స్వాతంత్ర్యఉద్యమంలో మహాత్ముడు మనజాతిని పిలిచింది అలానే. మనస్సుతోనే పిలిచాడాయన. మనసారా పిలిచాడాయన. ఇప్పటిలాగా ఆరోజుల్లో ఇన్నిరకాల ప్రయాణసౌకర్యాలుగాని, టీవీలు మొదలైన ఎలక్ట్రానిక్సుగానీ ఉన్నాయా? ఆయన మానసికమైన పిలుపును అందుకునే, జాతి ఆయనవెంట నడిచింది. ఆయన దృఢసంకల్పమే ఆ పిలుపుకు అంతటి శక్తినిచ్చింది. ఏమంటావ్?"

నిజమేనండీ అన్నాడతను.

కానేవు మళ్ళీ మౌనంగా నడిచింది. అందరం ఆదో విధ మైన స్ఫూర్తినిపొందుతూ అలా ఉండిపోయాం.

"అన్నట్టు ఒకవిషయం గుర్తుకొచ్చిందోయ్! కర్నాటక లోను, తమిళనాడులోనూ మీ బంధువులు ఎవరైనా ఉన్నారా?" అడిగారు కృష్ణస్వామి.

"ఉన్నారండీ" అన్నాడతను.

"మీకూ వాళ్ళకు రాకపోకలు ఉన్నాయా?"

"ఉన్నాయండీ. తరచు వస్తూపోతూ ఉంటారండీ" అన్నాడతను.

"ఏమీలేదు. మనగ్రంథాలు అన్ని దేశభాషల్లోనికీ అను వాదంజరగాలన్న ప్రణాళిక ఒకటిఉంది" అన్నారు కృష్ణస్వామి.

"మా బంధువులు ఉన్నారుగానండీ! వాళ్ళల్లోరచన చేయ గలవాళ్ళు ఉన్నట్టులేరండీ!" అన్నాడతను.

ఇప్పుడే అనుకున్నాంగదా! జరగవలసిన పని ఇది. దీనిని గట్టిగా సంకల్పించు. బంధువులుగానో, బంధువులమిత్రులుగానో ఆ రచనాసామర్థ్యం గలవాళ్ళుగా నీకు దగ్గరవుతారు. వాళ్ళకు మొదటగా 'అన్వేషణ - అనుభూతి' ని అందించు. దానితో ప్రారంభించమను" అన్నారు మాస్టరుగారు.

"తప్పకుండా! అలాగే చేస్తానండీ" అంటూ ఒక విధమైన అనుభూతిలో పిలిచాడతను.

"చూశావా! కస్తూరితో ప్రారంభమైన కథ నీకర్తవ్యం దగ్గరకువచ్చి పిలిచింది" అన్నారు కృష్ణస్వామి అతనివైపు ఆశీః పూర్వకంగా చూస్తూ.

## డబ్బు - జబ్బు

"ఇద్దరూ ఒకలాంటిపనికే వెళ్ళివచ్చారుకదా! అతనికి అవనంత ఖర్చు నీ కెందుకైంది?" అని అడిగారు కృష్ణస్వామి మాలోని ఒక యువకుణ్ణి.

యువకులకు శిక్షణ ఇవ్వడంలో వాళ్ళ ఆదాయ వ్యయాలను గమనించడంకూడా ఒక అంశంగా పెట్టుకొన్నారాయన. ఎప్పటికప్పుడు వాటిని గమనిస్తూ యువకులకు తగిన సూచనలు ఇస్తూ ఉంటారు. వా దారినపడ్డారు అన్న విశ్వాసం కలిగిన తర్వాత వారిని నిశ్చింతగా విడిచిపెట్టడమే కాక మరికొంతమంది క్రొత్త కుర్రవాళ్ళను తగిన శిక్షణకోసం ఈ తయారైనవాళ్ళకు అప్పచెబుతూ ఉంటారు. ఏ విభాగంలోనైనా ఆయన విధానం ఇలాగే ఉంటుంది. వ్యక్తులను వారివారి అభిరుచులనుబట్టి తీర్చి దిద్దటం, అలా తీర్చిదిద్దబడినవారికి ఆయారంగాలకు సంబంధించిన క్రొత్తయువకులను శిక్షణకై అప్పజెప్పటం ఆయనకో ముచ్చట.

యువకులకు యువకులచేతే శిక్షణ ఇప్పించాలన్నది ఆయన ప్రణాళికలోని ఒక ప్రధానభాగం. యువకులకు శిక్షణ ఇచ్చేటట్లుగా యువకుల్ని తయారుచేయాలి అంటే ఇది ఒక మహాయజ్ఞం. అనుభవజ్ఞులైన పెద్దలను కలుపుకొంటూ మాస్టరు గారు ఈ శిక్షణా యజ్ఞాన్ని నిర్వహిస్తున్నారు. పెద్దల అనుభవాన్ని యువకుల ఆవేశానికి జోడించి, వాళ్ళను ఆదరణశీలురుగా తోటి యువకులకు మార్గదర్శకులుగా తీర్చిదిద్దుకొంటూ వస్తున్నారాయన. ఆ శిక్షణాయజ్ఞంతో ఈరోజు మా వాడి వంతు వచ్చింది. మా వాడు కొంచెం తటపటాయిస్తున్నాడు. పెట్టేటప్పుడు తెలియకపోయినా పెట్టేసిన తరువాత తెలుస్తుందిగా! అది పెట్టవలసిన ఖర్చు కాదని.

“ఏమిరా! మౌనం వహించావు. ఆ మౌనం ఏదో అనవసరమైన ఖర్చు పెట్టబుద్ధి అవుతున్నప్పుడు వహించవచ్చు కదా! ఏది కనబడితే అది కొంటావ్! ఏది అనిపిస్తే అది చేసేస్తావు! ముందు వెనుకలు చూసుకోనక్కరలేదా? మొన్నెప్పుడో బూట్లు కొన్నావట! ఇంటిదగ్గర అమ్మానాన్నా రోజులు గడవటమెలాగా అని ఆలోచిస్తూంటే బూట్లుకొనుక్కునే నీలాంటి “బ్రూట్” ఎవరైనా ఉంటాడా? ఇంతవరకు నీ సంపాదనలో పట్టుమని పదిరూపాయలు మిగిల్చి మీ తల్లిదండ్రుల చేతుల్లో పెట్టావా? పోనీ, నీ సంపాదన నీవే ఖర్చుపెట్టుకొంటున్నావని సరిపెట్టుకొందామన్నా, ఇంతవరకూ నీవు చేసుకొంటూవచ్చిన అప్పుల మాటేమిటి? ఈ సంపాదనతో ఆ అప్పులు తీర్చా

అనిపించలేదా ? అసలు నీకు వాళ్ళదగ్గర తీసుకొన్నట్లు గుర్తుంటే కదా! ఇన్నిటిమధ్యలో విలాసంగా ఉండగలుగుతున్నావంటే నీది ఒక యోగమే! C.V.V. గారిది వ్యక్తరహిత తారకరాజ యోగమైతే, నీది బాధ్యతారహిత తాకాస్థాయి యోగం!

ఏమిటీ! అలాచూస్తావ్! "మీరేదో జాతిని పునర్ని ర్మాణం చేస్తానన్నారుగా! ముందు నన్ను పునర్నిర్మాణం చేయండి చూద్దాం!" అన్నట్లుంది నీ చూపు. నువ్వు నాకే ఒక సవాలుగా పరిణమించావురా!" అన్నారు కృష్ణస్వామి.

ఆ యువకుడు కొంచెం తలదించుకున్నాడు. మీరు చెప్పినట్లుగా ఉందామని అనుకున్నా ఉండలేకపోతున్నానండి అన్నట్లు చూస్తున్నాడు దిగులుగా.

"కొందరు డబ్బు సంపాదిస్తారు కానీ ఖర్చుపెట్టలేరు. ఖర్చుపెట్టటానికి ప్రాణం ఒప్పక లోభితనంతో దాచుకొంటూ ఉంటారు. అప్పుడు డబ్బు నపుంసకుడికి చిక్కిన అందమైన భార్యలా బాధపడుతూ ఉంటుంది.

కొందరు సంపాదిస్తారు. నిలబెట్టుకోలేరు. డబ్బును మంచినీళ్ళలాగ ఖర్చుపెడతారు. ఆ ఖర్చుపెట్టటానికి ఒక పద్ధతీ పాడూ ఉండదు. అప్పుడు డబ్బు తన భర్తచేతనే విటులకు అప్పగించబడుతున్న భార్యలా కుమిలిపోతూ ఉంటుంది.

తనను సద్వినియోగం చేయగల సమర్థుణ్ణి ధనం కులస్త్రీ వలె సేవిస్తుంది. అతనితో చిరకాలం సహచరించి అనితర

సాధ్యమైన తృప్తిని, నిండుదనాన్ని అతనికి అందిస్తుంది" అన్నారు కృష్ణస్వామి.

ఆ యువకుడు జరిగినదానికి సిగ్గుపడుతూ, తనకింకా జీవితంలో కావలసిన పట్టుదిక్కు లేదని బాధపడుతూ కూర్చున్నాడు. నేలవైపు సాగిన అతని చూపులు మెల్లగా మాస్టారు గారి పాదాలవైపు మళ్ళుతున్నాయి.

కొంచెం ఆగి మాస్టరుగారు అనునయంగా మళ్ళీ ఇలా అన్నారు : అవసరమైనచోట ఏమాత్రం వెనుకాడకూడదు. అవసరంలేనిచోట ఎంతమాత్రం తొందరపడకూడదు. "నీవు పెట్టే నీళ్ళఖర్చునుబట్టి, నీవుపెట్టే డబ్బుఖర్చు తెలుస్తుందని" పెద్దలు చెబుతూ ఉంటారు. నేను ఇంకోటికూడా చెబుతున్నాను. "నీవు డబ్బు ఖర్చుపెట్టేవిధానం నీ జీవితకాలాన్ని నీవు ఖర్చుచేసే విధానాన్ని తెలియజేస్తుంది. జీతాన్ని సద్వినియోగం చేయలేని వాడు జీవితాన్ని సద్వినియోగం చేయగలడా ? ధనాన్ని ఖర్చు పెట్టడంలో నేర్పరి కానివాడు, కాలాన్ని ఖర్చుపెట్టడంలో నేర్పరితనాన్ని చూపగలడా ?

ఆ యువకుడు తన చూపులతో మాస్టరుగారి పాదాలను కడుగుతున్నాడు. ఇకనుండైనా సరైనపద్ధతిలో జీవించేటట్లు చూడమని ఆ పాదాలను అడుగుతున్నాడు.

కొంతసేపు గడిచింది. అతనివైపు ప్రేమగా చూస్తూ మాస్టరుగారు ఇలా అన్నారు : "అవసరాలనుకూడా వట్టించుకో

కుండా డబ్బును దాచుకోవాలనిపించడం, అనవసరంగా ఊరికే వృథాగా డబ్బును ఖర్చు పెట్టాలనిపించడం హోమియోపతి ప్రకారం ఈ రెండూ జబ్బులే! వీటికి మందులు కూడా ఉన్నాయి. నువ్వు బాగుపడాలని దృఢంగా సంకల్పించు ఇవాళ రాత్రికి నీకు మందు వేస్తా అది నీకు చక్కగా సహకరిస్తుంది. నామాట వినడం మాట ఎలా ఉన్నా, ఆ మందు మాత్రమైనా విని, నువు బాగుపడితే సంతోషిస్తా!"

మీరు వేస్తానంటున్నారు కాబట్టి తప్పక వేసుకొంటాను. కానీ నిజానికి మీ మాటలే నాకు నిజమైన మందు అవుతున్నట్లుగా చూస్తూ శెలవు తీసుకున్నాడతను. ●

## అందరూ వినవలసినదే

ఆరాత్రి పడుకోబోయేముందు తనతో పనిచేస్తున్న యువకులలోనుండి ఒక యువకుణ్ణి పిలిచారు కృష్ణస్వామి. ఆ యువకుడు దూరప్రాంతంనుండి వచ్చి ఇక్కడ పనిలో పాలు పంచుకొంటున్నవాడు అతనితోపాటు ఉత్సాహవంతులైన మరికొందరు యువకులను తీసుకొచ్చినవాడు.

"దుప్పట్లవీ అన్నీ ఉన్నాయా?" అడిగాడు కృష్ణస్వామి.

యువ : ఆ! ఉన్నాయి. ఈసారి టవలు, దుప్పటి అవీ తెచ్చుకున్నాను.

కృష్ణ :– మంచిది. మీతోవచ్చినవాళ్ళుకూడా ఆలా తెచ్చుకున్నారా!

యువ :– ఈసారినుండీ తెచ్చుకునేటట్టుగా చూస్తాము.

కృష్ణ : ఇలాంటివి చూసుకుంటూఉండాలి. ఇవి చిన్న విషయాలే అయినా ముఖ్యమైనవి ఇంట్లో అన్నీవున్నా అగ్గిపెట్టె లేదనుకో! ఆరాత్రి అప్పుడే కరెంటు పోయిందనుకో! అగ్గిపెట్టె విలువ ఎంతఅన్నదికాదుముఖ్యం - ఆరాత్రి ఎలా గడపా అన్నది అంశం. అలాగే మనబట్టలు మనం తెచ్చుకోవడం, మనసబ్బు మనం ఏర్పాటుచేసుకోవడం, మనం వాడినతర్వాత బాత్రూం మనతోటివాడు వాడుకునేందుకు వీలుగాఉంచడం, ఉతికినబట్టలు ఎవరికీ అడ్డురాకుండా ఆరవేసుకోగలగడం. కుర్చీలు మొదలయినవాటిలో కూర్చునిలేచేటప్పుడు మళ్ళీ వాటిని యథాస్థానంలో ఉంచగలగడం. ఇలాంటివి చిన్నచిన్నపనులే అయినా చాల ముఖ్యమైనవి. క్రమశిక్షణతో చేయవలసినవి.

ఈ చిన్నవిషయాల్లో మనం పద్ధతిని పాటించగలిగితే మనం ఇంట్లోఉన్నా మరొకరి ఇంట్లోఉన్నా మనవల్ల మరొకరికి ఇబ్బందికలుగకుండా జీవించినవాళ్ళమవుతాం. మనం ఎవరింటికైనా వెళ్ళివస్తుంటే "ఇతను మళ్ళీవస్తే బాగుండునని" వాళ్ళకు అనిపించాలిగానీ ఇక వీడెప్పుడూ రాకూడదురా బాబూ! అని వాళ్ళు దేవుడికి మొక్కుకోవడం జరగకూడదు.

మనం ఎక్కడున్నా మనప్రక్కవాళ్ళకు మనవల్ల అసౌకర్యం కలుగకూడదు. వీలైతే మనవల్ల వాళ్ళకు సౌకర్యం

కలిగేటట్టుగా ప్రవర్తించాలి. నీవు నీ మిత్రుడి ఇంట్లోనో, చుట్టాల ఇంట్లోనో ఉన్నప్పుడు అక్కడున్నవాళ్ళు ఉత్తరం వ్రాసి "గమ్" కొరకు వెతుక్కుంటున్నారనుకో లేదా వెతుక్కుందామని లేవబోతున్నారనుకో ; అప్పుడు నువ్వు నీ "కిట్"లోనుండి గమ్‌బాటిల్ తీసి గమ్మున వాళ్ళకు అందించగలిగితే - ఎలా ఉంటుంది ? అలాగే గుండుసూదులు, జమ్‌క్లిప్పులు మొదలైనవి కూడా నీ కిట్‌లో ఉండాలి. వాటిఖరీదు తక్కువే కావచ్చుకానీ వాటి ప్రయోజనం దొడ్డది. నీకూ, నీతో ఉన్నవాళ్ళకీ అవి ఎంతగానో ఉపయోగపడతాయి.

రైల్లో వెళ్తూ ఉంటాం. ఒక తల్లి ఆపిల్ పండు కొని, దాన్ని పిల్లలకు ఎలా పంచాలా ? అని ఆలోచిస్తూ ఉంటుంది. వెంటనే నీవు నీ "కిట్"లో ఉన్న చిన్న చాకుతీసి ఆవిడ కిచ్చావనుకో - ఆవిడ ఎంత ఆనందిస్తుంది ?

రైల్లో నీ ప్రక్కనున్న వ్యక్తి దప్పికతో బాధపడుతున్నట్టు నీకు అనుమానం వచ్చిందనుకో, నీ వాటర్ బాటిల్‌నుండి నీదగ్గరున్న చిన్న గ్లాస్‌లోనికి కాసిన్ని నీళ్ళుపంచి తీసుకోమని అందిస్తుంటే అతనిముఖంలో నీకు ఏమి కనిపిస్తుంది ?

మనం తెలియక ఒక పొరపాటు పడుతుంటాం. మన తోటివ్యక్తులకు విలువైన వస్తువులిస్తే వారు తృప్తిపడతారని. నిజానికి అవసరమైన వస్తువులిస్తే మనిషికి కలిగే తృప్తి విలువైన వస్తువులిచ్చినప్పుడు కలుగదు. అతను దేనికోసం చూస్తున్నాడో, అతనికి ఏమి అవసరమో గమనించి మనం

ఇవ్వగలిగాలి. అప్పుడు అతనికి కలిగే తృప్తి ఇంతింత అని చెప్పలేం। అయితే ఆ ఇచ్చేటప్పుడు అవతలివ్యక్తినుండి మనం ఎలాంటి ప్రయోజనాన్ని అపేక్షించకూడదు. రేపెప్పుడో దేనికో పనికిరాకపోతాడా అని అతని అవసరాన్ని గమనించి సహకరించావనుకో। అది లౌక్యమవుతుంది. అతనికీ మన లాంటి అవసరమేకదా। అన్న భావనతో ఇచ్చావనుకో - అది ప్రేమ అవుతుంది.

అయితే ఇక్కడ మనమొక జాగ్రత్త పడాలి. మన మంచితనం "మెతకతనం" కాకుండా చూచుకోవాలి. విచిత్రమైన ఒడుపు కలిగి ఎవరికి ఎంతవరకు సహకరించాలో వారికి అంతవరకూ సహకరించి ముందుకు సాగిపోతూ ఉండాలి నీవు నీ మంచితనాన్ని ఇతరులకొరకు సద్వినియోగం చేయాలిగాని ఇతరులను నీ మంచితనాన్ని దుర్వినియోగం చేయనీయకూడదు.

రైల్లోనే ప్రయాణించేస్తున్నాం. ఒక వృద్ధుడు దప్పికతో బాధపడుతున్నాడని నీవు మంచినీళ్ళు ఇవ్వబోతుంటే బైఠిబై నాక్కూడా కాసిని మంచినీళ్ళివ్వండి అని ఒక నవీన యువకుడు నీ పెదవి కదిలేలోపున గ్లాసు తీసుకొని త్రాగేశాడనుకో। ఆ ప్రక్కనున్న మరో జులాయియువకుడు నీ ప్రక్కనున్న వాటర్ బాటిల్ తీసికొని అందులోని మిగిలిన నీళ్ళను గడగటా త్రాగి వాన్నక్కడ పడేశాడనుకో। ఇంతకీ నీ విద్దామనుకొన్న వృద్ధుడికి మంచినీళ్ళందలేదు. అతనిగొంతు పొడారిపోతూనేవుంది. "ఏమిటిరా। పుణ్యానికిపోతే పాపం ఎదురైంది" అనిపించవ

వచ్చు నీకు. వృద్ధుడికి పిళ్ళుండకపోగా నీకు కూడా పిల్ల మిగలకుండా పోయాయిగదా! ఇదిగో ఇక్కడే ఒడుపు కావాలన్నది నేను. వాళ్ళదారిన పడకుండా నీవా వృద్ధుడికి మంచినీళ్ళివ్వగలగాలి. రాక్షసులందారిన పడకుండా విశ్వామిత్రుడు యాగం పూర్తి చేసినట్లు. మంచినీళ్ళయజ్ఞం సక్రమంగా పూర్తి కావడానికి కావల్సిన రామలక్ష్మణులనుగూడా నీవా రైలులోనే సమకూర్చుకోగలగాలి. యజ్ఞం మానకూడదు - యజ్ఞం ఆగకూడదు. చూడుమరి".

ఆ కుర్రవాడొక్కడే కాదు. అందరూ అటుతిరిగి ప్రశాంతంగా వింటున్నారు. అందరూ వినవలసిందే ఇది అన్నట్లుగా చూశారు కృష్ణస్వామి. ●

## పెద్దలకేం నష్టంలేదు

విశాఖలోని మన ప్రధానకార్యాలయంలో ఒకరోజు మధ్యాహ్నం సోదరులతో కలిసి భోజనం చేస్తున్నారు కృష్ణస్వామి. అందులో ఒక సోదరుడు కొత్తగా జగ్గరజునవారు. భోంచేస్తున్నప్పుడు రెండవచేత్తో కాసేపు కంచం పట్టుకొంటున్నాడు. కాసేపుఆగి అదేచేత్తో పంచె సర్దుకొంటున్నాడు. అన్నం కూర. పులుసు ఉన్న గిన్నెలను ముట్టుకొని తరువాత పెరుగు, నెయ్యి ఉన్న పాత్రలను ముట్టేసుకోబోతున్నాడు.

కృష్ణస్వామి అతనినివారిస్తూ ఇలాఅన్నారు- "ఏమోయ్! సర్వం జగన్నాథం చేసేస్తున్నావ్! కంచాన్ని, పంచెను కలిపి పట్టుకొంటున్నావు పెరుగుకి, పులుసుకి జత కలిపేస్తున్నావు. బాగున్నదోయి నీకథ".

ఆ యువకుడు నాలిక కరచుకొన్నాడు కానీ అలా వారించడంలోని పరమార్థమేదో అతనికి అంతగా అంతుపట్టినట్లులేదు. తప్పుచేశానని మాత్రం గ్రహించాడు.

కృష్ణస్వామి ఇలా వివరించారు : రెండవచేత్తో కంచం పట్టుకొనే అవసరం మనకు రాకూడదు. ఒకవేళ పట్టుకోవలసి వస్తే ఆచేతిని మనం కడుక్కోవాలి. భోజనం చేస్తున్నప్పుడు కంచం పంచెకు తగలకూడదు. భోజనంచేస్తున్నది పంచె కాదు కదా! అలాగే భోజనంచేస్తున్నంతసేపు కంచం కదలకూడదు. ఆ కదిలిన చప్పుడు వినపడకూడదు లేకపోతే నీవూ, నీ కంచం ఈమూలకూర్చొని ఆమూలతేలుతారు. అన్నం, కూర, పులుసు మొదలయినవి ముట్టుకొని చెయ్యికడుక్కోకుండా పెరుగు, నెయ్యి ఉన్న పాత్రలను ముట్టుకోగూడదు భోజనం చేసిన తరువాత నీవు చేయికడిగేనీళ్ళతో కంచం నిండకూడదు. అలాగని నువ్వు నీళ్ళుపోయకుండా వదిలిపెట్టడంవల్ల ఆకంచం ఎండకూడదు. కంచం ఎండకుండా తగుమాత్రం నీళ్ళుంచి కాళ్ళూచేతులు బాత్‌రూంలోనో, బయటనో కడగటం మంచిది. భోజనానికి ముందు, తరువాతకూడా కాళ్ళూచేతులు కడుక్కోవాలి. నోటిలో నీళ్ళుపోసుకొని పుక్కిలించి ఉమ్మేయాలి ఊరంతా తిరిగొచ్చిన బట్టలతో భోజనంచేయడం మంచిదికాదు. భోజనంచేసినచోట,

భోజనపదార్థాలు పెట్టబడినచోట నీళ్ళుచల్లి శుద్ధిపెట్టుకోవాలి. ఇవన్నీ మన పెద్దవాళ్ళు మనం పదికాలాలపాటు ఆరోగ్యంగా బ్రతకాలన్న ఆకాంక్షతో పెట్టిన మంచినియమాలు. ఈ చిన్న నియమాలను పాటిస్తే మనం ఈనాడు చూస్తూన్న ఎన్నో పెద్ద రోగాలబారిన పడకుండా జీవించగలుగుతాం. ఏమంటావ్ ?"

నిజమేనన్నట్లుగా తలూపాడతను. భోజనాలు సాగుతున్నాయి.

కృష్ణస్వామి కొంచెంసేపయిన తరువాత మళ్ళీ ఇలా అన్నారు : ఇప్పటివాళ్ళలో చదువుకొన్నవాళ్ళు, మేధావులు హైజీన్, హైజీన్ అంటూ దేనికోసమైతే కొట్టుకొంటున్నారో, మనపెద్దలు దానినే సదాచారంగా రూపుదిద్ది అందించారు. ఎన్ని విషయాలు తెలిసినా సదాచారాన్ని పాటించనిదే జీవితం రాణించదు. అయితే ఆ సదాచారాన్ని అవగాహన చేసుకొంటూ అవలంబించినవాళ్ళు ధన్యులు. ఒకవేళ అవగాహన లేకుండా పాటించినా సదాచారం మనను రక్షిస్తుంది కరెంటు అంటే ఏమిటో తెలియనివాడుకూడా స్విచ్ వేసుకొని లైటు వెలిగించుకొంటున్నాడుకదా ! శాస్త్రసత్యాలను సదాచారం రూపంలో జన సామాన్యానికి అందించడంద్వారా సామాన్య జనుల జీవితాలుకూడా ఆ శాస్త్రసత్యాలకు అనుగుణంగా సాగేట్లుగా చూడగలిగారు మన పెద్దలు సదాచారంనుండి ప్రక్కకు తప్పుకోవడానికి క్షణం చాలు. కాని దానివలన పతనమయ్యేది మనమే. ఆ పెద్దలకేం నష్టంలేదు. ఏమంటావ్ ?" అంటూ చేయికడుక్కునేందుకు లేచారు కృష్ణస్వామి.

ఆ యువకుడు మాష్టరుగారు చెప్పినవాటిని చక్కగా గ్రహించి అప్పటికప్పుడే అమలుపరచడం ప్రారంభించాడు.

## లోకం గొడ్డుపోలేదు

“పరిస్థితులేమీ అంతుపట్టడంలేదు. పెద్దవాడా కాలం చేశాడు. మరి ఈ చిన్నవాడికా ఇల్లుపట్టదు. పెద్దవాడి కొడుకా అయోమయం ఇక మూడవవాడు - వాడు తెచ్చుకొనే కాస్త జీతం వాడి కాళ్ళాబిడ్డలకే సరిపోతోంది. ఇన్నాళ్ళూ కొద్దోగొప్పో చూశాడు వాడికీ పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారుకదా - ఏమిటో కళ్ళముందు ఒక పెద్దసముద్రం కనబడుతోంది. ఏమీ పాలుపోవడంలేదు” అంటూ తనబాధను వెళ్ళబోసుకొన్నాడొక వృద్ధుడు తన మేనల్లుళ్ళ కుటుంబస్థితిగతులనుగూర్చి. చిన్నతనంలో తండ్రిపోతే మేనల్లుళ్ళను చేరదీసి పెంచినవాడు. ప్రయోజకుల్ని చేయడానికి ప్రయత్నించినవాడు. ఇప్పటి మేనల్లుళ్ళ స్థితినిగూర్చి ఆయన పడుతున్న వేదనా స్వరూపమిది.

ఆ మాటలన్నీ విని కృష్ణస్వామి ఇలా అన్నారు : “కళ్ళముందు ఉన్నది సముద్రమైనా ఒక తెప్పను మనం తయారుచేసుకోగలిగితే నేర్పరితనంతో ఆ సముద్రాన్ని దాటవచ్చు. సముద్రాన్ని చూచి భయపడి లాభమేమిటి? మీ మేనల్లుళ్ళు తెప్పను తయారుచేసుకోగలగాలి”.

నిజమేనన్నట్లుగా చూశాడా వృద్ధుడు. వాళ్ళందుకు ప్రయత్నించాలిగా అన్నట్లు నిట్టూర్చాడు.

కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు : మనిషి "చక్కగా బ్రతకడానికి మనిషి కుండవలసిన సద్గుణాలు రెండు. ఒకటి తాను చేస్తూన్న పనియెడల శ్రద్ధగలిగి ఉండటం, రెండవది తనతో పనిఉన్నవాళ్ళు తనను విశ్వసించగలిగిన ప్రవర్తనను కలిగి ఉండటం. ఈ రెండుగుణాలు ఉన్నవాళ్ళకు లోకంలో అన్నం పుట్టకపోవడం అంటూ ఉండదు. పనిలో స్థిరత్వం, ప్రవర్తనలో నిజాయితీ కోల్పోయినవాడు ఎంత తెలివిగలవాడయినా వాడికి ఈలోకంలో అన్నం పుట్టదు. పుట్టినా అది చిరకాలం వాడితో నిలబడదు. పీడికి స్థిరత్వం ఉంటేగా దానికి స్థిరత్వం ఉండటానికి ! పీడు నిజాయితీకినిలబడితేగా అది పీడితో నిలబడటానికి!

మీ మేనల్లుడికి స్థిరత్వం ఉండాలేకానీ, పని అప్పచెప్ప గలిగినవాళ్ళు ఊడూళ్ళోనే ఉన్నారు. పీడికి పద్ధతి ఉందీ, మనం చేసిన సహకారం రాణిస్తుందీ అంటే సహకరించేవారు ఈ లోకంలో లేకపోలేదు. ఈలోకం ఇంకా అంత గొడ్డుపోలేదు. మనకు పద్ధతిఉంటే సహకారం తప్పక లభిస్తుంది. ఇది ఎవరు, తెల్లుతోంది, బియ్యం పొయ్యండీ అంటే ఎవరైనా పోస్తారు కానీ ఒక కన్నంలోనో, ఒక గొయ్యిలోనో పొయ్యమంటే పోస్తారా, ఆలోచించండి. లోకం మనదగ్గరే ఉంది. లోకాన్ని నిందించి ఏం లాభం ?"

ఆ వృద్ధుడు మీరు చెప్పింది అక్షరాలా నిజం అంటూ నిట్టూర్చాడు.

కృష్ణస్వామి అనునయంగా ఇలా అన్నారు: "ఈ వత్యం వంటపట్టేట్టుగా మరొకసారి మీవాళ్ళకు చెప్పిచూడండి. కష్టకాలంలో ఉన్నారుగనుక మీరు చెప్పేమాటలు కొంచెం ఒంటపడుతాయేమో చూద్దాం. మనిషిని నిజానికి దగ్గరగా తీసుకెళ్ళేటందుకే జీవితంలో కష్టాలు వస్తూఉంటాయి. ఇక నే నుంటాను."

"చెప్పిచూస్తాను బాబూ! మీ దయవల్ల వాడికి నా మాటలు నచ్చుతాయేమో చూస్తాను" అంటూ సెలవు తీసుకున్నారా పెద్దాయన.

## బ్రహ్మకుకూడా అప్పులు ఉన్నాయి

"ఏమిటో! ఈమధ్య ఒకటే అప్పులు అయిపోతున్నాయి. అప్పులు చేయకుండా బతికినడిపేరోజు ఎప్పటికి వస్తుందో ఏమో!" అన్నాడు ఓ సోదరుడు.

కృష్ణస్వామి నవ్వుతూ ఇలా అన్నారు:- "అయితే నీ క్రెడిట్ రోజురోజుకీ పెరుగుతోందన్నమాట. నీలాటివాదే ఒకడు అన్నాడట — "దొరికినచోటల్లా క్రెడిట్ తీసుకోవడమే నా క్రెడిట్" అని. అసలు మన భారతదేశానికే ఆ క్రెడిట్ ఉంది. అప్పు ఇచ్చేవాడు ఉండాలేకానీ పాపం! మనదేశం తీసుకోక పోవడం అంటూ ఉండదు. పాకిస్తాన్‌లాంటి దేశాలు విదేశాల

నుండి ఋణసహాయం పొందుతూవుంటే మన దేశం ఋణసహాయం కోసం విదేశాలవెంబడి పడుతూఉంటుంది. నీవు నిత్యం ఋణం కోసం వెంపాడుతూ వున్నావంటే ప్రస్తుతం నీ భారతీయతను నిలబెట్టుకోవటంలో నిమగ్నమయి ఉన్నావన్నమాట! ఇంత కన్నా దేశభక్తికి నిదర్శనం ఏముంటుంది చెప్పు".

ఆ యువకుడు సిగ్గుతో తలవంచుకున్నాడేగాని కృష్ణస్వామి మాటలకు నవ్వుకుంటూ కూర్చున్నాడు.

కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు — "అసలు ఆ మాటకువస్తే ఈ సృష్టే అప్పునుండి పుట్టింది. Self employment scheme క్రిందనానారొష్టుపడి చదువుకున్నవారంతా బ్యాంకువారి ఋణదానాలతో చేతై, చేతకాక వ్యాపారాలు పడుతున్నారుచూడూ అలాగే బ్రహ్మదేవుడుకూడా ఈ సృష్టి వ్యాపారాన్ని అప్పుతోనే చేసేస్తున్నాడు".

నవ్వుతున్న ఆ యువకుడు ఆశ్చర్యంగా చూశాడు. చూస్తున్న అతనితో కృష్ణస్వామి నవ్వుతూ ఇలా అన్నారు—

"కంగారుపడకు, అవి వేరే అప్పులులే. సంస్కృతంలో అప్పులు అంటే జలాలు. అంటే నీళ్ళు మనీళ్ళనుండేగా ఈ భూమి పుట్టింది - భూమిమీద ఇంతకధ పుట్టింది! అందుకనే అలా చెప్పాను. మనఅప్పేమే కాదూ, పక్కింటివాళ్ళ అప్పాయి కూడా తప్పేదు అంటే మానవుడికి ఒకవిధమైన తృప్తి కలుగు

తుంది చూడు. అలాగే మనకే కాదుట మన దేశానికి. అసలు ఈ సృష్టికర్తకే అప్పుంటే బాధ తప్పులేదుట అంటే అదో విధమైన ఆనందం. ఏమంటావ్ ?"

ఆ యువకుడు నవ్వుతున్న నవ్వులో ఒకవిధమైన బాధ గోచరిస్తూ ఉన్నది.

కాస్తాగి కృష్ణస్వామి ఇలా అన్నారు : అప్పు నిజంగా చేయవలసివస్తే నిజానికి అంత తప్పుకాదు. కానీ అప్పుచేస్తున్న వాళ్ళలో చెయ్యాలి అనిపించి చేస్తున్నవారే ఎక్కువమంది. కొంతమంది అప్పుచేయకుండా ఉండలేరు. అదికూడా ఒక జబ్బు లక్షణమేనని హోమియో వైద్యం అంటుంది. అనడం ఏమిటి, నమ్మి ఆ వైద్యాన్ని శరణుజొచ్చినవారిని ఆ లక్షణంనుండి బయటపడేస్తుందికూడా. చూస్తూఉంటే మన ప్రభుత్వానికికూడా అలాంటి మందు ఏమైనా వేస్తే బాగుండుననిపిస్తోంది. ఎందుకంటే అప్పులు చేయటంమీద ఉన్న శ్రద్ధ, దేశంలోని ప్రకృతి వనరులనూ, మానవశక్తినీ సద్వినియోగం చేయడంమీద మన ప్రభుత్వము చూపలేకపోతోందికదా! ఏమంటావ్ ?

దేశప్రభుత్వానికి ఉన్న లక్షణమే దేశంలో ఉన్న మనలోనూ కనబడుతున్నది. ప్రభుత్వమంటే ఎవరు? మనలోని వారైన మన ప్రతినిధులేగా! మన అన్నలన్నమాట అందుకే వారు అప్పులుచేయడంలోకూడా అన్నలుగానే ఉన్నారు".

కొంచెం ఆగి కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు ; ఇంతకూ తేలింది ఏమిటంటే మన వనరులనీ, మన శక్తి

యుక్తుల్ని మనం సద్వినియోగం చేయలేకపోతున్నామని సద్వినియోగం చేయడానికి కావలసిన శ్రద్ధ, క్రమశిక్షణ మనలో లోపించాయని. నిజానికి ఆ శ్రద్ధా, ఆ క్రమశిక్షణా ఉంటే ఒకసారో రెండుసార్లో పరిస్థితుల్నిబట్టి అప్పు అవసరమవుతుందేమో తప్ప అదేపనిగా అవసరం రాదు. అదేపనిగా అవసరమవుతోంది అంటే అక్కడ అవసరం అప్పు కాదనీ, సరియైన హోమియో మందని మనం అర్థం చేసుకోవాలి.

ఆ యువకుడు పశ్చాత్తాపాన్ని వ్యక్తంచేస్తూ "మీరు నవ్విస్తూ చెప్పినా మాటగా ఉన్న నిజం చెప్పారు. ఇదంతా చూస్తూ ఉంటే నాకు నిజమైన అవసరం హోమియో మందనే అనిపిస్తోంది. అదేదో వేసి పుణ్యం కట్టుకోండి!" అంటూ నమస్కరించాడు.

"దానికేముంది! మన చేతిలోపనేగా తప్పకుండా వేద్దాం. నువ్వుమాత్రం పథ్యం తప్పకుండా చేయి" అన్నాడు కృష్ణస్వామి.

"తప్పకుండా చేస్తాను" అన్నాడా యువకుడు

"చేయవలసిన పథ్యంలో మొదటిది ఏమిటో తెలుసా? నా అనుమతిలేకుండా నీవు ఎక్కడా అప్పు పుట్టించకూడదు. ఏమంటావ్?" అన్నారు కృష్ణస్వామి ఆటపట్టిస్తున్నట్లుగా.

అలాగే అంటూ తలవంచుకొన్నాడు సిగ్గుపడుతూ ఆ యువకుడు.

# పూల మొక్క

1983 చివరిలో రాజమండ్రిలో "మహాభారతం" పై కృష్ణస్వామి ప్రవచనాలు జరిగాయి. అప్పటికి మాస్టర్ E. K. గారు శరీరంతోనే ఉన్నారు. చివరిరోజున జనమంతా కృష్ణస్వామిగారికి నమస్కరించి సెలవు తీసుకుంటున్నారు.

ఒకరన్నారు - "ఈ ఐదురోజులూ మీరు మాకు మాస్టరుగారిని చూపించారు. ఇంకా చెప్పాలంటే మాస్టరుగారిని మరిపించారు. మాస్టరుగారు చెప్పినప్పుడుకూడా మాకింతగా బోధపడలేదేమో! మీరింకా దిగివచ్చి మాస్టరుగారి సందేశాన్ని మాకర్థమయ్యేట్లుగా అందించి అనుభూతిలో ముంచితేల్చారు. చూడగా మీరు గురువునుమించిన శిష్యునిగా గోచరిస్తున్నారు".

కృష్ణస్వామి చిరునవ్వుతో ఇలా అన్నారు: "పూలమొక్కను చూశారా! మొక్కకన్నా పువ్వు చాలా బాగుంటుంది. కాని ఆ మొక్క లేకపోతే ఈ పువ్వులేదు. ఏమంటారు? ఈ పువ్వును పూయడానికే ఆ మొక్క నిలచిఉన్నది. ఆ మొక్కయొక్క వైభవాన్ని వ్యక్తంచేయడానికే ఈ పువ్వు వికసించి పరిమళాన్ని వెదజల్లుతోంది".

"ఇది ఇంకా బాగుంది. మీరిచ్చిన ఈ సమన్వయం అద్భుతం" అంటూ పాదాలపై వ్రాలాడా సోదరుడు.

అతన్ని లేవదీస్తూ కృష్ణస్వామి "గురువుకన్నా శిష్యుడు వేరుకాదు. మొక్కకన్నా పువ్వు వేరవుతుందా? అదీ మొక్క

లోనిభాగమే. మొక్క తనగుర్తుగా పువ్వును మనకందిస్తోంది. గురువు తనకు గుర్తుగా శిష్యులను లోకానికి అందిస్తాడు.

అక్కడున్న అందరూ ఆ సమన్వయాన్ని వింటూ పరవ పించారు.

## పెద్దల కోరిక

"ఈ పదిహేను రోజులలో మా ఏం చేసుకొచ్చావ్?" అని అడిగారు కృష్ణస్వామి దూరప్రాంతంనుండి వచ్చిన ఒక యువకుడిని.

"పనైతే పెద్దగాపోగలేదుగాని మన పుస్తకాలుమాత్రం బాగా చదవగలిగాను. చదువుతుంటే ఒళ్ళు తెలియలేదు".

"అయితే పనిమానేసి చదివావన్నమాట! ఆ పుస్తకాలలో పనిచేయమని ఉందా? మానమని ఉందా?" ప్రశ్నించారు కృష్ణస్వామి.

"చేయమనే ఉందండి," అన్నాడతను తన తలను దించుకొంటూ.

"పని చేయమనేకాదు, పని ఎలా చేయాలో కూడా ఉంది. అవునా?" అడిగారు కృష్ణస్వామి.

"అవునండీ!" అన్నాడతను.

"మరి ఆ పుస్తకాలను చదవడంలో పడి పనిని విడిచి పెట్టడంలో అర్థంఏమిటి ?ఇలా చేయడంవల్ల నీతోపాటు ఆ పుస్తకాలకుకూడా చెడ్డపేరు వస్తుంది కదా ! మీరిలా చేస్తున్నప్పుడు ఇలాంటి పుస్తకాలు చదివి కుర్రవాళ్ళు చెడిపోతున్నారని మీ పెద్దవాళ్ళు కష్టపడటంలో తప్పేముంది ?

కొందరు చెత్త పుస్తకాలు, డిటెక్టివ్‌లు, కాలక్షేపానికి మాత్రమే పనికివచ్చే నవలలూ, వార, మాసపత్రికలు చదువుకుంటూ అలా ఉండిపోతున్నారు. ఇంకొందరు నీలాగా పెద్దల గ్రంథాలను చదువుకొంటూ కాలాన్ని మరచిపోతున్నారు. ఈ రెండురకాలవాళ్ళు చేస్తున్నదేమిటి ? పనిని ఎగగొట్టటమే కదా! పనిని ఎగ్గొడుతున్నప్పుడు ఇక వాడు ఏ పుస్తకాన్ని చదువుకొంటేమాత్రం ఏమిటి ? ఏ రాయైతేనేం పళ్ళూడగొట్టుకోవడానికి "

"తప్పైపోయిందండీ ! ఎందుకనో వాటిని వదిలిపెట్టలేక అలా ఉండిపోయాను" అన్నాడా యువకుడు బాధగా.

"నిజమే నీవన్నది. అలాంటి గ్రంథాలు చదువుతున్నప్పుడు విడిచిపెట్టలేం. మరి అలాగని కర్తవ్యాన్నికూడా విడిచి పెట్టకూడదుకదా ! విడిచిపెడితే ఇకవాటిని చదివినందుకు సార్థకత ఏమున్నది ? పనిచేయడంలో కావల్సిన నేర్పరితనం అందించడానికేగదా ఆ గ్రంథాలున్నది. సైన్స్ స్టూడెంటు ఏం చేస్తున్నాడు – కొంతసేపు చదువుకొంటున్నాడు మరికొంత

వేపు ఆ చదువుకొన్నది చేసి చూపిస్తున్నాడు (థియరీ అండ్ ప్రాక్టికల్.) మనమూ అదే చేయాలి. పెద్దల గ్రంథాలనుండి చదువుతూ ఉండాలి. ఆ చదివిన ప్రకారం చేస్తూఉండాలి రోజు మొత్తాన్ని చదవడానికీ, చేయడానికీ తగినపాళ్ళలో విభజించుకోవాలి. చదవడమూ మానకూడదు. చేయడమూ మానకూడదు. ఏమంటావ్ ?"

బోధపడుతోంది అన్నట్లుగా చూశాడతను. అతనివైపు అనునయంగా చూస్తూ కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు: రోజూ ఉదయం లేచినతరువాత దినచర్యలోకి దిగబోయేముందు ఈ గ్రంథాలను చదువుకొంటే బాగుంటుంది. అప్పుడు దినచర్య సక్రమంగా నిర్వహించుకోవడానికి కావలసిన సందేశమూ ప్రోత్సాహమూ లభిస్తాయి. అలాగే రోజూ రాత్రిపూట పడుకోబోయేముందు ఈ గ్రంథాలను చదువుకోవడం మంచిది. అప్పుడు ఈ గ్రంథాల వెలుగులో మనం జరిపిన దినచర్యను సమీక్షించుకోవడానికీ, కావలసిన సర్దుబాటులను గ్రహించడానికీ వీలు కలుగుతుంది. ఇంకా ట్రైన్‌లో ప్రయాణం చేస్తున్నప్పుడూ ఏదో చేయడంకన్నా ఈ గ్రంథాలు చదువుకోవడం మంచిది. అప్పుడు ట్రైన్ ప్రయాణంతోపాటుగా మన జీవిత ప్రయాణానికి కావలసిన ట్రైనింగ్‌కూడా పొందినవాళ్ళమవుతాం.

అలాగే ఒక్కొక్కప్పుడు ఎవరికోసమో వేచి ఉండవలసి వస్తుంది. అక్కడ ఉండక తప్పదు. ఆవ్యక్తి వచ్చేలోగా

చేసేది కనపడదు అప్పుడే చేయాలి ? మనకు నచ్చిన పుస్తకాన్ని చదువుకొంటూ కూర్చోవాలి. అప్పుడు వేచిచూడడంవల్ల కలిగే టెన్షన్ కలుగకపోగా, ఆ వచ్చిన వ్యక్తితో మాట్లాడటానికి కావలసిన ప్రశాంతత మనస్సుకు లభిస్తుంది. లేకపోతే వెయిటింగ్ తరువాత ఫైటింగ్ ప్రారంభమయ్యే ప్రమాదం ఉన్నది కొందరికి చూసిచూసి కళ్ళు కాయలుకాస్తాయి ఇంకొందరికి ఒళ్ళు మండిపోతుంది కళ్ళు కాయలుకాస్తే కొంతవరకూ ఫరవాలేదు కానీ ఒళ్ళుమండిపోతే ప్రమాదంకదా మరి. అందుకని ఆ సమయాన్ని పెద్దల గ్రంథాలను చదువుకోవడానికి వినియోగించడం అన్నివిధాల శ్రేయస్కరం. ఏమంటావ్ ?"

బాగున్నది, బోధపడింది అన్నట్లుగా చూశాడతను.

లోతులను తడిమిచూసే చూపుతో కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు : "ఇంతకూ పెద్దల గ్రంథాలు ఎప్పుడూ మనతో ఉండాలి. అవి మన జీవితానికి పెట్రోలు లాంటివి. ప్రయాణం సాగుతున్నకొద్దీ ఆ పెట్రోలు మరింతగా మన కవసరం అవుతూ ఉంటుంది. మంచిడ్రైవరు ఏంచేస్తున్నాడు – తన వాహనంలో పెట్రోలు ప్రయాణానికి తగినట్లుగా ఉండేటట్లు చూసుకుంటూ వాహనాన్ని నడిపిస్తున్నాడు. అలాగే మనంకూడా పెద్దల గ్రంథాలనుండి తగిన స్ఫూర్తిని పొందుతూ జీవిత ప్రయాణాన్ని సాగించాలి.

పెద్దల గ్రంథాలు దిక్సూచి లాంటివి నావికుడు ఏం చేస్తున్నాడు? దిక్సూచిసాయంతో దిక్కులను గమనించుకొంటూ

కావల్సినపద్ధతిలో భద్రంగా ప్రయాణం చేస్తున్నాడు. అలాగే మనంకూడా పెద్దల గ్రంథాలు మనకు ధర్మపథాన్ని సూచిస్తూ ఉండగా జీవితప్రయాణాన్ని సక్రమంగా సాగిస్తూ ఉండాలి. ఇంతకూ ఏం చెప్పుకొన్నాం? పెద్దల గ్రంథాలను పెట్రోలుతోను, దిక్సూచితోనూ పోల్చుకోవడం జరిగింది. అంటే ఆ పెద్దల గ్రంథాలు రెండువిధాలైన సామర్థ్యాన్ని కలిగి ఉంటాయన్నమాట. పెట్రోలులాగా ఉత్సాహంఅనే శక్తినిచ్చి మనను నడిపించగలవు. దిక్సూచిలాగా ధర్మమార్గాన్ని ఎప్పటికప్పుడు చూపించగలవు. తమ గ్రంథాలనుండి ఈ రెండువిధాలైన ప్రయోజనాలను పొందుతూ మన జీవితాలను సార్థకంగా నడుపుకోవాలని మన పెద్దలైన ఆ గ్రంథకర్తల కోరిక.

ఆ యువకుడు చక్కని స్ఫూర్తిని పొందినట్లు కనిపించాడు. మీరు చెప్పినట్లుగా తప్పక నడుచుకుంటాను అన్నట్లు మాష్టరుగారివైపు చూశాడు.

మాష్టరుగారతనివైపు తృప్తిగా చూశారు. చెప్పినది గ్రహించగలిగాడు, గ్రహించినట్లు నడుచుకోగలుగుతాడు అన్న తృప్తి ఆ చూపులనుండి వ్యక్తమవుతూ ఆ యువకుణ్ణి ఆశీఃపూర్వకంగా స్పృశిస్తున్నది. ఆ స్పర్శలో ఒదిగిపోతున్నట్లుగా, ఆ స్పర్శలో ఎదిగిపోతున్నట్లుగా గోచరించాడు ఆ యువకుడు.

## ముడి విప్పారు

ఒకరోజున ఒక ప్రముఖమైన వ్యక్తినికలిసి మాట్లాడి మరో కార్యక్రమానికి తరలివెళుతున్నారు కృష్ణస్వామి. ఆ ప్రముఖవ్యక్తితో జరిగిన సంభాషణలగురించి ప్రక్కనున్న సన్నిహితులతో ముచ్చటిస్తున్నారాయన.

సన్నిహితులలో ఒకరన్నారు "మాష్టరుగారూ! మీకు వారంటే ఎంతో ప్రేమా, వాత్సల్యం. తరచూ మీరు కలుస్తుంటారు. అనేక అంశాలు ముచ్చటించుకుంటారు. మీ ఇద్దరి భావాలు కలసిపోతాయి ఇద్దరిలక్ష్యం ఒకటిగానే కనిపిస్తున్నది. మరి అలాంటప్పుడు ఆయన మీతోబాటుగా రంగస్థలంమీద అంతగా కనిపించరేం? నేపథ్యంలో ఉండిపోతున్నారేం?"

సమాధానంకోసం ఎదురుచూస్తున్న ఆ జిజ్ఞాసువుతో ఇలాఅన్నారు కృష్ణస్వామి; "మంచిప్రశ్నే వేశావ్! ఇక్కడొక సూక్ష్మముంది విను! నాటకం జరుగుతూ ఉంటుంది. ఏ సీన్‌లో ప్రవేశించవలసిన పాత్ర ఆ సీన్‌లో ప్రవేశిస్తూండగా నాటకం సాగిపోతుంది. ఒక్కొక్కపాత్ర చిన్నదైనదీ, ఉన్నతమైనదీ అయినప్పటికీ కథాగతినిబట్టి నాటకం మూడువంతులు గడచినతరువాత ప్రవేశించవచ్చు. ఆ మిగిలిన కాసేపటిలోనూ ఆ పాత్రవల్ల కథ ఎంతగానో రక్తికట్టవచ్చు. ఈలోపున ఆ పాత్రధారి ఏంచేస్తుంటాడు? బుద్ధిమంతుడైతే సైడుకర్టెన్ దగ్గర కూర్చొని నాటకాన్ని గమనిస్తూ మధ్యమధ్యలో నటులు లోప

లికి వచ్చినప్పుడు తగిన సూచనలిస్తూ ఉంటాడు అవునా? ఇప్పుడు మనం వెళ్ళివస్తున్నది అలాంటి సన్నివేశమే. ఆయన పాత్ర వచ్చినప్పుడు ఆయన రంగంమీదకు వస్తారు. ఈలోపున మనతో ముచ్చటిస్తూ, కథాగతిని పరీక్షిస్తూ తగిన సూచన లిస్తూ ప్రోత్సాహపరుస్తూ ఉంటారు. ఏమంటావ్! ఈ సూత్రం తెలియకపోతే, ఏమిటీ ఇంత పెద్దాయన, ఈయన తలుచుకుంటే ఏమైనా చేయగలడు, ఎందుకు రంగంమీదకు తొందరగా రాడు అని అనిపించి మనస్సు ఒకవిధమైన టెన్షన్ అనుభవిస్తూ ఉంటుంది. ఏమంటావ్?"

నిజమేనన్నట్లు తలూపాడు ఆ సన్నిహితుడు. "ఎన్నాళ్ళి నుండో నా మనస్సును ఈ సందేహం ఇబ్బంది పెడుతోంది. ఇవ్వాళ మీరు ఆ ముడిని చిత్రంగా విప్పారు" అంటూ తృప్తిగా మాటాడతను.

కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు: "ఏపాత్ర ఎప్పుడు రంగప్రవేశం చేస్తుంది? ఎంతకాలం ఆ రంగంమీద ఉంటుంది అనేది ఆ కథాగతినిబట్టి ఉంటుందితప్ప ఆ పాత్రయొక్క ఔన్నత్యంమీదగాని పాత్రధారియొక్క సామర్థ్యంమీదగాని ఆధారపడి ఉండదు ఏమంటావ్? రామాయణంలో ఆంజనేయుడు ఎప్పుడు ప్రవేశిస్తాడు? మనకు బాగుంటుందికదా అని మరికొంచెం ముందు ప్రవేశిస్తాడా? అలాగే, బాలకాండ నిండా నిండిన విశ్వామిత్రుడు అతర్వాత మళ్ళీ మనకు కనబడడే - ఆ "శబరి" వాళ్ళు ఇంకానేపు కనబడితే బాగుంటుందని మన

కనిపించదూ! అలాంటిదే మనకథకూడా. మనకథ అంటే మనమీదుగా నడుస్తున్న సృష్టికథ అని అర్థం".

ఆయువకుడు మరింతతృప్తిగా చూస్తూండిపోయాడు.

# నిజమంతే!

ఒకరోజురాత్రి కృష్ణస్వామి సన్నిహితునితో మాట్లాడు తున్నారు. ఒకతను బాధగా అడిగాడు – "ఇంతకూ ఆయన మిమ్మల్ని ఎందుకు ద్వేషిస్తున్నాడో బోధపడటంలేదు" అన్నాడు.

కృష్ణస్వామి నవ్వి ఇలా అన్నారు: "అది ఆయనకే బోధపడని విషయం - నీకెలా బోధపడుతుంది? ఒక చిన్న సన్నివేశం చెబుతాను విను! ఒకప్పుడు ఒక తండ్రీ ఇద్దరు బిడ్డలు ఉండేవారు. ఆ బిడ్డలకు నేనంటే వల్లమాలిన ప్రేమ. ఆ తండ్రికి నేనంటే అంతులేని ద్వేషం. అది మరో హిరణ్య కశిపుడు ఇల్లులాగా తయారయింది. ఒకరోజున ఆ బిడ్డలాతండ్రిని కూర్చోబెట్టి అడిగారు - "మాష్టరుగారిని నువ్వెందుకు ద్వేషిస్తున్నావని. ద్వేషించవలసిన అవసరం ఏమిటి? ద్వేషించడానికి కారణం ఏమిటి?" అని ఆ తండ్రిని నిలదీశారు ఆ తండ్రి ఎదురుప్రశ్న వేశాడు– "ఆయన్ని మీరెందుకు ప్రేమిస్తున్నారు? ప్రేమించవలసిన అవసరం ఏమిటి? కారణం ఏమిటి?" అని. ఆ బిడ్డలు ఏదో చెప్పబోయారు. కాని చెప్పలేకపోయారు.

ఆ తండ్రి అన్నాడు - "ఇక మీరేం చెప్పకండి; ఎందుకంటే చెప్పలేరు కనుక. మీరెలా ప్రేమిస్తున్నారో నేనూ అలాగే ద్వేషిస్తున్నాను మీకెలా ప్రేమించబుద్ధవుతుందో నాకూ అలాగే ద్వేషించబుద్ధవుతోంది" అని లేచి వెళ్ళిపోయాడు.

చూశావా! అతను చెప్పినదాంట్లో ఎంత సత్యముందో, నిజమంతే! ప్రేమించబుద్ధయినప్పుడు దానికి కారణాలుగా అవతలవ్యక్తి చేసిన మంచిపనులనూ, అవతలవ్యక్తికి ఉన్న మంచిలక్షణాలనూ ఏకరువుపెడతాం! ద్వేషించబుద్ధయినపుడు అవతలివ్యక్తి చేసిన చెడ్డపనులనూ, అతనిలో కనబడుతున్న చెడ్డలక్షణాలనూ వల్లెవేస్తాం. నిజానికి ప్రేమించడానికి కారణం లేదు ద్వేషించడానికీ కారణంలేదు ప్రేమించడానికీ, ద్వేషించడానికీ కారణాలు మీ చెప్పిందేవేవీకావు. అవి పైన ఎక్కడో ఉంటాయి. ఆ జీవి పరిణామానికి అప్పటికవి అవసరమై ఉంటాయి.

ఆ వింటున్న వ్యక్తి కృష్ణస్వామిగారి కళ్ళలోకిచూస్తూ అలా ఉండిపోయాడు కాసేపు. ●

## నా ప్రైవసీ నాకివ్వండి

కృష్ణస్వామి రచనావ్యాసంగంలో ఉండగా ఒకాయన తన భార్య మందుకని వచ్చారు. నిజానికి ఉదయం డిస్పెన్సరీ టైంలో

వచ్చి మందు తీసుకోవచ్చు. అంతగా ప్రమాదమైన అంశమేదీ లేదుకాబట్టి కాని చనువుచొప్పున వచ్చేశారు. కృష్ణస్వామి కొంచెం బాధపడ్డారు.

"దానికి ఒక టైమ్ ఉన్నదికదా! దాన్ని మీరెందుకు సద్వినియోగం చేసుకోరు? ఆ టైమ్‌లో నేను ఆపనిమీదే ఉంటామకదా!" అన్నారు.

తనకు షిఫ్టుడ్యూటీలు ఉన్నాయని, అందువల్ల ఆటైముకు అలా రాలేకపోతున్నానని ఆయన చెప్పారు.

అలాంటప్పుడు ఫోన్‌చేసి ముందుగా టైం ఫిక్స్ చేసుకొనివస్తే బాగుండేదికదా! నా మనస్సుకూడా మీ పనికొరకు సిద్ధంగా ఉండేదికదా! మీరలా ఎందుకుచేయలేదు? మన మేర్పరుచుకున్న నియమాలను మనమే పాటించకపోతే ఎలాగా?

మనం భారతీయులం. ఇంకా బానిసలుగానే ఉన్నాం. మనకు మనం ఒక కార్యక్రమాన్ని ఏర్పాటుచేసుకొని దానికి తగ్గట్టుగా మనని మనమే నియమించుకోగలిగిన క్రమశిక్షణ మనకింకా అలవడలేదు. మరొకళ్ళచేత అదిలించుకొనిగాని, మొట్టికాయలు తినిగాని పనిచేసేస్థితిలో మాత్రమే ఇంకా పడి ఉన్నాడు భారతీయుడు" అన్నారు కృష్ణస్వామి.

ఆయన జరిగినదానికి సిగ్గుపడుతూ ఈసారికి తప్పు జరిగిపోయింది అన్నట్లు చూశారు.

కొంచెంఆగి కృష్ణస్వామి ఇంకా ఇలాఅన్నారు : "నేను పెట్టుతున్న ప్రాజెక్టు సంగతి మీకు తెలుసు నా ఆయుర్దాయాన్ని మించిన ప్రాజెక్టు ఇది కనీసం పునాదులైనా గట్టిగా వేసి. నా తరువాత వారికి అందించవలసిన బాధ్యత నాపైన ఉన్నది. ఏమంటారు ?"

అవునన్నట్లు తలూపాడాయన.

కృష్ణస్వామి మళ్ళీ ఇలా అన్నారు— "మీరు ఇద్దరూ లేక ముగ్గురూ ఉన్న సంసారంకొరకే ఇన్నిరకాలుగా తాపత్రయపడుతున్నారు. మరి నన్నుచూచి ఇంతమంది యువకులు కార్యరంగంలోకి దిగుతున్నారు. వీళ్ళందరినీ తీర్చిదిద్దవలసిన బాధ్యత నాపైన ఉన్నదికదా ! అందుకు నా టైమ్ నాకివ్వండని మిమ్మల్ని కోరుతున్నాను.

నన్ను మీరు తప్పకుండా ఉపయోగించుకోండి. మీకు ఉపయోగపడటంలోనే నాకు ఆనందం ఉన్నది కానీ మిగిలిన కార్యక్రమానికిమాత్రం అడ్డుపడకండి. ఈ యువకుల్ని తయారుచేస్తున్నది ఎవరికోసం ? మీలాంటివారిని అనేకప్రాంతాల్లో కావలసినవిధంగా సేవించడానికేగా వీళ్ళను నేను తయారుచేస్తున్నది ! వంటచేస్తూన్న తల్లికి పిల్లలు అడ్డుపడితే ఏమవుతుంది? వాళ్ళకే భోజనం లేటవుతుంది. ఏమంటారు ?"

ఆయన బోధపరచుకున్నట్లుగా చూశారు. కాస్సేపు నిశ్శబ్దం రాజ్యమేలిందక్కడ. ఇంతలో అంతకుముందే కృష్ణస్వామి వ్రాసిఇచ్చిన మందు కట్టి తీసుకువచ్చాడు ఒక యువకుడు.

ముందువాళ్లాం చేతికందిస్తూ కృష్ణస్వామి "మీరు ధర్మల్ స్టేషన్‌లో పనిచేస్తున్నారు కదూ!" అన్నారు

"అవునండీ! ధర్మల్ స్టేషన్‌లోనే!" అన్నారతను.

"మీది ధర్మల్ స్టేషన్ అయితే, మాది ధర్మాలస్టేషన్. ఇక్కడ నిర్దేశించిన ధర్మాన్ని పాటిస్తూ మీరూ మాలో ఒకరు కండి!" అంటూ వెన్నుతట్టిపంపారు కృష్ణస్వామి.

"తప్పకుండా!" అంటూ వెంపతీసుకున్నారాయన ●

## నేల విడిచి సాము చేయకు

ఉదయం 6 గంటలవేళ. అందరం ప్రేయరుకు సిద్ధమయ్యే ప్రయత్నంలో ఉన్నాం మాలోని ఒక యువకుణ్ణి తనచెంతకు పిలిచారు కృష్ణస్వామి.

కృష్ణ :- ఇంటికి ఎప్పటికి చేరుకొంటానని చెప్పావ్!

యువ :- ఇరవయిరెండో తేదీకి.

కృష్ణ :- ఈరోజు తేదీ ఎంత ?

యువ :- ఇరవై అరండీ!

కృష్ణ :- ఇంటిదగ్గర అమ్మా నాన్నా నీకోసం చూస్తూ ఉండరా ?

యువ :- వెళ్ళిపోదామనే అనుకున్నాను.

కృష్ణ :- మరి !

యువ :- ఇక్కడజరుగుతున్న రచనావ్యాసంగం బాగుంది మానవ పనికివచ్చే అంశాలు వస్తున్నాయిగదాఅని ఉండి పోయాను.

కృష్ణ :- ఉండదలుచుకొన్నవాడివి ఇక్కడ ఇలా ఉండి పోతున్నట్లు 21వ తేదీకి అందేటట్లుగా మీ నాన్నకుఒక ఉత్తరం వ్రాయచ్చుగా !

యువ :- ఎప్పటికప్పుడే వెళదామని అనుకుంటూనే....

కృష్ణ :- వెళ్ళడం పడలేదంటావ్. ఉత్తరం వ్రాసిన తర్వాత ఏరోజు వెళ్ళినా ప్రమాదంలేదుకదా !

యువ :- నిజమేనండీ కానీ ఏమిటో తట్టలేదు.

కృష్ణ :- ఈమాత్రం తట్టలేదా ? మరి దేశంకోసం, జాతికోసం ఏదేదో చేస్తావంటావ్ ! మరి ఈ దేశంలో, ఈ జాతిలో మీ అమ్మానాన్నా లేరా ? వాళ్ళకు ఒక ఉత్తరంముక్క వ్రాసి వాళ్ళ మనస్సులకు టెన్షన్ లేకుండాచేయడం నీ దేశ సేవలో భాగంకాదా ?

యువ :- తప్పేనండీ ! గమనించుకోలేకపోయాను.

కృష్ణ :- ఇదిగో చూడవోయ్ ! పాలపైన పొంగంతా పాలూకాదు. ఆవేశమంతా ఆచరణలోకి రాదు. పైకెక్కడికో ఎగురుదామనుకొంటున్నావ్ ! ముందు క్రింద చూచుకో ! నేం

మీద కాళ్ళూనడం చూసుకొని పైకెగరడానికి యత్నించు. లేక పోతే నీకథ నేలవిడిచిన సాము అవుతుంది.

ఆ యువకుడు ఆలోచనలో పడ్డాడు. ఆదర్శాలను వల్లించు కోవడంలోపడి ఆచరణకు దూరమయ్యానే అని మథనపడ సాగాడు.

“లే! లేచి బయల్దేరు! ఇంకా లేటుచేయకు. తెలియక చేసిన తప్పునుగురించి ఆలోచించుకుంటూ ఇక తెలిసి తప్పు చేయకు! నాకు నువ్వెంతో మీ అమ్మా, నాన్నాకూడా అంతే! ఎవరికివారు తమకు తగినట్లుగా ప్రవర్తించాలన్నదే నాకోరిక” అంటూ అతని వెన్నుతట్టారు కృష్ణస్వామి.

ఆ యువకుడు కొంచెంకొంచెంగా కోలుకొంటున్నాడు.

కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు: మనం ఇలా ప్రవర్తిస్తే ఆ పెద్దలకు మనమంటే ఒకవిధమైన అయిష్టత. అవహానం కలగవూ! ఇప్పుడే ఇలాచేస్తే ఇకముందేం చేస్తాడోనని వాళ్ళు భయాందోళనలకు గురికారూ? వాళ్ళు కలిసిరావడం లేదని వాళ్ళని నిందించి ఏంలాభం! వాళ్ళను మనం తెలుసుకొని ప్రవర్తిస్తే వాళ్ళు మనతో తప్పక కలిసివస్తారు. వెళ్ళు! వెళ్ళి తప్పు ఒప్పుకో! ఇంకెప్పుడూ ఇలాచేయను అని చెప్పు”.

ఆ యువకుడు సరేనని తలఊపుతూ వినమ్రుడై సెలవు తీసుకొన్నాడు.

# ఇప్పుడర్థమవుతోంది

రాత్రి తొమ్మిదిగంట లవుతోంది భోజనంచేసి పడక కుర్చీలో విశ్రాంతిగా కూర్చున్నారు కృష్ణస్వామి. ఇదే సమయ మని సోదరబృందంలోని ఒకామె మాట్లాడటానికి ఆయనను సమీపించింది.

కూర్చోమని సైగచేశారు కృష్ణస్వామి. ఆమె కూర్చు న్నది. ఆమెచేతిలో "భారతం – ధర్మాద్వైతం" ఉన్నది.

"ఏమిటీ విశేషాలు? అన్నీ బాగున్నాయికదా!" అనడి గారు కృష్ణస్వామి.

"బాగున్నాయండీ! మీరుండగా మాకేమిభయం" అన్న దామె ఆమె కన్నులు భారతం – ధర్మాద్వైతంవైపు చూస్తు న్నాయి

దాన్ని గమనించి కృష్ణస్వామి "ఏం చదివావా? ఎలా ఉంది పుస్తకం?" అన్నారాయన

"చాలా బాగుందండీ ఇందులో నన్ను మరీమరీ ఆక ర్షించింది దాంపత్యధర్మం. బాగా చదివినమీదట నా కనిపించింది కదా – అంతబాగా బ్రతికిన మనజాతి ఇలా అయిపోయిందేమిటా అని. భారతంలోని దంపతులస్థాయికి, నేటి మన దంపతుల స్థాయికి ఊహించలేనంత అంతరం గోచరిస్తోంది ఎక్కడోతప్పు మీరు వ్రాసినట్లుగా బ్రతకడానికి ప్రయత్నిస్తున్న దంపతులు

కనబడటంలేదు. ఎందుకిలా జరిగిందంటారు ?" అన్నదామె. ఆమెగొంతులో ఆవేదన నిండివుంది.

కృష్ణస్వామి ప్రేమతో అనునయంగా చూస్తూ ఇలా అన్నారు : వందల సంవత్సరాల బానిసత్వం ఫలమిది. భౌతికంగా బానిసత్వంనుండి మనం బయటపడినా, మానసికంగా మనమింకా బానిసలుగానే బ్రతుకుతున్నాం. రాహువు చంద్రుణ్ణి పట్టినట్టు ఈ బానిసత్వం భారతీయుని మనస్తత్వాన్ని కమ్మేసింది. భారతీయుని జీవితానికి గ్రహణం పట్టింది. ఈ గ్రహణ ఫలితంగా ఒకరిపైన పెత్తనం చేయడమో, ఒకరికి లొంగి ఉండడమో తప్ప, భారతీయుడు తోటి భారతీయుడితో కలిసి ఉండలేకపోతున్నాడు. ఈ లక్షణం భారతీయుడి అన్ని రంగాల లోనూ గోచరిస్తూ ఉంది. అలాగే దాంపత్యజీవితాన్నికూడా అది ఆవరించింది.

భార్యపై భర్త పెత్తనంచేయడమో, భర్తపై భార్య పెత్తనం చేయడమో తప్ప భార్యాభర్తలిద్దరూ ఒకరికొకరుగా కలిసివుండటం అనేది ఎక్కడోకాని కనబడటంలేదు. ఒకళ్ళపై ఒకళ్ళు పెత్తనం చేయడంలో మెజారిటీ మగవాళ్ళది. కనుక భారతీయుడు భార్యను పీడిస్తున్నట్లు మనకు కనబడుతున్నది. స్త్రీలుపీడించే కుటుంబాలు లేవని అర్థంకాదు. అవికొంచెం తక్కువగా ఉన్నాయని అర్థం.

దాంపత్యాన్నిగూర్చి మనవాళ్ళ సంభాషణలు కూడా విచిత్రంగా ఉంటాయి.

"ఆ ఇంట్లో ఆవిడదేనట పెత్తనం !"

"పాపం ! ఆవిడ బజారుకు వెళ్ళినా ఆయనతో చెప్పి వెళ్ళవలసినదేనట !"

"ఇంతకూ .... మీ ఇంట్లో ఎవరిమాట చెల్లుతుంది ?" అన్న మొదలైన వాక్యాలు దేన్ని సూచిస్తున్నాయి ? మన మానసిక దారిద్ర్యాన్ని. ఎవరిమాట ఎవరు వింటే నష్టమేమిటి చెప్పు ! ఈ దారిద్ర్యంనుండి మనం బయటపడాలి. దానికి మరొక్కసారి మన పూర్వుల జీవితాలలోని దాంపత్యజీవన వైభవాన్ని స్మరించుకోవడం ఒక్కటే మార్గం. ఏమంటావ్ ?"

"నిజమేనండీ ! ఈ పుస్తకాన్ని చదువుతున్నంతసేపు నాకదే అనిపించింది. ఇందులోని దాంపత్యధర్మాన్నిగూర్చి చదివిన దంపతులెవరూ ఒకరినొకరు అవమానించుకోరని" అన్నదామె.

"పిచ్చివాళ్ళం కాకపోతే దంపతులవుతుంది అవమానించుకోవడానికా? అవమానించుకోవడానికే అయితే ఈ పెళ్ళి తతంగం ఎందుకూ? స్త్రీపురుషులు దంపతులుగా దగ్గరవుతుంది ఒకరినొకరు అభిమానించుకోవడంతో మొదలుపెట్టి ఆరాధించుకోవడమనే స్థాయికి పెరగడానికి. ఏమంటావ్ ?"

ఆమె ముకుళితహస్తాలతో తృప్తిగా చూస్తూ "మీ ఋణం ఈ జాతి తీర్చుకోలేదు. ఈ గ్రంథం తాను ప్రవేశించిన ప్రతి

ఇంటిని తీర్చిదిద్దుకుంటోంది. పుస్తకాలు చదివినవాళ్ళపై ప్రభా వాన్ని చూపిస్తాయంటే ఏమిటో అనుకున్నా! ఇప్పు డర్థమవు తోంది" అన్నది అంటూ విచిత్రానుభూతితో ఆయన పాదాలను స్పృశించిందామె.

ప్రేమకురిసే కన్నులతో తృప్తిగా చూస్తూ ఆమెను ఆశీ ర్వదించి పంపారు మాష్టరుగారు.

## పట్టా తెచ్చుకుంటేనే ఉంటారు

ఒకరోజు ఉదయం ప్రార్థన పూర్తయింది. సోదరులందరూ వారివారి కార్యక్రమాలలో ప్రవేశించడం కోసం ఉద్యుక్తులవు తున్నారు. కుర్చీలో కూర్చున్న కృష్ణస్వామి అందులో ఒకరిని తనదగ్గరకు రావల్సిందిగా సైగ చేశారు. అతనువచ్చి ప్రక్కన నిలుచున్నాడు.

"ప్రేయరు బాగుందా?" అడిగారు కృష్ణస్వామి.

"బాగుందండీ!" అన్నాడతను.

"స్నానంచేసివస్తే ఇంకా బాగుండేదేమో!" అన్నారు కృష్ణస్వామి.

అతడు నాలుక కరుచుకుంటూ "మొహం కడుక్కొని వచ్చానండీ!" అన్నాడు.

"మోహం కడుక్కోని వారు కూడా కొందరున్నారనీ, వాళ్ళకన్నా నేను కొంచెం నయమనీ చెబుతున్నావా" అని అడిగా రాయన. ఆ ముఖంలో చిరుకోపం కనిపించింది

ఆయువకుడు సిగ్గుతో తలదించుకొన్నాడు. కృష్ణస్వామి మళ్ళీ ఇలా అన్నారు ; "బాధపడటం కాదు, బోధపడటం కావాలి. ఇంకొక అరగంట ముందులేస్తె సరిపోయేది కదా ఇప్పుడు మనం ఇంటిదగ్గరే ఉన్నాం నీళ్ళకు లోటులేదు. నిద్రలేవడం లేటు కాకుండా ఉంటేచాలు. ఏ రైల్లోనో ప్రయాణం చేస్తున్నప్పుడో అనుకోని పరిస్థితులలో బిగించబడినప్పుడో, అనువుకానిచోట ఉన్నప్పుడో, తీవ్ర అనారోగ్యాలకు గురైనపుడో ఒక్కొక్కప్పుడు స్నానంచేయడానికి వీలుపడకపోవచ్చు. వీలుపడలేదు కదా అని ప్రేయరును మానకండి. ఆ వేళకు స్మరణజరగడం ప్రధానము అని C. V. V మాష్టరుగారు చెప్పారు. అది ఆయన ఆపద్ధర్మంగా చెప్పినమాట. మనం దానిని దినచర్యగా రూపొందించుకొని ఆయనకే అపద తెచ్చిపెడుతున్నాం. ఇది మంచి పద్ధతి అంటావా ?"

ఆ యువకుడు మరింత సిగ్గుపడుతూ తప్పు జరిగిపోయిం దన్నట్లుగా చూస్తూ నిలబడ్డాడు.

"తూర్పు ! పరవాలేదు" అని తనదగ్గర తూర్పుబెట్టుకొని కృష్ణస్వామి ఇంకా ఇలా చెప్పారు - "నిద్రలేచేటప్పటికి మన నోరు ఎలావుంటుందో తెలుసుగా ! అందుకేగా నోరును

చక్కగా కడుక్కొంటున్నాం. అలాగే మిగిలిన శరీరభాగాల నుండికూడా దేహపరిస్థితినిబట్టి మలినపదార్థాలు బయటకు విడుదలై ఉంటాయి నిద్ర లేచీలేవగానే మొహం కడుక్కోవాలి. కాల కృత్యాలు తీర్చుకొని స్నానంచేస్తే ప్రాణానికి హాయిగా. తాజాగా ఉంటుంది. అంతవరకూ నిద్రిస్తూనేఉన్న మనలోని అనేక ప్రజ్ఞలు స్నానంతో మేల్కొని చక్కగా చురుకుగా పనిచేయడం మొదలుపెడతాయి. అలాంటి దివ్యస్థితిలో ప్రార్థనకో కూర్చుంటే ఎంతబాగుంటుంది! ఇల్లు ఊడ్చుకోకుండా ప్రేయరుచేయడం ఎలాంటిదో, ఒళ్ళు కడుక్కోకుండా ప్రేయరు చేయడంకూడా అలాంటిదే! ఇంటిశుభ్రం, ఒంటిశుభ్రం ప్రేయరు బాగా జరగడానికి ఎంతగానో ఉపకరిస్తాయి.

అలాగే సాధ్యమైనంతవరకు సాయంత్రం ప్రేయరుకూడా స్నానంచేసి చేసుకోవడం మంచిది. రోజల్లా పనిచేయడంవల్ల దేహభాగాలు విడుదలచేసిన మలినాలు ఆ స్నానంతో నాశనమై పోతాయి. అంతేకాకుండా అంతవరకూ చేసిన పనివలన కలిగిన అలసట ఈ జలస్పర్శతో టక్కున ఎగిరిపోతుంది. ప్రొద్దుటి స్నానం అలవాట్లొవ్వి వదిలి స్తే, సాయంత్రం స్నానం అలవాటుమ పోగొడుతు ది ఏమంటావ్!"

ఆ యువకుడు కొంచెం తలపైకెత్తి "మీరు చెప్పింది నిజమే మాస్టారూ! నేను చేస్తున్నపని మంచిపనికాదని నాకూ తెలుసు. కాని, నాకునేనుగా దానిన వదలేకపోతున్నాను. రాత్రి పడుకునేటప్పుడు అనుకున్నా. ప్రొద్దున్నే లేకలేకపోదు

న్నాను. ఇప్పుడు మీ మాటలు నా మత్తును వదలగొట్టాయి. ఇక ఈ మాటలు నన్ను వెన్నాడుతూ ఉంటాయి. నన్ను దారిలో పెడతాయి. ఇవి రికార్డయి పుస్తకరూపంలో ఉంటే నాలాంటివాళ్ళను ఇంకెందరినో వెన్నాడి దారిన పెడుతూనే ఉంటాయి" అంటూ నావైపు చూశాడతను. నేను అప్పటికే అతను వచ్చిన వేళాన్ని వ్రాసుకొంటున్నాను.

మాష్టరుగారు చిరునవ్వుతో ఇలా అన్నారు : " C.V.V. గారు మనకు పెద్ద నియమాలేవీ పెట్టలేదుగదయ్యా ! వ్రతాలు, దీక్షలు చేయమనలేదుకదా ! శుచీ, శుభ్రతా పాటిస్తూ ఉదయం 6 గంటలకూ, సాయంత్రం 6 గంటలకూ మనమ్ఫూర్తిగా తనను స్మరించుకోమన్నారు. ఆమాత్రం మనంచేస్తే మిగిలిన కథ తాను నడుపుతానన్నారు మరి ఈమాత్రంకూడా మనం చేసుకోలేకపోతే ఎలాగయ్యా ? పెద్దవావాళ్ళ సంప్రదాయాన్ని సరళంచేసి సామాన్యులకు అందించడానికి దిగివస్తారు. ఈ సరళ మార్గాన్ని తెలిసి, వారిచ్చిన మార్గాన్ని హృదయంతో స్వీకరించి, ఆచరించి తరించాలి. అంతేగాని వారి సరళతను మన సోమరితనాన్ని జోడించి సంప్రదాయాన్నే భ్రష్టుపట్టించకూడదు. ఏమంటావ్ !"

ఆ యువకుడు చిరునవ్వుతో "ఏమంటాను. మాలాంటి వాళ్ళు భ్రష్టుపట్టించడానికి ప్రయత్నించినా ఆ C. V. V. గారు మా ఆటలు సాగనివ్వరు. మీలాంటివాళ్ళరూపంలో వ్యక్తమై

మళ్ళీ నెత్తినమోట్టి పట్టాలెక్కిస్తూనే ఉంటారు అంటూనూ" అన్నాడు

మాస్టరుగారు చిరునవ్వుతో ఆశీఃపూర్వకంగా అతని వెన్నుపైన చిన్నగా చరిచారు ●

## అగ్గిపుల్ల గీసేముందు

రాత్రి 8 గంటలు దాటుతోంది మాస్టరుగారితోపాటు మేము మాంజులూరులో ఉన్నాం బందరుకు దగ్గరలోని ఒక పల్లెటూరునుండి 35 ఏళ్ళవ్యక్తి ఒకరు వచ్చారు. ఆయన మాస్టరుగారి పుస్తకాలు చదివారట ఎలాగైనా మాస్టరు గారిని తమఊరు వచ్చేటట్లు ఒప్పించి తేదీ నిర్ణయంచేసుకొందా మని వచ్చారాయన. వస్తూవస్తూ తనకు మాస్టరుగారిని పుస్తక రూపంలో పరిచయంచేసిన మన బందరు సోదరబృందంలోని ఒక యువకుణ్ణి వెంటబెట్టుకొని వచ్చారు.

మాస్టరుగారు తానుచేస్తున్నపనిపూర్తి కాగానే ఇవతలకు వచ్చి వారిని పలామర్శించారు. ఆ సోదరుడు తమకోరిక తెలి పారు. ఎప్పుడూ చెప్పిన హరికథలే చెప్పించుకుంటున్నామనీ, జరిగిన పురాణ కాలక్షేపాలే మళ్ళీ జరుగుతున్నాయని చెబుతూ, మాస్టరుగారువస్తే తమఊరు చైతన్యవంతం కాగలదని ఆశా భావాన్ని ప్రకటించారు.

అంతావిని కృష్ణస్వామి ఇలా అన్నారు : "మీరు చెప్పినదంతా నాకు అవగతమయింది. మీ కుటుంబంవారు చేస్తున్న కృషికూడా నాకు బోధపడింది. రావడానికి నాకు అభ్యంతరం లేదు. నా రాకకు మీరు సిద్ధపడితే చాలు."

సిద్ధంగా ఉన్నాం అన్నాడు మావాడతను.

కృష్ణస్వామి ఇలా అన్నారు : సిద్ధపడటం అంటే మీకు బోధపడిందనుకుంటాను. నన్ను పిలవవలసింది మీ గ్రామం. మీ గ్రామం పిలిస్తే నేను తప్పకుండా వస్తాను. గ్రామంలోని అన్నికులాల పెద్దలు కలిసి నా రాకను కోరుకోవడం జరగాలి. గ్రామం పిలవడమంటే అదే. అందరూ కలిసి ఒకచోట చేరితే నేను చెప్పవలసిన నాలుగుముక్కలు మీ గ్రామ పునర్నిర్మాణాన్ని ఉద్దేశించి ఉంటాయి. చెప్పినప్రకారం మీరు గ్రామాన్ని పునర్నిర్మించుకోవలసి ఉంటుంది. దీనికి మీ గ్రామప్రజలు సిద్ధంగా ఉన్నారేమో కదిపిచూడండి. కదిపిచూడటం అంటే వేరుగా ఏమీచేయనక్కరలేదు. ఏ పుస్తకాలనుచదివి స్ఫూర్తిని పొంది మీరు ఇక్కడివరకూ వచ్చారో ఆ నా పుస్తకాలను మీ గ్రామంలో చదువుకోగలిగినవారందరిచేత చదివించండి. చదువలేనివారికి చదివి వినిపించండి.

అప్పుడు మీరుపొందిన స్ఫూర్తే మీ గ్రామప్రజలుకూడా పొందితే గ్రామపునర్నిర్మాణానికి వాళ్ళు సిద్ధమయినట్లే. అప్పుడు నేను తప్పక వస్తాను. నాకు కావలసింది ధనం కాదు జనం.

తమనితాము సంస్కరించుకోవడానికి సిద్ధంగా ఉన్న జనం వాళ్ళు వాలి. పొయ్యి రాజేయదలుచుకున్నప్పుడు ఏంచేస్తాం - గడ్డిని చుట్టి అందులో పెడతాం. పిడకలు సిద్ధంచేసుకొని ప్రక్కన పెట్టుకుంటాం. ఎండిన కట్టెపుల్లలు సిద్ధంగా ఉంచుకొంటాం. అప్పుడు అగ్గిపుల్ల గీసి గడ్డిచుట్టూ అంటిస్తాం. మండుతున్న గడ్డి చుట్టమీద పిడకముక్కలు అమర్చి ఆపైన కట్టెపేళ్ళను సర్ది పెట్టడంతో పొయ్యి అంటుకోవడం జరుగుతుంది. ఈ ఏర్పాట్లేవీ చేసుకోకుండా పొయ్యిముందుకూర్చొని అగ్గిపుల్ల గీస్తావనుకో ఏం జరుగుతుంది? ఆ అగ్గిపుల్ల వెలిగినంత సేపు వెలిగి పడిపోతుంది. ఏర్పాట్లన్నీ చేసుకొని కూర్చున్నావనుకో, అగ్గిపుల్ల వెలుగుతూ కాలిపోయేలోపున నీ పొయ్యి ముట్టుకుంటుంది.

నా ఉపన్యాసం అలాంటి వెలిగే అగ్గిపుల్లలాంటిది దాన్ని సద్వినియోగం చేసుకోవడానికి తగిన ఏర్పాట్లు చేసుకుంటేనే దాని ఉపయోగం లేనప్పుడు ఆకాసేపు విని ఏదో బోధపడినట్లు అనిపించి ఆ తరువాత జారిపోవడం జరుగుతుంది అందుకని మీరు పొయ్యి ముట్టించేందుకు కావలసిన ఏర్పాట్లన్నీ చేసుకొని రండి. నేను వచ్చి తప్పకుండా అగ్గిపుల్ల వెలిగిస్తా. నేను అక్కడ నుండి కదిలేలోపల ఆపొయ్యి ముట్టుకోవాలి మరో పదిళ్ళ వాళ్ళకి కావలిస్తే వాళ్ళ పొయ్యిలలోకి నిప్పందించగలగాలి అంటే మీ గ్రామంలో మీరుపొందిన సమన్వయాన్ని మరిన్ని గ్రామాలకు మీ రందించగలగాలి. అందుకు మీరు సిద్ధపడితే మీ ఆహ్వానం అందుకోవడానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఏమంటావ్?"

“అవున్నం మీ పుస్తకాల్లోలాగే చెప్పారు. మీ పుస్తకాల్లో అన్నీ ఇలాంటివే. ఇలా మేలుకొలిపేవే ఉంటాయి నేను మా ఊరువెళ్ళి మీరు చెప్పినప్రకారమే చేయడానికి తప్పక ప్రయత్నిస్తాను. నాలాగే నాతోటి గ్రామస్థులు సిద్ధమవుతారనే విశ్వాసంతో ఉన్నాను. సిద్ధపడగానే మళ్ళీ మిమ్మల్ని కలుస్తాను. మీరు తప్పక రావాలి” అంటూ ఒకరకమైన ఉద్వేగాన్ని పొందుతూ నమస్కరించాడతను

మాష్టరుగారు చెప్పిన తీరుతో తమగ్రామంలో మార్పు తీసుకురావాలన్న ఆకాంక్ష ఆ ఉద్వేగంగా రూపొందినట్లు కన్పించింది.

మాష్టరుగారు అతని వెన్నుతట్టి. “ఏం ఫరవాలేదు. మీ సంకల్పం తప్పక నెరవేరుతుంది. మీ ప్రయత్నం తప్పక ఫలిస్తుంది. ఈ సి ఐందరు స్నేహితుడు సి ప్రయత్నానికి కావలసిన సామర్థ్యం అందిస్తాడు. ఇద్దరూ కలిసి ముందుకు సాగండి. ఇద్దరు మరిందరుకండి. మరిమత్తులో ఉన్న మనదేశాన్ని మరామత్తు చేయండి” అంటూ ఆశీఃపూర్వకమైన చిరునవ్వుతో వారిని సాగనంపారు కృష్ణస్వామి. ●

# మాటల మధ్యలో రాలిన ముత్యాలు

# 2


కర్త

డాక్టర్ మోపిదేవి కృష్ణస్వామి

ఎం. ఎ. పి. హెచ్ డి.





ప్రచురణ :

యూనివర్సల్ హ్యూమానిటేరియన్

ఎడ్యుకేషన్ ట్రస్ట్

విశాఖపట్నం-17

అరవిందుని అడుగుజాడల్లో నడుస్తూ

శ్రీమాతకు ప్రతిరూపమై మెలుగుతూ

తెనాలి ప్రాంతానికి మరోమారు

తెల్లవారేట్లు చూసిన —

శ్రీ గుళ్ళపల్లి సత్యనారాయణగారి దివ్యస్మృతికి

ప్రేమపూర్వకంగా సమర్పిస్తున్నాను.

- కృష్ణస్వామి

# ఇందులో -


| | | పుట |
|---|---|---|
| 1. | ముత్యాలముగ్గు | iv |
| 2. | ఆ జ్యోతి కిరణాలు - ఆ వెలుగుల వైభవాలు | viii |
| 3. | వసిష్ఠుని ముహూర్తం | 1 |
| 4. | కాళ్ళను కడిగే వేళలో | 4 |
| 5. | మీ వాళ్ళే మళ్ళీ | 6 |
| 6. | పెళ్ళివారి ప్రయాణం | 10 |
| 7. | ఎంత బూటకం | 11 |
| 8. | నుదుటి వ్రాత | 13 |
| 9. | మానసిక భోజనం | 15 |
| 10. | భక్తుల రద్దీ | 17 |
| 11. | రాముణ్ణి చూడాలని | 21 |
| 12. | ఉద్యోగ ప్రయత్నమా | 24 |
| 13. | శంక తొలిగింది | 28 |
| 14. | అటు చూడు | 30 |
| 15. | సంస్థలలో ఆడా మగా | 32 |
| 16. | దేవుని బదులు | 38 |
| 17. | బంగారు సంకెల | 43 |
| 18. | దగ్గరగా చూశాను | 54 |
| 19. | చేయడానికే తపస్సు | 59 |
| 20. | మాటతో కాదు బాటతో | 60 |
| 21. | కర్మయోగం | 62 |

22. పురుష ప్రభలు లేవే! 65
23. వెన్ను తట్టేవాడుంటే 67
24. అమలు పరచండి 70
25. ఆరాలు తీస్తోందా 73
26. మీకేనా నాకూనూ 78
27. పంచాంగం కథ 79
28. వినాయక విజయం 80
29. అదేగొంతు - అదే కథ 87
30. ఆ అంచునుండి ఈ అంచుకు 93
31. కథ సుఖాంతం 97
32. ధర్మతేజం దమిస్తుంది 100
33. స్టోరీ ఆఫ్ 'డాగ్' 106
34. రామాయణం - రాయితీలు 108

## 'ముత్యాల ముగ్గు'

మహితాత్ములయిన మాస్టర్ E. K. గారిచే మానవజాతి పునర్నిర్మాణోద్యమమునకై అంకితము చేయబడిన మనీషి మాస్టర్ మోపిదేవి కృష్ణస్వామిగారు. పరమగురువుల సందేశము జాతికి అందివచ్చుటకై వాహికగా తీర్చిదిద్దబడిన మాస్టర్ M. K. 'తన జీవితము లోకహితమునకే' అను ఎఱుక గలవారు. కావున తన మాటలు యువతరానికి ముత్యాల మాటలుగా- తన చేతలు జాతి పునర్నిర్మాణానికి చేయూతలుగా- చేయుచున్న వీరి ఒక్కొక్క రచన పసందుగా సాగిపోతున్నది. అలవోకగా అక్షర సత్యాలను ఆవిష్కరిస్తున్నది.

వీరి రచనలలో— 'మాటల మధ్యలోరాలిన ముత్యాలు' ఒక శిక్షణ గ్రంథము. సాధకుడుగా నిత్యము మన మలవరచుకోవలసినవి, మనం అనుష్ఠింపవలసినవి అయిన అంశాలు మొదటి భాగంలో ఉన్నాయి.

ఇక— ఈ రెండవ భాగంలో - సాధకుడు సమాజములోని వివిధ సన్నివేశాలను ఎలా అన్వయించుకోవాలో సమ్యక్ దృష్టిని ఎలా పెంచుకోవాలో వివరింపబడింది. 'వసిష్ఠుని ముహూర్తం....' మొదటి సన్నివేశం కాగా, 'రామాయణంలో రాయతీలు' తుది సన్నివేశంగా మొత్తం ముప్పది రెండు అంశాలు ఇందులో ఉన్నాయి.

ఏ సన్నివేశానికా సన్నివేశం 'కదిలేదీ కదిలించేదీ పెను నిద్దుర వదిలించేదీ'. మనస్సు మడతలలో కలుక్కుమంటున్న సంశయాలతో సతమతమవుతూ వచ్చిన జిజ్ఞాసువులకు చక్కని పరిష్కారం అందించి- ఆనంద బాష్పాలతో జీవిత పథంలో ముందడుగు వేయడానికి తోడ్పడుతుంది.

పుత్రకామేష్టిని ఋష్యశృంగునిచే జరిపిస్తాడు. శ్రీరామ కళ్యాణము విశ్వామిత్రునిచే నిర్వహింపబడింది. పట్టాభిషేకానికి తాను పెట్టిన ముహూర్తం అరణ్యవాసానికి దారి తీసింది. కుల పురోహితుడయిన వశిష్ఠుని ఘనత ఏమిటి ? అని అడిగిన భావుకునికి ఇలా సమాధానం వచ్చింది. "తాను సమర్థుడై ఉండికూడ- ఇతరులు సమర్థులైనవారు దొరకినప్పుడు వారికి పని

అప్పగించడంలోనే వసిష్ఠుని ఘనత ఇమిడి ఉంది. దైవకార్యానికి తాను పనిముట్టుననే ఎఱుక కలవాడు కావుననే- తాను పెట్టిన ముహూర్తం తాత్కాలికంగా కార్యసాధకం కాకపోయినా- వసిష్ఠుడు చింతించలేదు. కించపడలేదు. దైవసంకల్పం ఏమిటా అని పైకి చూచినాడు.

(వసిష్ఠుని ముహూర్తం....).

గురువుగారి మహిమలకే మక్కువపడి చేరికయిన ఒక సాధకుడు ఆ మహిమలు వాస్తవాలు కావని తెలిసి, ఆయన ఆరాధనను వదలలేక- కొనసాగింపలేక కొట్టుమిట్టాడుతూ ఉంటే- "అనుభూతి నీకు లభించడం అనేది నీవు పూజిస్తున్న వ్యక్తిలో విచ్చుకొన్న దైవాంశ ఎంత అన్నదాని పైన ఆధారపడి ఉండదు. నీలో జరుగుతున్న సాధనపైన ఆధారపడి ఉంటుంది". ఎంచుకొన్న వ్యక్తిని పూజించడం మానవక్కరలేదు. (బంగారు సంకెల) అనే చక్కని పరిష్కారం అందుతుంది.

ఒక స్వామీజీ తమ మహోపన్యాసం మధ్యలో— మానవ సేవ నిజంగా మాధవసేవకాదు. అని వివరంలో గజిబిజిపడేసరికి విన్న శ్రోతలు ఇరకాటంలో పడ్డారు. స్వామీజీ ఇంకా నడి వయస్కులే. ఆధ్యాత్మిక పథంలో వారు ఇంకా ఎన్నో అంచెలు ముందుకు వెళ్తారు. మానవసేవ మాధవసేవ అనే అనుభూతి వారికీ దొరుకుతుంది. మనకూ అందుతుంది. 'కథ సుఖాంతమవుతుంది' అని M. K. గారు సాధకుడైన శ్రోతకు చిక్కు తీర్చారు.

ఇలా ఎన్నో - మరి ఎన్నెన్నో ? చేరవచ్చిన పిన్నలకు పెద్దలకు తమ మాటలతో ఆప్యాయంగా కలత తీర్చి వారి యోగజీవితాన్ని మలుపు తిప్పినారు. ముందు తరం వారికి గూడ పనికివచ్చే ముత్యాలు వెదజల్లుతున్నారు. తినబోతూ రుచులడగటం ఎందుకు? ముందుకు సాగండి. అందుకోండి.

— పరాశరం గోపాలకృష్ణమూర్తి

# ఆ జ్యోతి కిరణాలు - ఆ వెలుగుల వైభవాలు

"స్వామితో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషన్" అని ప్రాస్తారొక కోట ప్రముఖ పాత్రికేయుడు, ఉపన్యాస చక్రవర్తియైన తుర్లపాటి కుటుంబరావుగారు. స్వామితో మాట్లాడే సన్నివేశం కలసి వచ్చినప్పుడల్లా వారి ముఖంలో ఒక మెరుపు మెరిసినట్లవుతుంది. అదొక చూడముచ్చటైన దృశ్యంగా రూపుకడుతుంది.

"మాట్లాడే వేళలో మాష్టరుగారు సాక్షాత్తూ దైవమే. ఆ క్షణాలలో మనమలా కనురెప్పలకు కూడా విశ్రాంతినిస్తూ, చూస్తూ ఉండి పోవలసిందే. ఎప్పుడు ఏ క్షణంలో ఆయన నుండి ఏ పలుకు వెలువడుతుందోనని ! వెలువడుతూ ఏ వెలుగులు విరజిమ్ముతుందోనని !" అంటూ పరవశులవు తుంటారు శ్రీ కాపూరి పూర్ణచంద్రరావుగారు.

స్వామి మాట్లాడుతున్నప్పుడు ఆ మాటలకు ఒకవైపు తానానం దిస్తూ, మరొకవైపు శ్రోతల ఆనందాన్ని గమనిస్తూ, ఇంకొక వైపున ఈ మాటలను పత్రికా ముఖంగా ప్రజలందరకు అందించే ప్రయత్నానికి మాన సికంగా రూపుదిద్దుతూ మురిసిపోతుంటారు శ్రీ కందర్ప రామచంద్రరావు గారు. ఏక కాలంలో మూడు మూర్తులు ధరిస్తూ, కథను ముందుకు నడి పిస్తూ ఉంటారాయన.

"వీరి వాక్కులో ఒక కళ ఉన్నది. వీరి రచనలో ప్రత్యేకమైన ఒక శిల్పమున్నది. ఒకానొక దివ్యజ్యోతి వీరిలో నాకు గోచరించింది. ఆ దివ్యజ్యోతి కిరణాలే వీరి వాక్కులు, వీరి రచనలు! అని స్వామిని గూర్చి తమ ఆనందాన్ని తృప్తిగా వ్యక్తం చేశారు శ్రీ గూడూరు నమశ్శివాయ, మాష్టరు ఇ. కె. షష్టిపూర్తి మహోత్సవాల సందర్భంగా అధ్యక్ష స్థానం నుండి మాట్లాడుతూ.

సందర్భానుసారంగా ఆ దివ్యజ్యోతి వెలువరిస్తున్న కిరణాలే స్వామి పలుకులు-స్వాతి చినుకులుగా, మాటలా మంత్రాలుగా, మాటల మధ్యలో రాలిన ముత్యాలుగా కూర్పు చేయబడి కావలసిన వారి మనస్సులను స్పృశిస్తున్నాయి.

సరసం ప్రధానంగా నడచినప్పుడు అవి "స్వామి పలుకులు- స్వాతి చినుకులు". సందేశం ప్రధానంగా నడిచినప్పుడు అవి "మాటలు-మంత్రాలు". అవగాహనా, సమన్వయాలు పెనవేసుకుంటూ సాగినపుడు అవి "మాటల మధ్యలో రాలిన ముత్యాలు". అన్నీ ఆ జ్యోతి కిరణాలే. ఆ వెలుగుల వైభవాలే !

సేదతీర్చి హాయినిచ్చేటప్పుడు అవి "స్వామి పలుకులు- స్వాతి చినుకులు". మేలుకొలిపి నిలబెట్టేటప్పుడు అవి "మాటలా- మంత్రాలు. పరిస్థితులను విశ్లేషిస్తూ, పద నిర్దేశం చేస్తున్నప్పుడు అవి "మాటల మధ్యలో రాలిన ముత్యాలు". అన్నీ ఆ జ్యోతి కిరణాలే !ఆ వెలుగుల వైభవాలే !

ఆట పట్టిస్తూ ర క్తి కట్టిస్తున్న వేళ అవి "స్వామి పలుకులు- స్వాతి చినుకులు". చేయూతనిస్తూ చేరదీస్తున్న వేళ అవి "మాటలు-మంత్రాలు". మనలోని లోతుపాతులను తడిమి చూపిస్తున్న వేళ, తడిమి సరిచేస్తున్న వేళ అవి "మాటల మధ్యలో రాలిన ముత్యాలు". అన్నీ ఆ జ్యోతి కిరణాలే. ఆ వెలుగుల వైభవాలే !

స్వామి మిత్రుడై మన మనస్సులను మీటుతున్న వేళ వెలువడేవి "స్వామి పలుకులు- స్వాతి చినుకులు". స్వామి నాయకుడై మనను నడిపిస్తున్న వేళ వెలువడేవి "మాటలా-మంత్రాలు". స్వామి బోధకుడై మనకు బోధ పరుస్తున్న వేళ వెలువడేవి "మాటల మధ్యలో రాలిన ముత్యాలు". అన్నీ ఆ జ్యోతి కిరణాలే. ఆ వెలుగుల వైభవాలే.

సమాజంలో వివిధ వర్గాలకు చెందినవారు మానవ పరిణామంలో వివిధ దశలలో ఉన్నవారు వివిధ వయస్సులలో నుండి, విభిన్న పరిస్థితులలో నుండి స్వామికి చేరువై సమాజంలోని ఆ యా మన స్తత్వాలకు, ఆ యా తరహాలకు ప్రాతినిధ్యం వహిస్తూ, స్వామితో, సావధానంగా జరిపిన సంవాద స్వరూపాలే ఈ "మాటల మధ్యలో రాలిన ముత్యాలు".

వివిధ నేపథ్యాలనుండి నడచి వచ్చిన ఆ యా వ్యక్తులను ప్రేమతో పరామర్శిస్తూ, వారి పరిస్థితులనూ, స్థితిగతులను ఒడుపుగా గమనించు కుంటూ, వారి జీవనసరళినీ, కష్ట సుఖాలను, తానుగా పట్టించుకుంటూ, వారి సంస్కారానికీ, పరిణామానికీ తగిన విధంగా స్పందిస్తూ, వారి శ్రేయస్సు కోరి, వారి యెడల బాధ్యతపడి, వారితో సార్థకమైన సంభాషణలు సావధానంగా జరుపుతున్న వేళలో స్వామినుండి జాలువారే, ఆ మాటల మధ్యలో రాలిన ముత్యాలివి. మనలో ప్రతి ఒక్కరూ అవశ్యమూ అందుకోవలసిన ఆచరణీయాత్మకమైన సందేశాలివి. కన్ను పొడుచుకున్నా కానరాని అజ్ఞానమనే కారుచీకటిలో కలతచెందుతూ, కలవరపడుతూ, జీవితమనే ప్రయాణాన్ని తప్పనిసరియై బరువుగా కొనసాగిస్తున్న సామాన్య మానవుల చేతులకు అందింపబడుతున్న దీపకళికలివి. జ్ఞాన జ్యోతులివి.

స్వామి సంభాషణలలో ఒక దివ్యమైన వైచిత్రి ఉంది. ఆయన ఎవరితోనన్నా మాట్లాడుతున్నప్పుడు, మాట్లాడుతున్నట్లూ ఉంటుంది. అసలు మానవుడితోనే మాట్లాడుతూ ఉన్నట్లు ఉంటుంది. అంటే వ్యక్తిని నిమిత్తంగా స్వీకరించి, మానవజాతిని ఉద్దేశించి మాట్లాడబడిన ఒక గీతా బోధలా, ఒక వసిష్ఠగీతలా ఉంటుంది. కనుకనే ఆ మాటలన్నీ ఎప్పటి కప్పుడు రికార్డు చేయబడి, మానవజాతికి అందేటట్లుగా చూసే ప్రయత్న మొకటి ఇక్కడ నిరంతరము సాగుతూ ఉన్నది. ప్రజలనుండి ఈ ప్రయత్నానికి లభిస్తున్న ప్రతిస్పందన ఉన్నదే అది.ఈ ప్రయత్నం మరింత వేగంగానూ మరింత శ్రద్ధతోనూ సాగాలనిస్వామిస్తూఉన్నది.

మాటల మధ్యలో రాసిన ముత్యాలు మొదటి భాగంలో సాధకుడైన మానవుడు సరైన వ్యక్తిత్వాన్ని సంతరించుకోవడానికి గాను, అలవరచుకో వలసిన అంశాలను ఎన్నింటినో కూర్పుచేసి అందించడం జరిగింది. ఇప్పుడీ రెండవ భాగం సరైన వ్యక్తిత్వాన్ని సంతరించుకుంటున్న మానవుడికి జీవితాన్ని అర్థవంతంగా నిర్వహించుకోవడానికిగాను కావలసిన అవగాహనను వివిధ కోణాలనుండి అందిస్తున్నది. మొదటి భాగాన్ని కూర్పుచేసి అందించిన సోదరుడు మధుమోహన్ ఈ ద్వితీయ భాగం కూర్పుచేసే సమయంలోకూడా తగుమాత్రంగా తన సహకారాన్ని అందించాడు. అతనికి నా కృతజ్ఞతలు.

నాటి పురాణేతిహాసాలనుండి, నేటి సామాజిక స్థితిగతుల వరకు అనేకమైన అంశాలు ఈ గ్రంథంలో చోటుచేసుకున్నాయి. తెల్లవారిలేస్తే మనలో మెదిలే రకరకాల ఆలోచన లెన్నింటికో ఇందులో చక్కని సమన్వయాలున్నాయి. నిత్యజీవితంలో ఎదురయ్యే అనేకానేక సన్నివేశాలను నిండుగా, తృప్తిగా నిర్వహించడమెలాగో ఈ గ్రంథం చక్కగా నేర్పుతుంది. అర్థవంతంగా, అనుభూతిప్రదంగా జీవితాన్ని గడపదలిచే వారందరికీ ఈ గ్రంథం ఒక దిక్సూచి అవుతుంది. కూర్పరిగా పనిచేస్తున్న వేళ ఈ గ్రంథాన్ని గూర్చి నేను పొందిన అనుభూతి ఇది. గ్రంథం ఆసాంతం చదివిన తర్వాత మీరూ ఇలాంటి అనుభూతినే పొందుతారన్నది నా విశ్వాసం.

వసిష్ఠుని ముహూర్తంతో ప్రారంభమై, రామాయణం రాయతీల వరకు సాగే ఈ గ్రంథంలో మొత్తం ముప్పై రెండు సన్నివేశాలున్నాయి. ఈ ముప్పైరెండు సన్నివేశాలలోనూ కొన్ని మన మనస్సును వికసింప చేస్తాయి. కొన్ని మన హృదయాన్ని పరవశింప చేస్తాయి. కొన్ని మన మనస్సునూ హృదయం వైపుకు మళ్ళిస్తూ మనకు మైమరపును కలిగిస్తాయి.

కొన్ని పులకింతలు కలిగిస్తే, కొన్ని గిలిగింతలు పెడతాయి. కొన్ని మనలను ఆలోచింపచేస్తే, కొన్ని మనసు ఆర్ద్రమైన స్థితిలోనికి తీసుకు వెళతాయి. కొన్ని మనను నవ్విస్తే, మరికొన్ని మనను కవ్విస్తాయి. అన్నీ కలసి మనసు ఆనందింపచేస్తాయి. ఆచరణశీలురుగా మనలను తీర్చిదిద్దు తాయి. అలాంటి ఈ ముత్యాల సరాన్ని గురుపూజల శుభవేళలో మీకు అందించే అదృష్టాన్ని అనుగ్రహించు స్వామి. స్వీకరించండి. అవశ్యం ధరించండి. అమూల్యమైన ఈ ఘట్టాలను ఇక అవధరించండి.

22-4-90 మంత్రి.

హైదరాబాదు.

# వసిష్ఠుని ముహూర్తం

"మాస్టరుగారూ ! నాకొక అనుమానం. మీరు నివృత్తి చేయాలి దానిని" అన్నారొక పెద్దాయన. దూరప్రాంతం నుండి వచ్చినవారు మంచి జిజ్ఞాసువులు.

"ఏమిటో చెప్పండి" అన్నారు స్వామి.

"రామాయణంలో ఇంతకూ వసిష్ఠుడు చేసింది ఏమిటీ అని? పుత్రకామేష్టి చూద్దామా, ఋష్యశృంగుని పిలిపించి చేయించాడు. అస్త్ర విద్యలందామా రాముణ్ణికోరి తీసుకొని వెళ్లి విశ్వామిత్రు డందించాడు. రామాయణగాథ చూద్దామా.... వాల్మీకి మహర్షి వర్ణించి చెప్పాడు. ఇక వసిష్ఠుడు చేసింది రాముని పట్టాభిషేకానికి ముహూర్తం పెట్టడం. అది ఎలాగూ అప్పుడు జరగనేలేదు. పట్టాభిషేకం మాట అలా ఉంచి అదే ముహూర్తానికి అరణ్యాలు పట్టాడు. ఇక అతని బ్రహ్మర్షిత్వం నిరూపణ మయింది ఎక్కడ ? ఒక్క విశ్వామిత్రుణ్ణి సైన్యంతో సహా బ్రహ్మదండంతో నిరోధించ గల్గినపుడు మాత్రం నిరూపణ అయింది. అంతకంటే ఇంకేమీ కనబడటం లేదు. ఇంతేనా ? ఇంకేమైనా ఉందంటారా ? అన్నట్లు ప్రశ్నార్ధ కంగా చూస్తున్నారా పెద్దాయన.

చిరునవ్వు నవ్వుతూ స్వామి ఇలా అన్నారు: విశ్వామిత్రుణ్ణి నిరోధించినపుడే కాదు, ఆపైన ఆయనపై విరోధించి తపస్సుచేసి ఉద్దండుడై నిలిచిన విశ్వామిత్రుణ్ణి బ్రహ్మర్షిగా గౌరవించి ప్రస్తుతించినవేళ వసిష్ఠుని బ్రహ్మర్షిత్వం మరింత వ్యక్తమైంది. అంతటితో ఆగక రామలక్ష్మణులను అతనితో పంపమని దశరథుని ఆజ్ఞాపించినవేళ వసిష్ఠుని విశిష్టత ఏమిటో

మనకింకా బోధపడుతుంది. అంతకుముందు ఘట్టమైన పుత్రకామేష్టిలో ఋష్యశృంగునికి పెద్ద పీటవేయడం వసిష్ఠుని విశాల హృదయానికి నిదర్శనం. పనిని చేయగలగడం ఎంత విశేషమో, ఆ పనిని చేయగలిగిన వాడు సమర్థులైన తన తోడివారికి ఆ పనిని పంచిపెట్టగలగటం మరింత విశేషం. వసిష్ఠుని బ్రహ్మర్షిత్వానికి ఇది ఒక నిదర్శనం.

ఇక పట్టాభిషేక ముహూర్తం సంగతి. ఇది ఇలా జరుగుతుంది అన్న అంశం సర్వాంతర్యామియైన భగవంతుడు తెలియనిస్తేనే ఋషులకైనా తెలిసేది. తెలియటం లోకానికవసరం అన్నప్పుడు మాత్రమే ఆయన తెలియనిస్తాడు. అవసరంలేదు అన్నప్పుడు తెలియనివ్వడు. భగవద్గీతలో "మత్తః స్మృతిః జ్ఞానమ పోహనంచ" అన్న వాక్యానికి అర్థమిదే. "నీకు తట్టడం అన్నా నేనే, నీకు తట్టక పోవడమన్నా నేనే" అని అంటున్నాడాయన. ఏమంటారు ?

మనం టి.వి పెడతాం. కరెంటు ఉన్నది. టి.వి. కండిషన్‌లో ఉన్నది. అవతలనుండి ప్రోగ్రాం మాత్రం ట్రాన్స్‌మిట్ కావడంలేదు. అపుడు మీకేం కనబడుతుంది. ఏమీ కనబడదు. అదే 'ప్రోగ్రాం' 'ట్రాన్స్ మిట్' అవుతోంది అనుకోండి ! అప్పుడు మీకంతా కనబడుతుంది. ఋషుల శరీరాలు అలా కండిషన్‌లో ఉన్న టి.వి. సెట్లలాంటివి. సర్వాంతర్యామి ట్రాన్స్‌మిట్ చేయదల్చుకుంటే వారి ద్వారా అది లోకానికందుతుంది. లేదా ! అందే ప్రసక్తిలేదు. ఈ సత్యాన్నే ధర్మరాజుకి వివరించి చెబుతూ భీష్ముడు భాగవతంలో అంటాడు. 'అడగి మెలగుచుండు రంధులగుచు' అని, ఋషులు, మహనీయులు అయిన వారు సైతం సర్వాంతర్యామి యొక్క సంకల్పానికి అలా అణగి మణిగి ఒదిగి పని చేయవలసిందే. కనుక సర్వాంతర్యామి అందించదలుచుకుంటే అందిపుచ్చుకోవడానికి

పనికి వచ్చేది బ్రహ్మర్షిత్వం. బ్రహ్మర్షిత్వం ఉన్నది సర్వాంతర్యామి ఆదేశాన్ని అనుసరించడానికే గాని, ఆ సర్వాంతర్యామిని ఆజ్ఞాపించడానికి మాత్రంకాదు. తామనుకొన్న పని కానపుడు చుట్టుప్రక్కలవారు ఏమను కుంటున్నారని ఆ బ్రహ్మర్షులు క్రిందకు చూడరు. ఇంతకు 'ఆయన' సంకల్పం ఏమై ఉంటుంది అని వారు పైకి చూస్తారు. తామన్నది జరుగ లేదే అని అవమానాన్ని ఫీల్ కారు. ఆయన లీల ఏమిటా అని అవగాహన చేసుకోవడానికై యత్నిస్తారు. పరువు-ప్రతిష్ఠలు ఇవి అన్నీ సామాన్య మానవులకు సంబంధించినవి. ఈశ్వరేచ్ఛకు అనుగుణంగా సాగిపోవాలన్నదే బ్రహ్మర్షుల అభిమతం. వారు కోరుకునేది అదే. వారు మనకు నచ్చచెప్పేదీ అదే! ఏమంటారు ?

"అనటానికి ఇంకా ఏమైనా మిగిలి ఉంటే కదా! నా అనుమానం నిశ్శేషంగా నివృత్తయింది. అలా నివృత్తి చేయగల్గడమే మీలోని విశేషం," అన్నారా పెద్దాయన.

"ఊహూ! నాలోని విశేషంకాదు. నానుండి వ్యక్తమవుతున్న విశేషం" అన్నారు స్వామి.

"ఆ! ఆ! అమ్మో! మీరేమాత్రం పట్టాలు తప్పనివ్వరుగా!" అంటూ ఆ పెద్దాయన బండికి వేళయిందని సెలవు పుచ్చుకున్నారు.

# కాళ్లను కడిగే వేళలో

అతడిని చూస్తే నాకు చాలా బాధ వేస్తోంది. అతడిని ఎలాగైనా దారిలోకి తీసుకురావాలి. అతను మళ్లీ మనిషి కావాలి. బాగుపడాలి.

అతడిని బాగుచేయడానికి నీకున్న అర్హత ఏమిటి ? అంటే నేను చెప్పలేను. నీవు లోపాలకు అతీతుడవా....అంటే నేను ఒప్పుకోలేను. నాలోను ఏవో లోపాలు ఉండి ఉండవచ్చును. ఉండవచ్చు ఏమిటీ.... ఉన్నాయి. వాటిని నేను గ్రహించకపోలేను. కానీ అతడు బాగుపడాలి.

నా కనిపిస్తూ ఉంటుంది. మనం పూర్తిగా బాగుపడిపోయామా ఏమిటి, అతడు బాగుపడాలి, అతడిని బాగుచేయాలీ అని అంటున్నాం అని.

కానీ ఏదో ఆరాటం. అతను మళ్లీ దారిన పడాలని. వ్యసనాల కతీతుడు కావాలని. అతని తెలివితేటలు సద్వినియోగం కావాలని. నలుగురి చేత చిన్నచూపు చూడబడే స్థితినుండి అతను బయటపడాలని.

అంటూ ఎదురుగా కూర్చున్న మిత్రుడు పడుతున్న ఆరాటాన్ని అర్థం చేసుకున్న స్వామి ఇలా అన్నారు :

'మీకో చిన్న ఉదాహరణ చెప్తాను. బురదలో నడిచి వచ్చినపుడు కాళ్ల కడుక్కుంటాం. ఆ కడిగేటప్పుడు ఏం చేస్తాం. ఈ కాలుతో ఆ కాలును కడుగుతాం. ఆ కాలుతో ఈ కాలును కడుగుతాం. అంటే ఏం జరుగు తోంది. రెండు కాళ్లూ ఒక కాలి బురదను ఒకటి పోగొడుతున్నాయి. ఇద్దరి మనుష్యుల మధ్య కూడా జరిగేదదే. కనుక ఒక వ్యక్తి మరొక వ్యక్తిని బాగుచేయాలీ అంటే అతడు పరిపూర్ణుడై ఉండనక్కరలేదు. సహృదయుడై ఉండగలిగితే చాలు. ఇద్దరు మనుషులు కలిసి నడిచేటప్పుడు ఒకరివల్ల

ఒకరు ఎదుగుతారు. ఒకరివల్ల ఒకరు బాగుపడతారు. ఇది సత్యం. సృష్టిలో నిత్యమూ జరుగుతున్నదిదే !

మనము తల్లి బిడ్డను పెంచుతోంది అంటాం. నేనంటానుకదా.... బిడ్డ తల్లిని పెంచుతోంది అదే సమయంలో అని. తల్లి బిడ్డను భౌతికంగా పెంచుతుంది. బిడ్డ తల్లిని మానసికంగా పెంచుతుంది. మామూలుగా ఉన్న మనిషిని తల్లిగా రూపుదిద్దుతుంది. చూడండి ! ఈ సత్యాన్ని గమనిస్తూ బ్రతికితే ఆ తల్లికి ఎంత బావుంటుంది.

అలాగే చెడిపోయిన మీ మిత్రుని బాగుపడేలా చేయాలని మీరు చూస్తున్నారు. బాగా ఉన్న మిమ్మల్ని ఎప్పటికీ చెడిపోకుండా అతను చేస్తున్నాడు. వ్యసనపరుడైన మనిషి ఏ స్థితికి దిగజారిపోతాడో అతని విషయంలో దగ్గరగా చూస్తున్న మీరు ఇంకెప్పటికీ వ్యసనపరులు కాలేరు కదా! ఆ మేరకు కావలసిన హెచ్చరిక అతని జీవితంనుండి మీ కందు తోంది. ఎలా ఉంటే జీవితం సద్వినియోగ మవుతుంది అన్న ఆదర్శం మీ జీవితం నుండి అతని కందుతుంది. ఇలా ఒకరికొకరు ఇచ్చి పుచ్చుకుంటూ ఉండగా కథ ముందుకు సాగుతోంది. ఇదే నేను చెప్పిన ఉదాహరణలోని అంతరార్థం. ఏమంటారు ?

ఆ మిత్రుడు తృప్తిగా చూశారు స్వామివైపు. "నాకిప్పుడు ధైర్యం వచ్చిందండీ. అసలు ఆ ధైర్యం కోసమే నేనిక్కడకు వచ్చింది. ఈ ధైర్యం అన్నిచోట్లా దొరుకుతుందిటండీ ! చూశారూ నా దృష్టిలో ధైర్యం దొరికేచోటు దొరికినవాడు నిజంగా అదృష్టవంతుడు.

ఇక నేను మిత్రుణ్ణి వారికి తెచ్చేందుకు రంగంలోకి దిగుతాను మరి. ఆ కథలో మీదే ప్రధానమైనపాత్ర. అతణ్ణి వినేట్టుగాచేసి మీ దగ్గరకు తీసుకురావటం నా వంతు. అతణ్ణి సరిచేసి మనిషిగా మనవలసిందని

ఆశీర్వదించడం మీ వంతు” అంటూ ఆ మిత్రుడు కథ దారికి వచ్చినంతగా తృప్తిపడుతూ స్వామివైపు చూశారు.

నిజమేగా మరి. కథ వారికిరావడం అప్పుడే మొదలు పెట్టింది కదా !

# మీవాళ్ళే మళ్ళీ

ఐదువేల వరకూ నెలజీతం వస్తూఉంటుంది. అయితేమాత్రం ఏం లాభం ! ఈ ఉద్యోగానికి సరిపడా స్టేటస్ అదీ మెయిన్‌టైన్ చేయడానికే ఆ జీతం సరిపోతుంది. అంతజీతం అన్నమాటే తప్ప నెలాఖరున మిగిలేది ఏం ఉండదు. ఇద్దరు ఆడపిల్లలకు పెళ్ళిచేయాల్సి ఉంది. ఇద్దరూ ఎదిగి వున్నారు. మీకు తెలుసుకదా ! మాలో కట్నాలు ఎలా ఉంటాయో? తలుచుకుంటేనే భయంవేస్తుంది. జీతంలో మిగిలేదిలేదు. స్థిరాస్తులా ఏమీ లేవు. కట్నాలా రోజురోజుకు లక్షలకు లక్షలు పెరిగిపోతున్నాయి. మాలో పొలాలలో వ్యాపారాలలో ఉన్నవాళ్ళే ఎక్కువమంది వుంటారు. వాళ్ళకీ కట్నాలను తట్టుకోవటం ఏమంత కష్టంగా అన్పించడంలేదు. ఎటొచ్చీ మాలాంటి ఉద్యోగస్తులే ఎటూగాకుండా పోతున్నారు. ఏం చేయాలో ఏమిటో ? ఏమీ అంతుపట్టడంలేదు. భవిష్యత్తువైపు చూస్తుంటే భయం వేస్తోంది మాష్టారూ ! అంటూ దిగాలుగా చూస్తున్నాడాయన. దాదాపు యాభై ఏళ్ళుంటాయి. అది విశాఖపట్నం బస్‌స్టాండ్ అన్న విషయంకూడా ఆయన స్పృహలో ఉన్నట్లులేదు.

ఆయన ఒక బస్సు ఎక్కవలసి వుంది. స్వామిబృందం మరొక బస్సు ఎక్కవలసి వుంది. ఏ బస్సూ ఇంకా రాలేదు. సన్నివేశానికి అంతరాయం కల్గించడం ఎందుకూ అని ఆలస్యం చేస్తున్నట్లున్నాయి

పాపం. లేవా అవి సహజంగా చేసే ఆలస్యం ఇక్కడ ఇప్పుడు ఇలా సద్వినియోగం అవుతోందని చెప్పవచ్చును. కురుక్షేత్రంలో రెండు సేనలకు మధ్యలో అర్జునుడికి ఆనాడు కృష్ణుడు గీతను ఎలా ఉపదేశించాడో ఏమో గాని ఇప్పుడీ సన్నివేశం మాత్రం ఈ ఘట్టాన్ని తలపిస్తోంది. కిటకిటలాడు తున్నది బస్టాండ్. బస్సులకొాద, మనుష్యుల సొద ఎవరికి ఎవ్వరూ పట్టని స్థితి. ఎవరిగోల వారిది. ఆ మధ్యలో ఈ సన్నివేశం. 'మాష్టారుగారూ ! నాకేది దారి' అంటున్నాడాయన.

స్వామి ఇలా అన్నారు: మీ వేదన నాకర్థమైంది. ఈ కథకి మూలం దొరకాలన్నా, ఈ సమస్యకు పరిష్కారం కావాలన్నా మనం కొంచెం వెనక్కు వెళ్ళాలి. అసలు ముద్దుముచ్చటలుగా ఉండే కట్నకానుకలను ఒక ప్రత్యేకమైన అంశంగా, ప్రతిష్ఠకు ఒక కొలబద్దగా రూపొందించింది మీ వాళ్ళే. మీ వాళ్ళు వరకట్నాన్ని ఆనాటికానాటికి పైకెత్తుతూ సాగేటప్పటికి సమాజంలోని మిగిలినవాళ్ళు కూడా మిమ్మల్ని అనుసరించసాగారు. అనుసరించి, అనుసరించి వరకట్నాన్నొక సమస్యగా, మానవ సమాజం పాలిటి ఒక భయంకర శాపంగా రూపొందించుకున్నారు. ఇవాళ సమాజంలో అందరికీ ఇది ఒక సమస్యై కూర్చుంది. పరిష్కారం మాత్రం ఎవరికీ తట్టడంలేదు. దాంపత్యానికి దేహాలమధ్య శ్రుతి కుదరడం ముఖ్యం. మనస్సుల మధ్య శృతికుదరటం అంతకంటె ముఖ్యం. ప్రధానమయిన ఈ రెండంశాలనీ వదలి ధనానికి పెద్ద పీట వేస్తున్నారూ అంటే, ఈ అవివేకాన్ని ఏమనాలి.

నాకొక్కటే తడుతోంది. ముద్దుముచ్చటలుగా మాత్రమే సాగుతూ వస్తున్న వరకట్న విషయాన్ని ఈ రూపానికి తెచ్చింది మీవాళ్ళే. ఇప్పుడు పరిష్కారం చూపవలసింది కూడా మీవాళ్ళే. మీవాళ్ళే పూనుకొని కట్న ప్రసక్తి లేకుండా వివాహం చేసుకోవడం అనేదాన్ని ఒక ఫాషన్‌గా

రూపొందించాలి. అప్పుడు సమాజంలోని మిగిలినవాళ్ళు కూడా మళ్ళీ మిమ్మల్ని అనుసరిస్తారు. ఏమంటారు ?

ఇది జరిగేదేనా అనుకోకండి. చరిత్ర గమనించినవారికి కాదేదీ అసాధ్యమని తెలుస్తుంది. ఒకప్పుడు కన్యాశుల్కం సమస్య అయింది. అదిపోయి వరకట్నం ఒక సమస్యగా రూపొందింది. ఇప్పుడు ఇదిలేని స్థితి మాత్రం మనం ఎందుకు రూపొందించుకోకూడదు. రూపొందించు కోకపోతే కొన్నాళ్ళలో వరకట్నాలు పోయి మళ్ళీ కన్యాశుల్కాలు వస్తాయి.

ఇలా అంటున్నారేమిటి అనుకోకండి. ఇవాళ మనం ఏం చేస్తున్నాం. మన సృష్టి, మానవ సృష్టి అయిన వరకట్న సమస్యకు దడిసి దైవ సృష్టిని కించపరుస్తున్నాం. మనని మనం సరిదిద్దుకోవలసిందిపోయి దైవాన్ని తప్పు పడుతున్నాం. ఆడపిల్లలు పుట్టకూడదు అనుకుంటున్నాం. పుడితే దీనంగా ముఖం పెడుతున్నాం. మైనస్ పుట్టిందంటున్నాం. పుట్టిన తర్వాత బాధ పడటం ఎందుకని మనలో కొందరు స్కానింగ్ మొదలయిన ఆధునిక సౌకర్యాల ద్వారా పుట్టబోతున్నదెవరో తెలుసుకుని, ఆ పుట్టబోయేది ఆడపిల్లే అయితే అప్పుడే అబార్షన్ చేయించేసుకుంటున్నారు. ఎంత దారుణం. ఇలా అయితే కొన్నాళ్ళలో ఏమవుతుంది ? ఆడపిల్లల సంఖ్య తగ్గిపోతుంది. మగపిల్లల సంఖ్య పెరిగిపోతుంది. మగపిల్లలు మళ్ళీ కన్యాశుల్కమిచ్చి ఆడపిల్లల్ని తప్పకుండా కొనుక్కోవలసి వస్తుంది. ఏమంటారు ?

అందుకే నేనంటున్నది.... మీవాళ్ళే పూనుకొని వరకట్నం లేకుండా వివాహం చేసుకోవడమన్నది ఒక ఫాషన్‌గా రూపొందించాలి. సమాజం దాన్ని అనుసరించాలి. మీ సమస్య అనటంకన్నా ఇది అందరి సమస్య అలాంటి ఈ సమస్యకు పరిష్కారమిదే. ఆత్మవిశ్వాసం కలిగి

ఉన్ననాడు మనం సాధించలేనిదిలేదు. ఎవరికివారు వంటరిగా ఎదుర్కోవ డానికి ప్రయత్నించి అలసిపోవడంకన్నా నలుగురూ చేతులు కలపగలిగిన నాడు అసలేదీ సమస్యకాదు. సతీసహగమనం లాంటి సమస్యలకే కాలం చెల్లిపోయింది. ఇవి మాత్రం ఉంటాయంటారా, మనం గట్టిగా తలుచుకోక గాని.

స్వామి సూటిగా అయనలోనికి చూస్తున్నారు. ఆ చూపులు అయన లోని ఆత్మవిశ్వాసాన్ని రగుల్కొల్పుతున్నట్లున్నాయి. ఆయనకు తెలియ కుండానే ఆయన నిటారుగా నిలబడుతున్నాడు.

స్వామివైపు కృతజ్ఞతను కురిపించే కన్నులతో చూస్తూ ఇలా అన్నాడాయన. 'మీరన్నది జరుగుతుంది మాస్టారూ! సమాజాన్ని నిజస్థితి లోనికి మేల్కొలిపి నడపగల మీలాంటివాళ్ళున్నప్పుడు ఎందుకు జరగదు. తప్పక జరుగుతుంది, సమాజం కూడా మార్పును కోరుతోంది. ఆ మార్పును తెచ్చుకోవటానికి కావలసిన ధైర్యం మీవంటివాళ్ళ నుండి అది అందుకున్నవేళ తప్పకుండా రావలసిన మార్పు వస్తుంది. రావలసిన మార్పు వస్తుంది.

మార్పు వస్తుంది. మార్పు వస్తున్నదీ. అన్నదానికి సూచనగా ఎక్కవలసిన బస్సులు అంతలో అక్కడకు చేరుకుంటున్నాయి. ఆతడి నుండి వీడ్కోలు నందుకొని స్వామి ముందుకుసాగారు.

# పెళ్ళివారి ప్రయాణం

విశాఖలోని మన కార్యాలయంలో ఒకరోజు రాత్రి ప్రవచనం తరువాత సోదరులు కొందరు స్వామితో ముచ్చటిస్తూ కూర్చున్నారు.

సంభాషణల మధ్యలో ఒకతనిలా అడిగాడు. "మాష్టరుగారూ! దివ్య జీవనాన్ని గడపటానికి మీరు సూచిస్తున్న మార్గం ఎంతో సూటిగా వున్నది. సులువుగా బోధపడుతోంది కూడా. మార్గదర్శిగా మీ వంతు కర్తవ్యాన్ని మీరెంతో బాధ్యతతో నిర్వహిస్తున్నారు. కానీ ఈ మార్గం, ఈ విధానం ప్రతి ఒక్కరికీ అందాలీ అంటే ఎంతకాలం పడుతుంది! అసలదెలా సాధ్యపడుతుంది? అని అనిపిస్తూ ఉంటుంది. అందరికీ అందడం అసాధ్యంగా గోచరిస్తున్నప్పుడు మరి మీలాంటివాళ్ళు చేస్తున్న కృషంతా ఊరికే వృథా అయిపోతున్నట్లే కదా!"

అతని గొంతులో ఒక విధమైన బాధ ధ్వనిస్తోంది. స్వామి చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నారు: "మీ బాధ నాకు అర్థమయింది. మనం చెబుతున్న ఈ దివ్య జీవన విధానం ఈ కొద్దిమందికే అందుతోంది. ఈ విధంగా సాగితే మనం ఆశించిన జాతి పునర్నిర్మాణం ఎప్పటికి పూర్తవుతుంది అన్నది నీ బాధ. కలుగవలసిన తపనే ఇది. కానీ కంగారు పడవలసిన పనిలేదు. ఒక పదేళ్ళక్రితం పల్లెటూళ్ళ నొకసారి గుర్తు తెచ్చుకో. ఏ పెళ్ళికో తరలి వెళ్ళాలంటే అప్పుడేం చేసేవారు? వరుసగా పదులకొద్దీ ఎడ్లబండ్లు గూళ్ళుకట్టి ప్రయాణానికి సిద్ధం చేసేవారు. పెళ్ళి వారంతా ఆ బళ్ళమీద బృందాలు, బృందాలుగా ముచ్చటలు చెప్పుకుంటూ బయలుదేరేవారు. ఒక రాత్రివేళ బళ్ళన్నీ కలసి కదిలేవి. ఒకదానివెంట ఒకటి సాగిపోయేవి. అందులో మొదటి బండిని నడిపేవానికి మాత్రమే పెళ్ళి జరిగే గ్రామానికి దారి తెలిసేది. మిగిలిన బళ్ళన్నీ ఆ బండిని అనుకరిస్తూ సాగిపోవడమే. చూశావా! ఇక్కడ దారి తెలిసింది, ఆ

ముందు బండివానికి మాత్రమే. మిగిలిన బళ్ళను నడిపేవారికి గానీ, ఆ బళ్ళల్లో కూర్చుని కబుర్లు చెప్పుకునే వారికిగానీ, పెళ్ళి జరిగే ఊరికి దారి తెలియదు. తెలియకపోయినా వాళ్ళకేం ఇబ్బందిలేదు. దారి తెలిసినవాడు ముందుండి నడుపుతున్నాడు గదా! అది చాలు! అలాగే ఇప్పుడు కూడా అలా దారితెలిసి నడుపగలిగిన వాళ్ళని తగిన సంఖ్యలో మనం రూపొందించాలి. ఇక చాలు. వాళ్ళవెంట సాగిపోతుంది. ఏమంటావ్! ఆ దారి తెలిసి నడుపగలిగిన వాళ్ళను సృష్టించడానికే ఈ ప్రయత్నమంతా.

ఆ అడిగిన యువకుడు స్వామివైపు అలాచూస్తూ ఉండిపోయాడు కొంత సేపు. 'ఎంతో తపనపడి అడిగిన ప్రశ్నకు ఇంతలో ఎంతగా సమన్వయించి సత్యదర్శనం అందించారు మీరు.' అన్నట్లు చూస్తున్నాడతను. 'ఆ దారి తెలిసి నడిపే వాళ్ళల్లో నన్నూ ఒకనిగా స్వీకరించండి.' అంటూ ఆ చూపులతో అడుగుతున్నాడు.

అలాగే అన్నట్లు స్ఫూర్తిమంతంగా చూస్తున్నారు స్వామి.

## ఎంత బూటకం

ఆనాటి ఉదయం డిస్పెన్సరీ చివరికి వచ్చినట్లుగా ఉంది. క్రొత్తగా వచ్చిన కేసు ఒకటి చూస్తున్నారు స్వామి. ఆ పరిశీలనలో ఉండగా ఆ వ్యాధిగ్రస్తుడైన యువకుడు ఇలా చెప్పాడు : రెండేళ్ళక్రితం మా తండ్రిగారు పోయారు. ఆ తర్వాతనుండి ఈ అనారోగ్యం ప్రారంభమయింది.

స్వామి ఇలా అడిగారు. మీ తండ్రిగారు పోయినపుడు మీరు బాధపడ్డారా? భయపడ్డారా?

అతడు కొంచెం నివ్వెరపోయాడు. "బాధతోపాటుగా భయం కూడా

పడ్డాను. ఆయన పడుకునే గది మా గదికి ప్రక్కనే. పోయిన తర్వాత ఆ గదిలో ఆయన తారాడుతున్నట్లయ్యేది. దానితో భయం వేసేది."

"భయమెందుకు ? అ తారట్లాడేది మీ నాన్నగారే కదా !" అన్నారు స్వామి.

అదేమిటండీ అలా అంటారన్నట్లు చూశాడు అతను.

"ఏమిటోయ్ అలా చూస్తావు. శరీరం విడిచిపెట్టినంత మాత్రంచేత మీ నాన్నను చూసి మీరు భయపడాల్సినంత పనేముంది ? మీ నాన్న మీ నాన్న కాడా ? ఇప్పటిదాకా నాన్నగా ఉండి మీకు కావాల్సినవన్నీ చూశాడు కదా ! అంతలోనే మీరుచూసి భయపడి దయ్యమనవచ్చా ? బ్రతికున్నప్పుడు నాన్ననూ, పోగానే దయ్యమా ? బావుందయ్యా మన ప్రేమ. చాలా గొప్పగా ఉంది. తారట్లాడుతున్నాడు అంటావ్. శరీరం లేనివాడు తారట్లాడక ఏం చేస్తాడు ? నిన్నొక్కడ్నే అంటున్నాననుకోమాక ! మన వాళ్ళందరి నమ్మకాన్ని దృష్టిలో పెట్టుకునే అంటున్నాను. బ్రతికున్నప్పుడేమో మా తల్లీ, మా తండ్రీ, మా అన్న, మా తమ్ముడు, నా భార్యా, నా బిడ్డ అని కౌగలించుకుంటారా, పోంగానేనేమో భయపడిపోయి ఎగిరిగెంతి తాయత్తులు కట్టించుకొస్తారా ? ఇవన్నీ చూస్తుంటే ఈ ప్రేమలన్నీ ఎంత బూటక మనిపిస్తుంది నాకు. ఎంత అమానుషమయ్యా ఇది ? ఆ పోయినవాళ్ళపట్ల ఎంత అవమానకరం మన ప్రవర్తన. ఆలోచించు, నువ్వేకాదు మనందరం కలిసి ఆలోచించాల్సిన అంశమే ఇది.

మొత్తంమీద బలే టాపిక్ తీసుకొచ్చావయ్యా ! ఇంతకూ....వ్యాధి అక్కడనుండి ప్రారంభమైనదంటావ్" అంటూ కేస్‌షీటు పేజీలను త్రిప్పి చూడసాగారు స్వామి.

# నుదిటిరాత

ఉదయం డిస్పెన్సరీ కొంతవరకు నడిచింది. మధ్యలో విరామం లాంటి సమయమది. ఎదురుగా కూర్చుని మందు వ్రాయించుకుంటున్న ఆమె, పేషెంట్ మాత్రమేగాక సోదర బృందంలో ఒకరు. కుర్చీలో వెనక్కి జరిగి రిలాక్స్ అవుతున్న మాష్టరుగారిని చూస్తూ తన పరిస్థితిని సంక్షిప్తంగా చెప్పడం ప్రారంభించిందామె. ఇల్లూ, భర్తా బిడ్డలూ, అయినవారు, కానివారూ ఇందరి మధ్యలో గల తన జీవితాన్ని ఊహించుకుంటూ ఒక నిట్టూర్పు విడిచిందామె. ఆమె ముఖంలో అలసట కనబడుతోంది.

"ఎందుకలా ఇదైపోతావ్ ? 'బి స్పోర్టివ్' " అన్నారు స్వామి.

"ఏమి స్పోర్టివ్ మాస్టరుగారు ! ఈ నుదుటివ్రాత ఎలాఉంటే అలా జరుగక తప్పదుకదా !" అన్నది ఆమె.

సూటిగా చూస్తూ ఇలా అన్నారు స్వామి : నీవన్నది తప్పు. నుదుటి వ్రాత జరిగి తీరాలనిలేదు. ఆ వ్రాత నీ చేతనుబట్టే ఉంటుంది. నీచేత నీ చేతిలోనే ఉంది. మన సంప్రదాయంలో రెండు విశ్వాసాలున్నాయి. అందులో ఒకటి నిజమైనది. రెండవది కానిది. "శివుని ఆజ్ఞ లేకపోతే చీమైనా కుట్టదు" అంటారు పెద్దలు. అంటే దైవాజ్ఞను అనుసరించే ఈ సృష్టిలో సమస్తమూ జరుగుతాయని. ఇది యదార్థం. 'నుదుటివ్రాత జరుగక తప్పదు' అంటారు. ఇది తప్పు. మనచేత మారుతున్నకొద్దీ మన వ్రాత మారుతుంది. మన వ్రాత మారుతున్నకొద్దీ దైవాజ్ఞ మన శ్రేయస్సుకు అనుగుణంగా లభిస్తుంది. మనచేత వృధాపోదు. మన ప్రయత్నం వృధా కాదు. కనుక వ్రాత ప్రకారం జరుగుతుంది కదా అని మనిషి కూర్చుండి పోకూడదు. ఎలాగూ జరిగేది జరుగుతుంది కదా అని ఇంట్లో కూర్చుంటే మీ వంటింట్లో వంట అవుతుందా ? ఏం ? అక్కడెందుకలా అనుకోవు ? అలా అనుకుంటె వంటకాదని నీకు తెలుసు కనుక. మరి జీవితాన్ని గూర్చి

ఎందుకనుకుంటున్నావు. జరిగేదేదో జరుగుతుందని? అలా అనుకుంటే బద్ధకించడానికి వీలుంటుంది కనుక, మనది చిత్రమైన దేశం. ఇక్కడ మంచీచెడు రెండూ కలగా పులగంగా చెలామణి అయిపోతూ ఉంటాయ్. దేవుడి ఆజ్ఞ ప్రకారమే అంతా జరుగుతుంది-అన్న వాక్యం ప్రక్కనే, 'ఎలా వ్రాసిపెట్టి ఉంటే, అలా జరుగుతుంది. నుదుటివ్రాతను మార్చగల వాడెవడు?' అన్న వాక్యం కూడా చేరి చెలామణి అయిపోతూ ఉంటుంది. కనుక విచక్షణా జ్ఞానాన్ని వినియోగించి ఏది పెద్దల వాక్యమో, ఏది కాదో మనం గుర్తించగలగాలి. మనిషిని బద్ధకస్తుని చేసేది, నిర్వీర్యుణ్ణిచేసి కూర్చోపెట్టేది పెద్దల వాక్యమెలా అవుతుంది? కాబట్టి ఇలాంటి డైలాగులు మాను. నీ ప్రయత్నం నీవుచెయ్. ఆ చేయడంలో ఏమరుపాటు చెందవద్దు, అలసత్వాన్ని వరించవద్దు. ఇక ఫలితమంటావా? అది దైవానికి వదిలి పెట్టు. దైవాజ్ఞను విశ్వసించవలసింది అక్కడే.

"ఏం బోధపడిందా? మొత్తంమీద బలే వేదాంతం చెప్పావ్. నువ్వేకాదు. ఇటీవల ఈ జాతిలో చాలమంది ఈ వేదాంతం చెబుతున్నారు. మనం దేవాజ్ఞకు కట్టుబడాలి గాని, నుదుటివ్రాతకు కట్టుబడాల్సిన పనిలేదు. నుదుటివ్రాత ఎవరి అధీనంలో ఉందో వాడి ఆజ్ఞకు కట్టుబడటమే మనం చేయవలసింది. ఆ ఆజ్ఞాధికారం గలిగిన దైవం' నిరంతరం కర్మాచరణలో నిమగ్నం కమ్మని మనని ఆదేశిస్తున్నాడు. నిట్టూర్చవలసిన పనిలేదని హెచ్చరిస్తున్నాడు. ఇక పద! జరుగుతున్న దానివైపు కాక చేయవలసిన దేమిటో అటువైపు చూడు!

ఆమె కొంచెం కోలుకున్నట్లు కనిపించింది. ఆమెలో కొంత ఆశ్చర్యమూ కనిపించింది. తరతరాల నమ్మకాలపైన గొడ్డలివ్రేటు పడినట్లు అయినదికదా! మరి కనిపించదా?

# మానసిక భోజనం

సాయంత్రం 6-40 అవుతోంది. ప్రేయరు పూర్తయి తమ గదిలో ప్రశాంతంగా కూర్చొని వున్నారు స్వామి. అవతలగదిలో కాలక్షేపం చేస్తున్న తమ బంధువుకు కబురుపెట్టారు.

పిలుపుకు కారణం ఏమిటా? అన్నట్లు ఆలోచనగా చూస్తూ ప్రవేశించాడతను.

"ఏమిరా! నీవు వచ్చి నాలుగురోజు లైందనుకుంటాను!"

"అవునన్నయ్యా!"

"ఈ నాలుగురోజులు ఇక్కడ జరుగుతున్న కార్యక్రమాలు నీ గమనికకు వచ్చేవుంటాయ్!"

"ఊ!.... గమనిస్తున్నా నన్నయ్యా!"

"ఉదయం సాయంత్రం ప్రేయరులో ఎక్కడెక్కడివారూ వచ్చి పాల్గొంటున్నారు కదా! నీ విక్కడే ఉంటున్నవాడివి. నీవుకూడా వారితో కలిసి పాల్గొంటే ఇంకా బాగుంటుందేమో?"

"నేను మానసికంగానే ప్రార్థన చేస్తుంటా నన్నయ్యా! అందుకని ప్రత్యేకించి ఏ ప్రార్థనా కార్యక్రమాలు పెట్టుకోలేదు!"

"భోజనం కూడా మానసికంగా చేసేస్తే బాగుంటుందేమో? చూడు. అలా చేయటానికి ప్రయత్నించు."

అతడికి నవ్వొచ్చింది. సిగ్గుకూడా వేసింది. కాని సిగ్గు ఎందుకు వేస్తుందో అతనికింకా బోధపడినట్లుగా లేదు. తలను కొద్దిగా వంచుకొని ఏం చేయాలో తెలియక తేలనవ్వు నవ్వుతూ నేలవైపు చూస్తున్నాడు.

స్వామి ఇలా అన్నారు: మన పెద్దలు మనలాగ మానసికంగా ప్రార్థన చేసుకోలేకకాదు, ఇవన్నీ ఏర్పాటు చేసింది. మన తర్వాత వాళ్ళకు కూడా మార్గమందాలి అంటే మనయొక్క స్థాయీ దర్శనాలతో నిమిత్తం

వారింటికి చేరేటప్పటికి వారి గుమ్మంలో నిలబడి "ఏమండీ! మీరింత భక్తులు కదా! మన జాతికి అవసరమైన కార్యక్రమాలను చేపట్టాం. మీరు కూడా కొంత బాధ్యత స్వీకరించాలి అని అంటే, ఆ భక్తులంటారుగదా, "భలేవారండీ! మా పనులే మేం చేసుకోవడానికి అవకాశంలేక ఆ దేవుడి ముందు ఏకరువు పెట్టి, ఆ పనులు జరిగేటట్లు చూడాల్సిన బాధ్యతను ఆయనకు అప్పగించి మేం వస్తుంటే, మీరేంటండీ మధ్యలో ఈ గోల. దేశం అంటారు, జాతి అంటారు. అవేం వద్దులెండి బాబూ! ఏదో మా బ్రతుకేదో మేం బ్రతగ్గలిగితే అంతేచాలు!" అని జవాబు చెబుతారు.

అంతేగాని దేశం, జాతి బావుంటేనే వాళ్ళ బ్రతుకూ బావుంటుందని వాళ్ళకు తట్టదు. ఈ విధంగా తాము చేయవలసిన పనులను కూడా దేవుడికి అప్పగించి కాలక్షేపం చేసే సోమరులు ఎక్కువ మందిమి మన దేశంలో తయారవుతున్నాం గనుకనే ఇతర దేశాలవాళ్ళు సేవాకార్యక్రమాల పేరిట మన దేశంలోనికి ప్రవేశించి, క్రమంగా దేశాన్ని ఆక్రమించుకోగల్గుతున్నారు.

అయినా మనలో ఎక్కువమందికి చీమ కుట్టినట్లుగానయినా లేదు. లేకపోగా పెద్ద ఎత్తున డబ్బులు చెల్లించి మనంకూడా ఆ వైద్యాలయాల దగ్గర, ఆ విద్యాలయాల దగ్గర 'క్యూ'లు కడుతున్నాం. 'క్యూ'లు కట్టడానికైనా ప్రాణం ఒప్పుతోంది కాని, ఈ క్యూలు కట్టే సమయంలో ఈ పనిని మన జాతికి మనమే ఎందుకు చేసుకోలేం? అన్న ఆలోచన మాత్రం రావడం లేదు. ఈ విధంగా ఆస్తికతగా చెలామణి అవుతున్న అలసత్వం మనది."
స్వామి కనులు తెరిచే ఉన్నారు కాని, ఆ కనులు బయటికి చూడటంలేదు. లోపలికి చూస్తున్నట్లున్నాయి. జాతి మనస్తత్వం యొక్క అట్టడుగువాకా చొచ్చుకొనిపోయి పరిశీలిస్తున్నట్లున్నాయి. ఆయన దేహం మూర్తీభవించిన జాతిస్వరూపంగా కన్పిస్తుంది.

# భక్తుల రద్దీ

"పూజలంటే వస్తారు జనం. అభిషేకాలంటే వస్తారు. యజ్ఞయాగాలంటే వస్తారు. రావడమే కాదు డబ్బులు కూడా దండిగా ఇస్తారు. వారానికి ఒకరోజో, రెండు రోజులో దేవాలయాలకు కోరి మరీ వెళతారు. మరి దేశానికీ, జాతికి పనికివచ్చే పనులకు రమ్మంటే ఎక్కువమంది రారేం? నాకదే ఆశ్చర్యంగా వుంటుంది. ఆస్తికులూ, ఆరాధనా ఇంతగా కన్పిస్తున్న ఈ దేశంలో ఆర్తుల్ని ఆదుకోవాలీ, జాతిరక్షణకు అవసరమైన చర్యలు తీసుకోవాలీ అంటే అంతగా రారేం? మరి వీళ్ళంతా దేవుడి దగ్గరకు వెళ్ళటమెందుకు? క్రతుకాండలెందుకు?" అంటూ ఎదురుగా కూర్చున్న మిత్రుడు వేదనాభరితమైన గొంతుతో అంటున్నాడు.

వినవలసినంత సేపూ విని చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నారు స్వామి: ఒక చిన్న సత్యం చెప్పనా? దేవుడి దగ్గరకు వెళుతున్న వాళ్ళలో ఎక్కువమంది ఎందుకు వెళుతున్నారనుకుంటున్నారు. భక్తితో, శ్రద్ధతో, దేవుడిపైన ప్రేమతోనే ఇంతమంది వెళుతున్నారనుకుంటున్నారా? ఊహూ! వ్యక్తిగతంగానూ, కుటుంబగతంగానూ తాము చేయవలసిన పనులలో ప్రధానమైన వాటినన్నింటిని ఆ దేవుడికి అప్పగించి రావడానికి వెళుతున్నారు. ఈ పనులు మేం చేయకుండానే జరిగేటట్లు చూడాలి. అప్పుడే మీ మహిమ అని చెప్పిరావడానికి వెళుతున్నారు. నీచేత ఊరికే పని చేయించుకోంలే! నువ్వు ఈ పనులన్నీ చేసిపెడితే ఇదిగో ఈ తలపైన వెంట్రుకలన్నీ నీకిస్తాం. ఇదిగో ఇన్ని కొబ్బరికాయలు కొడతాం. కావాలీ అంటే మరొకసారి నీ కళ్యాణం జరిపిస్తాం- అని రకరకాల ఆశలు చూపించి మరీ వస్తున్నారు.

ఎవరైనా మీబోటివాళ్ళొకరు బయలుదేరి ఆ భక్తుల గుడి నుండి

వారింటికి చేరేటప్పటికి వారి గుమ్మంలో నిలబడి "ఏమండీ! మీరింత భక్తులు కదా! మన జాతికి అవసరమైన కార్యక్రమాలను చేపట్టాం. మీరు కూడా కొంత బాధ్యత స్వీకరించాలి అని అంటే, ఆ భక్తులంటారుగదా, "భలేవారండీ! మా పనులే క్షేమం చేసుకోవడానికి అవకాశంలేక ఆ దేవుడి ముందు ఏకరువుపెట్టి, ఆ పనులు జరిగేటట్లు చూడాల్సిన బాధ్యతను ఆయనకు అప్పగించి క్షేమం వస్తుంటే, మీరేంటండీ మధ్యలో ఈ గోల. దేశం అంటారు, జాతి అంటారు. అవేం వద్దులెండి బాబూ! ఏదో మా బ్రతుకేదో క్షేమం బ్రతగ్గలిగితే అంతేచాలు!" అని జవాబు చెబుతారు.

అంతేగాని దేశం, జాతి బావుంటేనే వాళ్ళ బ్రతుకూ బావుంటుందని వాళ్ళకు తట్టదు. ఈ విధంగా తాము చేయవలసిన పనులను కూడా దేవుడికి అప్పగించి కాలక్షేపం చేసే సోమరులు ఎక్కువ మందిమి మన దేశంలో తయారవుతున్నాం గనుకనే ఇతర దేశాలవాళ్ళు సేవాకార్యక్రమాల పేరిట మన దేశంలోనికి ప్రవేశించి, క్రమంగా దేశాన్ని ఆక్రమించుకోగల్గుతున్నారు.

అయినా మనలో ఎక్కువమందికి చీమ కుట్టినట్లుగానయినా లేదు. లేకపోగా పెద్ద ఎత్తున డబ్బులు చెల్లించి మనంకూడా ఆ వైద్యాలయాల దగ్గర, ఆ విద్యాలయాల దగ్గర 'క్యూ'లు కడుతున్నాం. 'క్యూ'లు కట్టడానికైనా ప్రాణం ఒప్పుతోంది కాని, ఈ క్యూలు కట్టే సమయంలో ఈ పనిని మన జాతికి మనమే ఎందుకు చేసుకోలేం? అన్న ఆలోచన మాత్రం రావడం లేదు. ఈ విధంగా ఆస్తికతగా చెలామణి అవుతున్న అలసత్వం మనది."

స్వామి కనులు తెరిచే ఉన్నారు కాని, ఆ కనులు బయటికి చూడటంలేదు. లోపలికి చూస్తున్నట్లున్నాయి. జాతి మనస్తత్వం యొక్క అట్టడుగువాకా చొచ్చుకొనిపోయి పరిశీలిస్తున్నట్లున్నాయి. ఆయన దేహం మూర్తీభవించిన జాతిస్వరూపంగా కన్పిస్తుంది.

"సత్యాన్ని సున్నితంగా చెప్పారు మీరు. సూటిదనం, సున్నితత్వం మీ వాక్కుకు సహజమైన అలంకారాలు" అన్నాడతడు.

'అలంకారాలు సరే, అసలు విషయాన్ని మనమిపుడు చూడవలసింది. ఈ వాక్కును మెచ్చుకునేవారు కాదు ఇప్పుడు కావల్సింది. తమ జీవితాలను మలచుకునేవారు కావాలి. ఈ జాతి అలసత్వం అనే పెనునిద్దర నుండి లేవాలి. అప్పుడే ఈ నా వాక్కుకు సార్థకత. అపుడే ఈ నా మనసుకు సంతృప్తి. బాధ్యతలను దేవుడికి అప్పగించే స్థితినుండి దేవుడిపేరిట ఈ ప్రపచం యెడల బాధ్యత పడే స్థితికి నా జాతి ఎదగాలి."

"మీలాంటి పెద్దల కృషి వృథా పోతుందంటారా?" అన్నాడు మిత్రుడు. విశ్వాసం అతని ముఖంలో తొణికిసలాడుతోంది.

"వృథా పోదు. వృథా పోవడంలేదు. కానీ మరింత సద్వినియోగం కావలసిన అవసరం మాత్రం వుంది. జాతి తమతో తిరుగాడుతున్న పెద్దలను సద్వినియోగం చేసుకోవడంలో ఇంకా శ్రద్ధ పెట్టవలసి వుంది. వర్షాకాలాన్ని వ్యవసాయదారుడు సద్వినియోగం చేసుకున్నట్లుగా, లేకపోతే కాలం వెళ్ళిపోతుంది. వ్యవసాయదారుడూ వెళ్ళిపోతాడు. మళ్ళీ ఆ కాలం రావాలీ అంటే జాతి ఆలోచించుకోవాలి. చిత్రం, జాతియొక్క అలసత్వమే పెద్దలను సద్వినియోగం చేసుకోవడంలో కూడా తీవ్రంగా అడ్డుపడుతోంది. ముందు అలసత్వం అక్కడ వదలాలి. అపుడు మిగతావన్నీ అవే వదిలి పోతాయి. శ్రీకృష్ణుడు "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అన్న మాటకు అర్థం ఇదే. జాతి అశ్రద్ధ నుండి ఆ శ్రద్ధలోనికి మేలుకోవాలి."

"ముందు నన్నాశీర్వదించండి! అశ్రద్ధ నుండి ఆ శ్రద్ధలోనికి మరింతగా మేలుకొనాలని. శ్రద్ధగా పనిచేద్దామన్న నాకే అప్పుడప్పుడు ఏమరుపాటున అశ్రద్ధ కమ్ముకొస్తుంది. ఇక జాతిస్థితి ఎలా ఉన్నదన్నది

నేనర్థం చేసుకోగలను. మీ చుట్టూ తిరుగుతున్న మేమే ఈ జాతికి ప్రతినిధులం. మమ్మల్నిబట్టి ఈ జాతి పరిస్థితిని సమీక్షించవచ్చు. మా కథలు, మా కుటుంబాల కథలు అవే ఈ జాతి కథలు.

నాకు తెలుసు మీరేం చేస్తున్నారో. జాతిని చూపిస్తూ వ్యక్తిని సంస్కరిస్తారు. వ్యక్తిని చూపిస్తూ జాతిని కర్తవ్యోన్ముఖం చేస్తారు. మాలో ఏ ఒక్కరితో మీరు మాట్లాడినా అవి మానవజాతి మొత్తాన్నీ ఉద్దేశించి మాట్లాడినవే అవుతాయి. వాటిని రికార్డు చేయాలేగాని సరిక్రొత్త భగవద్గీత రూపొందుతుంది. ఆ భగవద్గీత నేటి మానవుణ్ణి అలసత్వం అనే విషాదయోగం నుండి ఇవతలకు లాగుతుంది!" అంటూ ఆ మిత్రుడు ఉత్సాహంతో కర్తవ్యోన్ముఖుడై చూస్తున్నాడు.

"ఇక లేద్దామా ?" అన్నారు స్వామి.

"మీరు ఇంతకుముందే నన్ను లేపి నిలబెట్టారు. ఇప్పుడీ లేవడం ఉన్నదే అది శరీరానికి మాత్రమే వర్తిస్తుంది" అంటూ చేతులు జోడించి శలవు తీసుకున్నాడాయన.

ఉదయం డిస్పెన్సరీ పూర్తయింది. ఖమ్మం నుంచి వచ్చిన రాధాకృష్ణమూర్తిగారు ఆ ప్రక్కనే కూర్చుని ఉన్నారు, వైద్యసేవ ఆనందంగా పరికిస్తూ.

తమ ప్రక్కన కూర్చున్న కోటేశ్వరరావుగారికి రాధాకృష్ణమూర్తి గారిని పరిచయం చేస్తూ ఇలా అన్నారు స్వామి : పెద్దలు రాధాకృష్ణమూర్తి గారు మీకు పరిచయమయ్యారు కదా ! ఈయన రామభక్తులు. రాముడంటే ఈయనకు ప్రాణం. ఈ రామభక్తి సామాన్యమైనది కాదు. విశేషమయినది. చిన్ననాటినుండి ఎన్నో ఉద్యమాల్లో పాల్గొన్నవారీయన. ఎన్నెన్నో సిద్ధాంతాలను తరచి చూసినవారు ఈయన. చివరికి ఆయనకు ఒక ఆలోచన వచ్చింది. ఈ సృష్టి రూపుకట్టుకున్న తరువాత నిప్పులాగ నడిచిన మానవుడు ఎవడు ? సహృదయమూ, సామర్థ్యమూ సమపాళ్ళలో కలిగిన మానవుడు ఎవడు ? అని చరిత్ర పుటలను తిరుగవేయగా, తిరుగవేయగా సృష్టి కథను అవలోకనం చేయగా, చేయగా ఆయనకు కనిపించింది ఒక్కడే. అతడే శ్రీరామచంద్రుడు. అంతే ! ఇక రాముడికి అంకితమై పోయారు. ఆంజనేయుడిగా జీవించటం మొదలుపెట్టారు. ఎవరు దగ్గరైనా ఈయన చెప్పేదొక్కటే. ఒక్కసారి రామునివైపు తేరిపార చూసే ప్రయత్నం చేయండి అని. అవకాశమున్నంత మేరకు ఆ తత్త్వాన్ని ఆక శించుకోండని, జీవితాన్ని ధన్యం చేసుకోండని, ఇవీ ఆయన చెప్పే మాటలు. ఇదీ రాధాకృష్ణమూర్తిగారి మాట సూక్ష్మంగా.

రాధాకృష్ణమూర్తిగారి కనులు రామ దర్శనాన్ని పొందుతూ ఆనంద భాష్పాలు రాలుస్తున్నాయి. 'యత్రయత్ర రఘునాథ కీర్తనం' - అన్న శ్లోకాన్ని గుర్తుకు తెస్తున్నారాయన.

స్వామి ఇంకా ఇలా అన్నారు : పందొమ్మిది వందల ఎనభై ఎనిమిదిలో వసంత నవరాత్రుల సందర్భంగా ఖమ్మంలో నా ప్రవచన

కార్యక్రమం ఏర్పాటయింది. అప్పుడే ఆయన నాకు పరిచయం. రోజూ సాయంత్రమయ్యేటప్పటికి ఈ పెద్దాయన, చేతి కర్రతో సహా నా ముందు ప్రత్యక్షమయ్యేవారు. ఇరువురం కలిసి, రాముణ్ణి గూర్చి ముచ్చటించుకుంటూ వేదికను చేరేవాళ్ళం. ప్రవచనం పూర్తి కాగానే, అలా ప్రక్కగా నాకోసం నిలబడి ఉండేవారాయన. ఇరువురం కలిసి ప్రవచనంలో వెలికి వచ్చిన విశేషాలను ముచ్చటించుకుంటూ బసకు చేరేవాళ్ళం. నన్నలా బసకు చేర్చి నేను రిలాక్స్ అవడం చూసుకుని, రేపు కలుద్దాం అని చెప్పి, అప్పటికి ఇంటికి వెళ్ళేవారాయన. రోజూ రామదూత ఇలా వెంటబెట్టుకొని వెళ్ళి రామాయణం చెప్పించుకుంటున్నాడా !' అనిపించేది.

రాధాకృష్ణమూర్తిగారి కన్నులు మరొక్కసారి చెమ్మగిల్లాయి. 'బాష్పవారి పరిపూర్ణలోచనం' అన్న శ్లోక భాగాన్ని గుర్తుకు తెస్తున్నాయి. ఆ బాష్పధారల మధ్యలో నుండే చూస్తూ ఇలా అన్నారాయన : 'అపూర్వ అనుభూతి. వర్ణించ నలవికానంత అనుభూతి. రామాయణం చెప్పబడు తున్న ప్రతి చోటికీ అవకాశమున్నంతవరకు నేను వెళతూ ఉంటాను. నా రాముణ్ణి నాకు చూపించగలరేమో వారు అని చూస్తుంటాను. రామాయణం చెప్పడం వేరు. రాముణ్ణి చూపడం వేరు. కృష్ణస్వామిగారు చెబుతున్నప్పుడు రాముడు నాకు నిండుగా కనిపించాడు. అంతే ! ఇక నేనాయన వెంట నడి చాను. నా మనస్సును దోచుకున్న రాముణ్ణి కనులార చూడాలని అను కోవటం సహజమే గదా ! ఏమి చెప్పారు కృష్ణస్వామిగారు ! వాల్మీకి అడిగాడుట, నాకిలాంటి నాయకుడు కావాలని, నారదుడు చెప్పాడుట ఇదిగో నీచే కోరబడుతున్న నాయకుడు ఈ శ్రీరామచంద్రుడే'. అని అంతే ! ఈ ఘట్టం తొమ్మిది రోజులు నడిచింది. తొమ్మిది రోజులూ నిండైన రాముని మూర్తి అలా కనులముందు మెరిసి వర్తించింది. ఆ ఋషులిద్దరి మాటల తోనే రామాయణగాథ మొత్తం నడచిపోయింది. అపూర్వ అనుభూతి. అదే మమ్మల్ని ఇలా కలిపింది.

పులకితగాత్రులై అలా పారవశ్యంలో మునిగి తేలుతున్న రాధాకృష్ణమూర్తిగారిని చూస్తుంటే అక్కడున్న వారందరికీ, 'ఆంజనేయుడు చిరంజీవి అంటారు గదా ! ఒకవేళ అతడు మనకు గోచరించడం జరిగితే, ఇలాగే ఈ రాధాకృష్ణమూర్తిగారిలాగే ఉంటాడేమో !' అనిపించింది.

కొద్ది క్షణాలు నడిచిన తరువాత కోటేశ్వరరావుగారు ఇలా అన్నారు : ఒక చిన్న సందేహం. 'యోగవాసిష్ఠం శ్రీరాముడికి వశిష్టుల వారు చేసిన బోధ. భగవద్గీత శ్రీకృష్ణుడు అర్జునుడికి చేసిన బోధ. కాని భగవద్గీతకు వచ్చినంత ప్రచారం యోగవాసిష్ఠానికి రాలేదేమిటి ? ఎందుకని ఇలా జరిగిందంటారు ?'

'దీనికి కందిరాజు వారేమంటారు ?' అన్నారు స్వామి.

'ఇది చిత్రమైన ప్రశ్న. దీనికి సమాధానం మీనుండి వస్తే వినాలని ఉంది.' అన్నారు కందిరాజు రాధాకృష్ణగారు.

చిరునవ్వుతో స్వామి ఇలా అన్నారు : యోగవాసిష్ఠం రాముడికి వసిష్ఠుడందించిన మేలుకొలుపు. భగవద్గీత అర్జునుడికి శ్రీకృష్ణుడందించిన చేయూత. లోకంలో మేలుకొలుపుకన్న చేయూత కావలసినవారే ఎక్కువ మంది ఉంటారు. అందువలన యోగవాసిష్ఠంకన్న భగవద్గీతకు ప్రాచుర్యం ఎక్కువ వచ్చింది.

విషాదంలోపడి కొట్టుకుపోతూ, మార్గమిదేనా అని అడిగిన మానవుడికి చేయూతనిచ్చి, నిలబెట్టి జీవించడానికి కావలసిన సమన్వయాన్ని ఇచ్చి అతడిని సాధకునిగా రూపొందిస్తుంది భగవద్గీత. ఆపైన మానవుడిలో రావలసిన మేలుకొలుపును వచ్చేటట్లుగా చేస్తుంది యోగవాసిష్ఠం. కనుక భగవద్గీత మీదుగా యోగవాసిష్ఠం దగ్గరకు వెళితే చాలా బాగుంటుంది.

'బాగుంది. చాల బాగుంది మీ సమన్వయం' అంటూ మురిసిపోయారు రాధాకృష్ణమూర్తిగారు. తృప్తి కలిగిందన్నట్లుగా చూశారు కోటేశ్వరరావుగారు.

మళ్ళీ అంతా రామమయమై నిలిచింది వాతావరణం.

# ఉద్యోగ ప్రయత్నమా!

"ఇప్పుడు ఈ వెళ్ళిన పెద్దాయన మీకు తెలుసు కదా!" అడిగారు స్వామి, ఎదురుగా సావధానంగా కూర్చున్న మిత్రుణ్ణి ఉద్దేశించి.

"తెలియకేమి? బాగా సన్నిహితులే కదా!" అన్నాడా మిత్రుడు. స్వామి మిత్రుడి కళ్ళల్లోకి చూస్తూ ఇలా అన్నారు. "ఇప్పుడాయన్ని గూర్చి తెలుసుకోవలసింది నిజంగానే చాలా ఉంది. ఇటీవల ఆయనలో చాలా మార్పు వచ్చింది. ఇప్పుడాయన మాటలు వింటూంటే ఎంత ఎదిగాడీయన అనిపిస్తుంది.

పూర్వం తెలిసింది నలుగురికీ చెప్పాలన్న తాపత్రయ ముండేదాయ నకు. చిత్రంగా ఇప్పుడది కరిగిపోయింది. దాని స్థానంలో నిరంతరమైన కృషి చోటు చేసుకుంది. మంత్ర శాస్త్రాన్ని గురించీ, జ్యోతి శాస్త్రాన్ని గురించీ, హస్త సాముద్రికాన్ని గురించీ చాలా లోతులకు వెళ్ళి పరిశోధన చేస్తున్నదాయన మనస్సు. ఈ వయస్సులో రిటైరయినాక ఈ వృద్ధాప్యంలో ఇంకా ఇవన్నీ ఎందుకు అని ఎవరికైనా అనిపించవచ్చు. పోనీ ఆ విద్య లను ప్రదర్శించే ఉద్దేశమూ అతనికి లేదు. ఆ విద్యలను దర్శించాలన్న సంకల్పం మాత్రం ఉంది.

ఇంతకు ముందే ఆయన అన్నారు కదా! "ఈ శరీరం ఇంకెంతో కాలముండదు. పడిపోయే లోపల ఈ శరీరాన్ని సద్వినియోగం చేసే ప్రయ త్నంలో ఉన్నాను నేను ఈ పరికరాన్ని వీలైనంత ఎక్కువ ఉపయో గించి ఆత్మపరంగా వీలైనంత ఎక్కువ ఎదుగుదలను పొందాలన్నది ఇప్పటి నాయీ కృషికి కారణం. అందుకని మిగిలిన పనులు వీలైనంత తగ్గించుకొని ఈ కృషిలోనే ఉండిపోతున్నాను" అని.

ఆయన మాటలు నాకు ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కూడా కలిగిం

చాయి. "శరీరమాద్యం ఖలుధర్మ సాధనమ్" అన్న పెద్దల మాటకు భాష్యం చెప్పారాయన.

ఇక్కడింకొక విశేషముంది. ఇప్పుడాయన జ్యోతిర్విద్యపై కృషి చేయడం ఆ విశేషం. ఆ విద్యను అధ్యయనం చేయడంలో ఆయన సృష్టి వ్యూహాలను దర్శిస్తున్నారు. క్రమంగా సౌరమండలంతో తాదాత్మ్యం చెందు తున్నారాయన. మూల కారణాన్ని ముట్టుకునే యత్నంలో ఉన్నారాయన. ఆ యత్నంలో ఆయన ఉండగా ఆ అనుభూతిని ఆయన పొందుతూ ఉండగా ఎప్పుడో అప్పుడు ఆ శరీరం రాలిపడిపోతుంది. నిజంగా ఆయన చాలా అదృష్టవంతుడు !

"అబ్బ ! ఎలాంటి అంశం చెప్పారండీ. వింటూంటే ఆ దర్శనం నాకే కలుగుతోంది. జీవితాన్ని సద్వినియోగం చేసుకోవడాన్ని గూర్చి ఎటో వెళ్ళిపోతున్న ఈ మనిషికి మరొక్కసారి గుర్తు చేశారు మీరు. ఆయన కథ చెబుతూ నన్ను హెచ్చరించారు. నిజంగా క్షణం పోతే మళ్ళీ వస్తుంద టండీ ! కానీ రాదని తెలిసికూడా ఆయనకు వచ్చిన ఆ ఎరుక అందరికీ రాదే ! అదే వస్తే ఎంత బాగుంటుందండీ ! కనీసం ఇప్పటికైనా జాగ్రత్త పడాలి !" అన్నాడా మిత్రుడు. ఏవేవో అనుభూతులతన్ని చుట్టుముడుతూ ఉండగా-

స్వామి మళ్ళీ ఇలా అన్నారు, "పెద్దలొకరు ఒకప్పుడు నాతో అన్నారు. "మిగతా వారిలాగానే మీరు కూడా "పార్ట్‌టైమ్"గా చేయవచ్చు గదా ఈ పనిని. "ఫుల్‌టైమ్"గా తీసుకొని రిస్కును ఫేస్ చేయడం ఎందుకు ? ఉద్యోగం చేస్తూ ఈ పనినీ చేయవచ్చుకదా !" అని.

నేనిలా అన్నాను : నా దృష్టిలో ఆదాయంకన్నా ఆయుర్దాయం చాలా విలువైంది. అందుకని ఆయుర్దాయాన్ని సాధ్యమైనంతగా సద్విని

యోగం చేయాలన్న సంకల్పంతో నేనీ ఉద్యమ రూపాన్ని స్వీకరించాను. ఈ ఉద్యమమే నా ఉద్యోగం.

"చాలా చక్కగా చెప్పారండి. అలా చేయడానికే కాదు చెప్పడానికి కూడా చాలా కలేజా ఉండాలి" అన్నాడా మిత్రుడు అభినందనగా చూస్తూ.

ఉద్యోగం అంటే అర్థమేమిటి ? "ప్రయత్నమ"ని కదా ! ఉద్యోగ పర్వమంటే అర్థమేమిటి ? తమకు రావలసిన రాజ్యభాగం కోసం పాండవులు ప్రయత్నం చేసిన పర్వమని కదా అర్థం. మన వాళ్ళిప్పుడా అర్థాన్ని మరిచిపోయారు. మర్చిపోయి ఉద్యోగ ప్రయత్నం చేస్తున్నామంటున్నారు. ఉద్యోగమంటే ప్రయత్నమన్న అర్థం పోయి "జాబ్" అన్న అర్థం వచ్చేసింది. ఇంకేముంది ! ఆ ఉద్యోగ మొచ్చిన తరువాత అంటే "జాబ్" వచ్చిన తర్వాత ఇక ఉద్యోగమే ఉండదు. అంటే ప్రయత్నమే ఉండదు. జీవితంలో ఎదుగుదల ఆగిపోయి "రొటీన్" మాత్రమే నడుస్తూ ఉంటుంది చాలామంది విషయంలో.

జీవితంలో ప్రయత్నం నిరంతరం కొనసాగుతూనే ఉండాలి. మనం చేసే పనిపాటులన్నీ ఆ ప్రయత్నంలో భాగాలేనని మనకు తెలియాలి. సాగుతున్న ప్రయత్నాన్ని బట్టి మనిషి పొందే ఎదుగుదల ఉంటుంది. కనుక మానవుడు నిరంతరం ఉద్యోగి కావాలి.

స్వామివదనం గంభీరంగా ఉంది. మానవ జీవితాల పోకడలవైపు దృష్టిని సారించి తమ వాక్కును అను సంధిస్తున్నారాయన. ఆ సమయాన అప్రయత్నంగా వ్యక్తమవుతున్న గాంభీర్యమది.

స్వామి మళ్ళీ ఇలా అన్నారు : ఎవరైనా శరీరాన్ని విడిచిపెట్టి పోతుంటే సామాన్యంగా మనకేమనిపిస్తుంది. ఇంకో పది నిముషాలైనా బ్రతికితే బాగుండునని ! మరి జీవించి ఉండగా ఎన్ని నిముషాలు గడి

పేస్తున్నాం మనం. అప్పుడా నిముషాల విలువ మనకేమన్నా తెలుస్తోందా ! ప్రాణం కడబడుతున్నప్పుడు ఇంకో పదినిముషాలైనా బ్రతికించు అని దేవుడిని అర్థించే మనిషి జీవించి ఉన్నప్పుడు మరి కాలంపైన శ్రద్ధ పెట్టి లేక పోతున్నాడేం ? మరి కాసేపు బ్రతకాలని కోరుకుంటున్న నీవు, బ్రతికి నంతకాలం ఏం చేశావని దేవుడడిగితే మనిషి చెప్పే జవాబేమిటి ?

మిత్రుడు తల పంకించాడు. పచ్చి నిజాలు చెబుతున్నారు మీరు. సూటిగా తుపాకి పెట్టినట్లుగా అడుగుతున్నారు మీరు. ఈ రోజు నిజంగా శుభదినం. మనని గూర్చి మనను ప్రశ్నించుకున్న పర్వదినమిది. అన్నట్టు ఈ రోజు మీ పుట్టిన రోజటకదా ! క్రింద ఆ అమ్మాయి ఇందాక స్వీట్ చేతికిస్తూ చెప్పింది. అనుకోకుండా జన్మదిన సందేశాన్ని మీ నుండి ఇలా అందుకోగల్గాను. ఎంత అదృష్టమండీ! ఎంత హాయిగా గడిచిందీ సమయం. ఎంత వెలుగుగా గోచరిస్తున్నదీ జీవితం.

నిజమేనండీ ! ఇవాళ అమకోకుండా అనుకోవలసిన మాటలను కున్నాం మనం. అనుక్షణం గుర్తుకు రావలిసిన వాక్యాలివి. ఇకలేద్దామా మరి" అంటూ మిత్రునికి చేయి అందించారు స్వామి.

# శంక తొలిగింది

ఖమ్మం నుంచి వచ్చిన రాధాకృష్ణమూర్తిగారు వచ్చి స్వామి ప్రక్కనే ఆసీనులై, జరుగుతున్న వైద్యసేవలోని ఆనందానుభూతిని పంచుకుంటున్నారు. కాసేపటిలో వైద్యసేవ పూర్తయి స్వామి ఇక రాధాకృష్ణమూర్తిగారివైపు తిరిగారు.

'ఇక చెప్పండి మీ కబుర్లు'— అన్నారు స్వామి.

'కబుర్లన్నీ బాగానే ఉన్నాయి. ఇలా వీలు దొరికినప్పుడల్లా రావడం, జరుగుతున్న కార్యక్రమాలను చూసి ఆనందించటం, మధ్యలో ఇలా విరామం దొరికితే పురాణేతిహాసాల్లోని ఏ అంశాలో మిమ్మల్ని అడిగి, మీరు వానిని వివరించి చెపితే, ఆనందాతిరేకంతో వింటూ ఉండటం, ఇదీ మా 'పని' అంటూ రాధాకృష్ణమూర్తిగారు కన్నులను పెద్దవిచేసి స్వామి వైపు చూస్తూ కూర్చున్నారు. కన్నులతోపాటు చెవులుకూడా పెద్దవి కావటానికి ప్రయత్నిస్తున్నట్లున్నాయి ఆయనకి.

'అయితే ఈ పూట అంశమేమిటో చెప్పండి. ఇక దానిలోనికి వెళదాం'— అన్నారు స్వామి.

'భాగవతంలో ప్రహ్లాద చరిత్ర ఉంది. ఆ ప్రహ్లాదుణ్ణి గురించి వర్ణిస్తాడు మొదట. వర్ణిస్తూ అంటాడు కదా ! 'పరస్త్రీలు ఎదురైతే వారిని మాతృమూర్తులుగా చూస్తూ, తొలగిపోయేవాడు' అని; మళ్ళీ ఆ తరువాతి కథలో, 'అతని వయస్సు ఐదేళ్లు'- అంటాడు. అయినప్పుడు ఈ వర్ణనను మనం ఎలా అర్థం చేసుకోవాలి? మామూలుగా చూస్తే ఈ అంశాలు పొసిగేటట్లుగా లేవే! ఈ అంశాలను చూడటానికి కావలసిన చూపు ఎటువంటిది అనేది ఇక మీరు అందించాలి.

జిజ్ఞాస నిండిన చూపులతో అలా స్వామిపైపు చూస్తూ కూర్చుండి పోయారు రాధాకృష్ణమూర్తిగారు స్వామి ఎప్పుడు ఏమి చెపుతారోనని.

స్వామి ఇలా అన్నారు: భాగవతంలో ఈ ప్రహ్లాద చరిత్రను నారదుడు ధర్మరాజుకు చెపుతాడు. మొదట అతను ప్రహ్లాదుణ్ణి గురించి ప్రస్తావిస్తాడు. ఆ ప్రస్తావించడంలో ప్రహ్లాదుని యొక్క పవిత్రమైన వ్యక్తిత్వాన్ని గురించి పరిపూర్ణమైన వర్ణన చేస్తాడు. ఆ వర్ణనలోని ఒకానొక అంశమే మీరు నన్ను అడిగింది.

ఆ వర్ణనమ విన్న ధర్మరాజు, 'అలాంటి దివ్యమైన మూర్తికి సాక్షాత్తు తండ్రియైన హిరణ్యకశిపుడే, ఎలా ఇబ్బందులపాలు చేయగలిగాడు?'- అని అడుగుతాడు. అప్పుడు నారదుడు ప్రహ్లాదుని చిన్నప్పటి సన్నివేశాలను ప్రత్యేకంగా మళ్ళీ వివరిస్తాడు. ఆ వివరించిన సన్నివేశాలలోని ప్రహ్లాదుని వయస్సు అయిదు సంవత్సరాలు. అదీ కథ! అంతేగాని, మొదటగా వర్ణింపబడిన ప్రహ్లాదుని జీవిత వైభవానికి సంబంధించిన వయస్సు కాదిది.

అంటే ఇక్కడేం జరిగిందన్నమాట. నారదుడు మొదట ప్రహ్లాదుని వ్యక్తిత్వాన్ని మొత్తాన్ని వర్ణించాడు ఆ పైన అలాంటి వ్యక్తియొక్క చిన్నతనం ఇలా గడిచింది- అని ఇలా చెప్పాడు. మనం కూడా చాలసార్లు ఇలా చేస్తూ ఉంటాం. ఏ గాంధీమహాత్ముడి గురించో చెప్పేటప్పుడు ఆయన ఇలాంటివాడు, అలాంటివాడు అంటూ ఆయన గుణగణాలను ముందుగా వర్ణించి, అలాంటి అయన జీవితంలో ఒకసారి ఏం జరిగిందంటే అంటూ వివరిస్తాం.

ముందుగా చేయబడిన వ్యక్తిత్వ వర్ణన ఆ వ్యక్తిని గురించి ఒక చక్కని అవగాహనను అందిస్తుంది. ఆ పైన చేయబడిన జీవిత సన్నివేశాల వివరణ, హృదయాలకు చక్కగా హత్తుకుంటుంది. ఈ సన్ని

వేశాలు హృదయానికి హత్తుకోవాలి అంటే, ముందుగా ఆ వ్యక్తిత్వాలకు సంబంధించిన ఒక పరిపూర్ణమైన దర్శనం, ఆ కథను స్వీకరిస్తున్నవాడికి కలగాలి. కథా కథనంలో ఇది ఒక చక్కటి ఒడుపు.

'తృప్తి కలిగిందా?' అన్నట్లు చూశారు స్వామి.

'దివ్యంగా ఉంది మీరు ఇచ్చిన వివరణ. ఎన్నినాళ్ళగానో, నాలో చోటుచేసుకుని ఉన్న శంక ఇట్టే తొలగిపోయింది'- అంటూ నమస్కరించారు రాధాకృష్ణమూర్తిగారు.

## అటుచూడు

'నే నెందుకని పనిని పూర్తిగా చేయలేక పోతున్నాను?'- అని ఆలోచిస్తే ఒక మూడు లక్షణాలు నాకు కనిపిస్తున్నాయి. ఒకటి జ్ఞాపకశక్తి లేకపోవటం, రెండవది పనులు వాయిదావేసే లక్షణం, మూడవది బద్ధకం. ఈ మూడు అవలక్షణాలు కలిసి పనికి తగిన వ్యక్తిగా నన్ను రూపొందనీయటంలేదు!- అంటూ నిట్టూర్చిందొకామె.

ఆ నిట్టూర్పును గమనించి స్వామి ఇలా అన్నారు :

ఇలా అవలక్షణాలను తలుచుకుంటూ కూర్చోవటంవల్ల అవి మరింత బలపడతాయి తప్ప, నిన్ను వదిలిపెట్టవు. ఎన్నివిధాలైన అవాంతరాలున్నప్పటికీ, ఈ ఉద్యమంతో ఆత్మీయమైన బంధం పెంచుకోబట్టేకదా, నీవు ఇక్కడికి పద్ధతిగా రాగలుగుతున్నావు. అలాగే ఉద్యమం యెడల, ఉద్యమ లక్ష్యం యెడల మరింత ఆత్మీయతను పెంచుకునే ప్రయత్నం చేయి. అప్పుడు ఈ అవలక్షణాలన్నీ వాటికవిగా నిన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతాయి. మనిషిని చెదరకుండా నిలబెట్టగలిగేది అతడి లక్ష్యం మాత్రమే. దానివైపే అతడు చూడవలసింది. ఇక అదే అతడిని చూసుకుంటుంది.

ఒక ఉదాహరణ చెపుతాను చూడు. దీపారాధన కుందులను రెండింటిని తీసుకున్నామనుకో, రెండింటిలోనూ రెండు కుండ వత్తులను కూడా వేశాం. నూనె పోశాం. వత్తులు సరిగ్గా ఉండేటట్లుగా చూశాం. ఒక వత్తిని వెలిగించాం. మరొక దానిని వెలిగించలేదు. కొంతసేపు ఆగి చూడు. ఈ వెలిగించబడిన వత్తి అలాగే నిలబడి చక్కగా వెలుగుతూ ఉంటుంది. వెలిగించకుండా అలాగే అట్టిపెట్టిన వత్తి ఉందే అది ఒక ప్రక్కకు ఒరుగుతుంది నువ్వు దానిని సరిచేశావనుకో, మళ్ళీ కాసేపాగి చూస్తే, మరో ప్రక్కకు ఒరిగి ఉంటుంది. అక్కడేం జరుగుతుందో గమనించావా? వెలిగింపబడిన వత్తి అలాగే నిలబడి ఉంటున్నది. ఎందువల్ల? అది అలా ఉండేటట్లుగా ఆ వెలుగుతున్న వెలుగు మొగ్గే చూచుకొంటుంది. రెండవ దానిలోని వత్తి వెలిగింపబడలేదు. దానిని నిలబడేటట్లు చూసుకునేందుకు అక్కడ వెలుగు మొగ్గలేదు. అలాగే మనమొక మహత్తరమైన లక్ష్యానికి అంకితమైనప్పుడు, నిరంతరం ఆ లక్ష్యస్మరణలోనే ఉంటూ, ఆ లక్ష్యం కొరకే పనిచేస్తున్నప్పుడు, ఆ లక్ష్యమే మనను అన్నివిధాలా సంస్కరించి, తనకు తగిన విధంగా మనను మలచుకుని, నిలబెట్టుకుంటుంది. కనుక మనం చూడవలసింది అటువైపు. 'పరం దృష్ట్వా నివర్తతే'- అన్న గీతా వాక్యానికి అర్థమిదే.

ఆమెకు మార్గం బోధపడింది. ఆ బోధపడటాన్ని తృప్తిగా వెలుగుతున్న ఆమె వదనమే సూచిస్తోంది.

# సంస్థల్లో ఆడా-మగా

ఆ సంస్థల్లో ఆడవాళ్ళకే ప్రాధాన్యం. అనాదిగా ఆడవారికి అన్యాయం జరిగిందనీ, అది గమనించిన మేము ఆడవారికి ప్రత్యేక స్థానాన్ని, ప్రథమ స్థానాన్ని ఇస్తున్నామని వారంటారు. వారు సంస్థకు అధిపతిగా కూడా ఆడవారినే ఎంచుకుంటారట. మగవారికి కూడా అందులో చోటుంటుంది గాని, ఆడవారి తరువాతనే. 'అన్నయ్యా, అక్కయ్యా' అని ఒకరి నొకరు పిలుచుకుంటూ ఉంటారు అక్కడ. వివాహానికి, సంతతికి వారు అంతగా ప్రాధాన్య మివ్వరు. బ్రహ్మచారులుగా ఉండిపోవటాన్నే వారు ప్రోత్సహిస్తారు. పెళ్ళి చేసుకుంటే కాదనరు గాని, ఆ ఆలోచనకు అంత ఇష్టంగా ముఖం పెట్టరు. బ్రహ్మచారులుగా ఉండిపోయినవారిలో, ఆ సంస్థలో స్త్రీల సంఖ్యే ఎక్కువగా కనబడుతుంది. ఆ సంస్థను నడిపిస్తున్నదీ, నిర్వహిస్తున్నదీ ప్రధానంగా స్త్రీలేనని చెప్పాలి. ఇదొక చిత్రమైన పరిణామంగా కనిపిస్తుంది. ఈ పరిణామం దేని ఫలితం అంటారు ? దీని గమ్యం ఏమిటంటారు ?

స్వామి ఇలా అన్నారు : మీ పరిశీలన బాగుంది. నడివయస్సు దాటకుండానే చాలా అంశాలు ఆకళించుకోగలిగారు మీరు. ఎప్పుడు కలిసినా ఇలాంటి లోతైన అంశాలు ప్రస్తావనకు తెస్తూ ఉంటారు. సరే వినండి చెబుతాను : "సనాతన ధర్మం" స్త్రీమూర్తికి ప్రథమ స్థానాన్ని ఇచ్చింది. "మాతృదేవోభవ"— అంటూ మొదటి నమస్కారం ఆమెకే అందజేసింది. మనువు కూడా "స్త్రీలు పూజింపబడినచోట దేవతలు పరవశిస్తూ తిరుగుతారనీ, స్త్రీలు ఇబ్బంది పెట్టబడినచోట ఇక సమస్యల పాలైపోతారని హెచ్చరించాడు.

మన ఋషులు గృహస్థాశ్రమానికి పెద్దపీట వేశారు. సంతతి అనే దారాన్ని తెంచవద్దు అన్నారు. వేదోపనిషత్తులను దర్శించి ఇచ్చిన ఋషు

లలో గృహస్థులే ఎక్కువ మంది. గురుకులాలను నడిపినవారిలో కూడా ఎక్కువమంది గృహస్థులే. మానవ జీవితాన్ని "చతురాశ్రమాలుగా" రూపొందించారు వారు. విద్యార్థి దశను బ్రహ్మచర్యాశ్రమ మన్నారు. ఆ విద్యను సమాజానికి సద్వినియోగం చేసే దశను గృహస్థాశ్రమం అన్నారు. ఇది వివాహంతో ప్రారంభమవుతుంది. ఇప్పుడు మనం రిటైర్‌మెంట్ అంటున్నామే. ఆ దశను మనవారు వానప్రస్థాశ్రమం అన్నారు. అంటే ఏమిటి ? సమాజానికి చేసిపెట్టేటందుకు కావలసిన ఓపిక శరీరానికి తగ్గింది. తగ్గేటప్పటికి బిడ్డలు చేతికి అందివచ్చి ఉంటారు. కనుక ఆ పనిని వారికి అప్పగించి, మీరు విశ్రాంతి పొందండి !" అన్నారు. అయితే ఇన్నాళ్ళా పనిచేసినందుకు, మీరు ఎంతో అనుభవాన్ని సంపాదించి ఉంటారు. ఆ అనుభవాన్ని యువకులకు ఈ వానప్రస్థాశ్రమంలో పంచిపెట్టండి. వారికి కావలసిన గైడెన్స్ ఇవ్వండి. వారి నిత్యజీవితాలలో మాత్రం అతిగా కలుగజేసుకోకుండా జాగ్రత్త పడండి". అని చెప్పారు. మీ గైడెన్స్ లేక పోతే, యువకులకు దారి తెలియదు. అలాగని మీరు అతిగా కలుగజేసు కుంటే వారి ప్రయాణం సాగదు. ఈ సూక్ష్మాన్ని గ్రహించి, వానప్రస్థాశ్ర మాన్ని ఒడుపుగా నడుపుకోమన్నారు. అంటే శరీరానికి పని తగ్గి, మన స్సుకు మాత్రం తగు మాత్రంగా పని చెప్పమన్నారన్నమాట. ఆటుపైన ఆ మనస్సుకూడా అలసిపోయిన స్థితి వస్తుంది. శరీరములో పనిచేస్తున్న శక్తియుక్తులు ఒకటొకటిగా నిష్క్రమించే దశ వస్తుంది. ఈ స్థితిని వారు "యత్యాశ్రమము" అన్నారు. అంటే ఏమిటో తెలుసునా ? మీరు లోకానికి స్వయంగా చేయవలసిన పనిని చేశారు. ఆ పైన మీ అనుభవాన్ని పంచిపెట్టడం ద్వారా లోకానికి సహకరించారు. మీ క్రియబడిన శక్తియుక్తులు సద్వినియోగమై మీ నుండి నిష్క్రమిస్తున్న స్థితిలో ఇక మీరు కేవలం సర్వాంతర్యామితో శ్రుతిని కలిపి నిలవండి. పండిన పండులా, ఒక పండు టాకులా మీనుండి మీ శరీరం అనాయాసంగా రాలి పడిపోతుంది, అంటూ

పరిపూర్ణమైన మానవ జీవితానికి రూపుదిద్దారు ఋషులు. ప్రత్యేక సందర్భాలలో తప్ప వారెవరూ వివాహమాడకుండా ఉండిపోయే ప్రయత్నం చేయలేదు. ఆకలి ఎటువంటిదో, దప్పిక ఎటువంటిదో, దాంపత్యాభిలాషకూడా అటువంటిదే! అది ఒక పవిత్రమైన 'అగ్ని'. మన తరువాత తరాలు నిలబడేటందుకుగాను, మననుండి పనిచేస్తూ, మనచేతకూడా పనిచేయిస్తున్న అగ్ని అది. ప్రకృతి సహజమైన అంశమది. ప్రకృతికి సహజమైన అంశాలను మనం వ్యతిరేకించకూడదు. పవిత్రంగా నిర్వహించుకోవాలి. అంటే ఆ అంశాలు మనలో ఎందుకు ఏర్పాటవుతున్నాయో గ్రహించుకొని, అందు కొరకు మాత్రమే వాటిని వినియోగిస్తూ, దైవమయంగా జీవించగలగాలి అన్నది మగ ఋషుల ఉపదేశం. ఇది వారు ఒసగిన పరిపూర్ణమైన జీవన విధానం.

ఋషుల ధర్మంలో స్త్రీ, పురుష విభాగానికి సద్వినియోగమున్నదీ. 'దైవమే సృష్టికార్య నిర్వహణార్థమై స్త్రీ, పురుషులుగా తనను తాను విభాగించు కొంటున్నాడు' అని వారు దర్శించారు. ఆ విభాగాన్ని సద్వినియోగం చేయమన్నారు. విభేదాలకు ఏమాత్రం ఇందులో చోటు లేదన్నారు. అంటే ఇక్కడ ఎక్కువ తక్కువలు చూడటానికి అవకాశం లేదన్న మాట. అలా చూస్తే, దైవాన్నే చిన్నచూపు చూసిన వాళ్ళమౌతాం. విభాగాల యొక్క వినియోగాలను మరచి, విభాగాలకి విలువలను కట్టే ప్రయత్నం. అది సమాజంయొక్క పతనావస్థకు దారితీస్తుంది - అన్నది పెద్దల ఉపదేశం.

'మరి ఋషుల దర్శనం ఇంత పరిపూర్ణంగా ఉన్నప్పుడు బ్రహ్మచర్యానికి, ఆధ్యాత్మికతకూ ముడి పెట్టడం అనేది ఎలా ప్రారంభమైనదంటారు? ఎప్పటినుండి ప్రారంభమైనదంటారు?' అన్నాడతను ఆశ్చర్యంగా చూస్తూ.

స్వామి ఇలా అన్నారు: 'ఇలా ముడిపెట్టటం అనేది బుద్ధుని కాలం

నాటినుండి ప్రారంభమైంది. బుద్ధుడు ఎంతటి అవతారమూర్తో అంతటి ఆవేశమూర్తికూడా! భూతదయ, కరుణలతో నిండిన ఆవేశ స్వరూప మతనిది. కనుక బ్రహ్మచారులుగా ఉండిపోతే సాధకులు సమాజానికి ఎక్కువ సేవ చేయగలుగుతారు' అని అతనికి అనిపించింది. అంతే. అతడు దానిని వెంటనే అమలు పరిచాడు. సేవకొరకు సన్యాసాశ్రమమన్నది బుద్ధుని సృష్టియే. మళ్ళీ ఆ సన్న్యాసులలోనికి పురుషులతోపాటు స్త్రీలను కూడా స్వీకరించాడు. అతడు స్త్రీలను చిన్నచూపు చూడలేదు. కాని, సేవ చేయటానికి సన్న్యాసం స్వీకరించటం అవసరమని మాత్రం అతడు అనుకున్నాడు. ఈ విధంగా సేవా బోధలకు సన్న్యాసాశ్రమ స్వీకారం బాగుంటుందనే పద్ధతిని పట్టుకొచ్చాడు. బుద్ధుడి తరువాత వచ్చిన ఆదిశంకరులు కూడా బౌద్ధానికి జవాబు చెప్పడం కోసం, మరల ఈ పద్ధతినే స్వీకరించారు. ఇక అప్పటినుండి తత్త్వబోధకు, సన్న్యాసాశ్రమానికి ముడిపెట్టటమనేది ఒక సంప్రదాయమై కూర్చుంది. ఆధునిక కాలంలో వివేకానంద వంటి మహనీయులు కూడా ఈ పద్ధతినే కొనసాగించారు. అయితే వివేకానందుడు తత్త్వబోధకే పరిమితమైన సన్న్యాసులను సేవకులుగా కూడా రూపొందమని, బుద్ధుడు ప్రేమతో హెచ్చరించాడు.

ఈ సంప్రదాయం ప్రారంభమయిన తరువాత క్రమంగా స్త్రీలను చిన్నచూపు చూడటం అనేది కూడా సమాజానికి అలవాటయింది. దీనికి విదేశీ దండయాత్రలు కూడా చాలా దోహదం చేశాయి. ఆ దండయాత్రలవల్ల స్త్రీ స్వేచ్ఛను తాత్కాలికంగా అరికట్టవలసి వచ్చింది. సమాజ రక్షణ కోసం ఆ నాడు అది అవసరమైంది. కాని, ఆ తరువాత అది అలవాటైకూర్చుంది. క్రమంగా గృహిణి గృహోపకరణాల్లో ఒకటిగా మిగిలిపోయింది. సరిగ్గా ఈ కాలంలోనే తత్త్వప్రచారకులు స్త్రీలను తక్కువచేసి చెప్పడం ప్రారంభించారు. కాంతా కనకాలు బంధ కారణాలు అన్నారు. దాంపత్య ధర్మంలో ఇద్దరికీ ప్రమేయం ఉన్నప్పుడు ఒక్కరే బంధకారణం ఎలా అవుతారు?

స్త్రీ, పురుష సంబంధమనే దాన్ని పవిత్రంగా చూసుకోవాలి అని చెప్పే బదులు ఇలా చెపుతూ వచ్చారు. ఈ చెప్పడం సృష్టికి విరుద్ధం కదా! అది ఒక పాపకార్యమై కూర్చుంది. దాంపత్య ధర్మాన్ని చిన్నచూపు చూడటం ఒక తప్పు. స్త్రీ జాతిని చిన్న చూపు చూడటం రెండవ తప్పు. సైన్స్‌లో ఒక సూత్రం చెపుతారు. మనం చేసిన ఏ చర్యకైనా ప్రతిచర్య ఒకటి ఉండి తీరుతుందని (For every action there is an equal and opposite reaction) ఈ సృష్టి సూత్రం మనం చెప్పుకుంటున్న అంశానికే వర్తించింది. ఈ జరుగుతూ వచ్చిన దారుణానికి ప్రతిచర్యగా ఇప్పుడు మీరు చెప్పిన సంస్థల లాంటివి రూపు కట్టుకోవడం జరుగుతున్నది. "స్త్రీలే ప్రధానము. తత్త్వబోధకు వారే ఎక్కువ అర్హులు. మా సంస్థలలో మొదటి పీట వారికే. వారి ప్రకారమే మిగిలినవన్నీ జరుగుతాయి. దాంపత్య ధర్మం విషయంలో కూడా స్త్రీలు పురుషులను ఎక్కడ ఉంచాలో అక్కడ ఉంచుతారు. తమ పవిత్రతను నిలబెట్టుకుంటారు. పురుషుల్ని దరి చేరనీయకుండా బ్రహ్మచారిణిలుగా ఉండిపోతారు. ఏ విధంగా చూసినా, అన్ని కోణాలలోనూ స్త్రీమూర్తిదే పైచేయి. పురుషుడు ఆమె అడుగుజాడల్లో నడువ వలసినవాడు", ఇలాంటి నమ్మకాలు, సూత్రాలతో ఈ పుట్టుకువచ్చిన సంస్థలు పనిచేయడం మనం చూస్తున్నాం. కొన్ని శతాబ్దాలు పురుషుడు స్త్రీని నిందిస్తూ దూరంగా ఉంచే ప్రయత్నం చేశాడు. దానికి ప్రతిచర్యగా ఇప్పుడు కొన్ని శతాబ్దాలనుండి స్త్రీ ఇలాంటి సంస్థల ద్వారా పురుషుణ్ణి నిందించి దూరంగా నిలబెడు తున్నది. ఇదీ సారాంశం. 'నిందకు ఫలం నిందేకదా!' ఇప్పుడు అదే అనుభవానికి వస్తున్నది.

'మరిప్పుడు దీనికి పరిష్కారమేమిటంటారు?" అడిగాడతను నిట్టూర్పులు విడుస్తూ.

స్వామి ఇలా అన్నారు : మనం మరచిపోయిన సనాతన ధర్మాన్ని మరల గుర్తు చేసుకోవడమే దీనికి పరిష్కార మార్గం. మన ఋషుల

సంప్రదాయాన్ని మరల అనుసరించటమే ఇప్పటి మన కర్తవ్యం. ప్రజలకు తిరిగి సనాతన ధర్మాన్ని తెలియజెప్పాలి. చతురాశ్రమ విధానంలోని పవిత్రతను, పరిపూర్ణతను వారికి విడమరచి చెప్పాలి. రామాయణ, భారత, భాగవతాది పవిత్ర గ్రంథాలను మళ్ళీ ప్రజలకు చేరువ చేయాలి. 'వాటిని ఆదర్శంగా గొని నిండైన గృహస్థులుగా జీవించి, తరిద్దాము ! అని ప్రజలకు నొక్కి చెప్పాలి. మళ్ళీ మన తాత్త్వికమైన దృక్పథాన్ని మనం పట్టా లెక్కించుకోగలగాలి. అప్పుడు ఇటు స్త్రీ నిందా ఉండదు. అటు పురుష నిందా ఉండదు. విడివిడిగా సంస్థలూ, వాటి అవసరాలు ఉండవు.

'మీరు చక్కగా చెప్పారు. మూలానికి తీసుకుని వెళ్లారు. అందు మూలాన 'ఇప్పుడు ఏం జరుగుతూ ఉన్నది?' అనేది వెంటనే అర్థమైంది. అలాగే 'ఇప్పుడు చేయవలసింది ఏమిటి ? అన్నది కూడా స్పష్టమయింది' - అంటూ పారవశ్యంతో చేతులు జోడించాడతను.



# దేవుని బదులు

చిన్నతనంలోనే కుటుంబ బాధ్యతలు మీద పడ్డాయి. తమ్ముళ్ళని పెంచి పెద్దచేసి స్థిరపరచాను. చెల్లెళ్ళను పెంచి, పెళ్ళిళ్ళు చేశాను. బంధు మిత్రులచేత బొనసుపించుకున్నాను. ఇక అక్కడనుండి నాకు తెలిసి సమాజంలో ఎక్కడ ఏ మంచి పని జరుగుతున్నా యథాశక్తిగా పాలు పంచుకున్నాను. ఇంటికి ఎవరు వచ్చినా ఈ రోజుకీ, భోజనం చేయకుండా వెళ్ళనివ్వను. విస్తళ్ళు కట్టలు కట్టలు అలా కదలిపోతూ ఉంటాయి. భోజనాల పంక్తులు అలా నడచిపోతూ ఉంటాయి. నాకు తెలిసి నేను మంచి చేశానే తప్ప చెడు చేయలేదు. అలాంటి నాకు దేవుడు ఈ స్థితిని ఎందుకు తీసుకు వచ్చాడు. దేవుడు కనిపిస్తే ఇదే అడుగుదామనిపించింది. ఇప్పుడు ఆ దేవుడికి బదులుగా మిమ్మల్ని అడుగుతున్నాను. ఇప్పుడు నాకీ స్థితి ఎందుకు వచ్చింది ? ఇప్పుడు నాకా దేవుడిమీదే అసహ్యం వేస్తోంది. నాకీ దేవుడు ఇచ్చిన బహుమానం ఇది! ఇంత చక్కని బహుమాన మిచ్చే వాడేం దేవుడు ?

ఇప్పుడు నాకు కాన్సర్ వచ్చిందంటున్నారు. ఇంకా కొద్ది రోజులే బ్రతకడానికి అవకాశముంది అంటున్నారు. కాని, నాకు బ్రతకాలని ఉంది. దేశం నలుమూలలా చూడాలని ఉంది. ఊటీలాంటి ప్రదేశాలలో అలా హాయిననుభవిస్తూ, కొన్నాళ్ళపాటు అక్కడే ఉండిపోవాలని ఉంది. భార్యా బిడ్డల్ని ఇంకా కొన్నాళ్ళు చూసుకోవాలని ఉంది. వయస్సురీత్యా చూసినా, ఇప్పుడు నాకేమంత వయస్సు వచ్చిందని దేవుడిలా చేశాడు ? అసలు నాకు పట్టుకుంది, అసలు నేను చేసిన దోషమేమిటని ? నాకేం కనబడ్డం లేదు. మీరు చెప్పగలిగితే చెప్పండి. నేనేం దోషం చేశాను ?

చెప్పబడుతున్న దంతా ప్రశాంతంగా వింటున్న స్వామి అతడిని కూడా ప్రశాంతపడనిచ్చి, చుట్టూ కూర్చున్న వారందరివైపు ఒక్కసారిగా

చూశారు. అందరూ ఇప్పుడేం జరగబోతుందా? అని చూస్తున్నారు. ఇలా ఆర్తితో ఆక్రందిస్తున్న ఇతనికి వచ్చే జవాబు ఎలా ఉంటుందా? అని ఆతృతతో చూస్తున్నారు. ఆ ఆర్తుని ప్రక్కన అతని భార్య ఉంది. కొంచెం ప్రక్కగా అతని స్నేహితులే మరో ఇద్దరున్నారు. ఇక ఇటు ప్రక్కన కార్యకర్తల సముదాయం. అందరికీ ఉత్కంఠను కలిగిస్తున్నదా సన్నివేశం.

స్వామి ఇలా అన్నారు: పరిశుభ్రత అంటే మీకు ఇష్టమేనా?

'చచ్చేంత ఇష్టం. పరిశుభ్రత అంటే పడిచస్తాను నేను. దీనికి తగినట్లుగా మా కుటుంబ సభ్యులు కూడా నడుచుకుంటారు. పరిశుభ్రతకు లోటు రానివ్వరు. అది....మరీ.... నేనంటే భయంవల్ల కానివ్వండి, భక్తి వల్ల కానివ్వండి, లేదా నా ప్రోత్సాహం వల్ల వాళ్ళ కలిగిన అలవాటు వల్ల కానివ్వండీ! ఇల్లు మొత్తం అలా ఉండాల్సిందే'.

'సరే బాగుంది. పరిశుభ్రంగా లేని ప్రదేశాలకు మీరెప్పుడైనా వెళ్ళవలసి వచ్చిందనుకోండి. వెళ్ళి అక్కడ కొన్నాళ్ళు ఉండవలసి వచ్చిందనుకోండి. మీకేమనిపిస్తుంది? మీరేం చేస్తారు?' అని అడిగారు స్వామి.

నేనసలు అలాంటి చోట్లకు వెళ్ళను. వెళ్ళినా ఎక్కువసేపు ఉండను. ఒకవేళ ఉండవలసి వచ్చినా, ముళ్ళమీద పడిన గుడ్డలాగా ఉండి, పని పూర్తి చేసేసుకుని వచ్చేస్తాను. ఇంకొకసారి అలాంటి చోటికి వెళ్ళను. ఒకవేళ వెళ్ళ వలసివస్తే నా బదులు ఇంకెవరినయినా పంపి, నేను తప్పుకుంటాను.

'ఒకవేళ అలాంటివాళ్ళు మీ ఇంటికే వస్తే?'— అడిగారు స్వామి.

'రారు. అందరికీ తెలుసు మా ఇంటి పరిస్థితి. ఒకవేళ వచ్చినా, పద్ధతిగా లేకపోతే వారిని సహించేదిలేదు. పద్ధతి నేర్చుకోవడమో, ప్రక్కకు తప్పుకోవడమో అది వాళ్ళు నిర్ణయించుకోవాలి.

జీవితంలో పద్ధతి లేకపోతేనే సహించనివాడిని, జీవితంలో లేక పోతే సహిస్తానా? అలాంటివాళ్ళను చాలా దూరంగా ఉంచుతాను. దరిచేర నివ్వను. వాళ్ళ ప్రసక్తి నా దగ్గర ఎవరన్నా తెచ్చినా సహించను. ఆ తెచ్చిన వాళ్ళను దూరంగా ఉంచేస్తాను. పద్ధతి ఉన్నవాళ్లు అంటే ఎంత ఇష్టపడతానో, పద్ధతి లేని వాళ్లు అంటే నాకంత అసహ్యం. వాళ్లు నా మనస్సులో మెదలడానికి కూడా అంగీకరించను'.

'పద్ధతి ఉన్నవాళ్ళను ప్రేమించడం బాగానే ఉంది. పద్ధతి లేనివాళ్ళను అసహ్యించుకోవటం ఎందుకు?'.

'వాళ్ళకు పద్ధతి లేదుగనుక!'

'లేకపోతే అసహ్యించుకోవాలా?'

'అసహ్యించుకోకుండా నేనుండలేను'.

'వారిలో మార్పు తెచ్చేటందుకు ప్రయత్నించవచ్చుగా?

'అది నా పద్ధతి కాదు'.

'మరి అసహ్యించుకోవడం పద్ధతి అంటారా!'

'అది నా పద్ధతి. నేనంతే!'

'మీచేత దూరంగా ఉంచబడిన వారి సంఖ్య పెరిగిందనుకోండి'.

'అనుకోవడమెందుకూ! పెరిగింది. ఈ కాలంలో పద్ధతి ఉన్నవాళ్లు ఎంతమంది ఉంటారు గనుక?'

'మరి అలాంటప్పుడు మీ మనస్సుకు అసహ్యించుకునే పని పెరుగు తోందేమో!'

'అందులో ఆశ్చర్యమేముంది?'

అయితే మీ ఇప్పటి స్థితికి కూడా ఆశ్చర్యపడవలసిన అవసరం దు. మీరు చాల బాధలో ఉన్నారు. నిజానికి మీకిలా చెప్పకూడదు. కాని,

మీరు దేవుణ్ణే తప్పు పడుతున్నారు కనుక ఆయన ప్రతినిధిగా మీతో ఇంత సేపటినుండి మాట్లాడుతున్నాను. పద్ధతిలేని వాళ్ళందరినీ అసహ్యించుకోవడంలోపడి, మీ మనస్సు ఆ ఏహ్యభావానికే నిలయమైంది. దానికితోడు నాలాగా పద్ధతిలో ఉన్నవాళ్లు ఇంకెంతమంది ఉంటారు? అనే అహంకారం కూడా మీలో బాగా పెరిగింది. ఆ అహంకారం, ఏహ్యభావాన్ని మరింతగా రెచ్చకొట్టింది. మానసికమైన ఆ దారుణ లక్షణమే క్రమంగా ఇప్పటి మీ వ్యాధిగా రూపుధరించింది. ఆలోచించుకోండి. మంచిపనులు చేయడంవేరు, మంచిగా ఉండడంవేరు, మీరు మంచిపనులు చేశారు. కాని, మానసికంగా మంచిగా ఉండలేకపోయారు. పద్ధతి లేని వాళ్ళను చూసి, జాలిపడవలసిందిపోయి, వారిని చేరదీసి బాగుచేయవలసిందిపోయి, మీరు వారిని ద్వేషించారు. చెప్పండీ! ఈ ద్వేషాన్ని దైవం మెచ్చుకోవాలంటారా!

'అద్వేష్టా సర్వ భూతానాం మైత్రః కరుణ ఏవచ! అన్నది భగవానుని వాక్యము. జీవరాసులలో వేటినీ ఎన్నడూ ద్వేషించవద్దు. నీకు తగినట్లుగా ఉన్నవారితో మైత్రిచేయి. నీకుతగినట్లుగా ఉండలేక పోతున్నవారిని చూసి జాలిపడు. కరుణతో వారికి చేయూతనందించు.' ఇది భగవానుని సందేశం.

సృష్టిలో ఉన్న జీవరాసులలో దైవమే తప్పులు పట్టడం మొదలు పెట్టాడనుకోండి. ఇంకెవరు మిగులుతారు, చెప్పండీ! కనుకనే ఆతడు తప్పులు పట్టడు. అందరినీ ప్రేమిస్తాడు. అందరికీ బాగుపడే అవకాశమిస్తాడు.

చూడండీ! మంచివారిపైనా, చెడ్డవారిపైనా సూర్యుని వెలుగు, చంద్రుని వెన్నెలా ఒకేలా పడేలా చేస్తున్నాడా దైవం. ఆ వెలుగు వెన్నెలలు ఆయన ప్రేమ ధరించిన వెల్లువలు. ఆయనే అలా వీరు, వారని చూడక, ఎక్కువ తక్కువలను ఎంచక, అందరినీ ప్రేమలో ముంచెత్తి

పేస్తుంటే, మనం తద్భిన్నంగా ప్రవర్తించవచ్చునా చెప్పండి! 'భక్తి' అంటే ఏమిటి? ప్రేమ! దేవుణ్ణి ప్రేమించడం! అంటే ఏమిటి! దేవుడిలాగా ప్రవర్తించడం, అలా ప్రవర్తించేటందుకు నిరంతరం ప్రయత్నం చేస్తూ ఉండటం! మరి ఇలాంటి ప్రయత్నం ఎంతవరకూ మీలో సాగిందీ అన్నది మీరు ఆలోచించుకోవలసిన మాట.

అతను కొంత అసహనంగా కనబడ్డాడు. ఈ చెప్పబడుతున్న మాటలు అతనికి కొంచెం బాగానే ఇబ్బంది కలిగిస్తున్నట్లున్నాయి. అతని భార్య కన్నులలో మాత్రం నీళ్ళు తిరగటం కనిపించింది. ప్రక్కన కూర్చుని ఉన్న అతని మిత్రులు ఈ లభిస్తున్న వివరణకు ఆశ్చర్యానంద భరితులవుతున్నారు. సోదర బృందంవారు అలా ఏకాగ్ర చిత్తంతో సందేశాన్ని అందుకుంటున్నారు.

స్వామి ఇంకా ఇలా అన్నారు! చూడండి! ఈ నా మాటలు మీకు కొంచెం ఇబ్బందిని కలిగిస్తున్నట్లున్నాయి. ఎందువల్లనంటే ఇవి మీ నమ్మకాల మూలాలను కదిలించి వేస్తున్నాయి కనుక! మీ జీవితం మొత్తాన్ని పరీక్షకు నిలబెడుతున్నాయి కనుక! ఆత్మ పరిశీలన చేసుకోవలసిన స్థితి మీకు ఎదురైంది కనుక! చూడండి! ఇది మీకు ఇబ్బందిని కలిగిస్తున్నా: దైవం మీ యెడల ప్రేమతో మీ కందిస్తున్న సందేశం! ఇన్ని నాళ్ళు మీరు దేవుడంటే విశ్వాసంగా ఉంటూ వచ్చారు ఆయన పేరిట చాల మంచి పనులు చేశారు. ఇప్పుడు ఈ తీవ్రమైన అనారోగ్యం ఏర్పడటంతో మీకా దైవంపైనే విశ్వాసం సడిలే స్థితివచ్చింది. అదే జరిగితే మీ జీవితం నరకమౌతుంది. అలా జరగటం దైవానికి ఇష్టం లేదు. ఆయన ప్రేమ మూర్తి! కనుక ఇలా కలుగజేసుకున్నాడు. సర్దుకోవలసినది ఏమిటో తెలియ చెబుతున్నాడు. శేష జీవితాన్ని, ఆయన చేస్తున్న సూచనను అమలు పరచుకోవడానికి వినియోగించండి. ఈ దేహం, ఈ జీవితం ఆయనే ఇచ్చినవి.

ఇవి ఇలా ఎన్నాళ్ళు నడుస్తాయన్నది ఆయనకే వదిలేయండి. దేహాలను ఎందుకు, ఎలా వినియోగించుకోవాలో మనకన్నా బాగా తెలిసిన వాడాయన. ఏమంటారు? మీరేమీ అనవద్దు. మీ వైపుకు మీరు చూడండి. దైవం చెప్పి నట్లు చేయండి. ఇక సెలవు".

సన్నివేశంలోని ఎవ్వరూ ఇక మాట్లాడగలిగిన స్థితిలో లేరు. వెలువడిన సందేశం అతనితోపాటుగా అందరి మనస్సులకు కూడా అంతర్ముఖత్వాన్ని అనుగ్రహించినట్లుగా ఉంది.

## బంగారు సంకెల

'స్వామీ, నా మనస్సంతా కల్లోలితంగా ఉంది. ఒక పెను తుఫానులో చిక్కుకుపోయి ఉన్నాను నేను. దిక్కుతోచని స్థితి ఇది. అన్నం సయించదు. నిద్ర పట్టదు. పని నడవదు. బ్రతుకు సాగదు. నేనేం చేయను?' — అంటూ స్వామి పాదాలను చుట్టుకుపోతున్నా డొక యువకుడు.

స్వామి అతడిని మెల్లగా లేవదీసి కూర్చోబెట్టి, వెన్ను నిమురుతూ 'నీ బాధ ఏమిటో చెప్పు ముందు. ఏం చేయాలో నేను చెపుతాను' — అన్నారు.

ఆ యువకుడి కనులవెంట బొటబొటా కన్నీరు శరీరమంతా ఒక విధమైన కంపం. ఉద్వేగంతో వణుకుతున్నాడతను. తమాయించుకోలేక పోతున్నాడు.

స్వామి అలా అతని వెన్ను నిమురుతూనే ఉన్నారు.

కొంతసేపటికి స్వామి స్పర్శతో తనని తాను కూడదీసుకుని ఇలా చెప్పడం ప్రారంభించాడు : "మాస్టారూ! క్లుప్తంగా నా కథను చెపుతా

నండీ! ఈ మధ్య నేను మీకు కనబడలేదుకదా! ఉద్యోగరీత్యా చాల దూర ప్రాంతాల్లో ఉండిపోయాను. ఇటీవలే ఇక్కడికి వచ్చాను. రాకుండా ఉండి పోయినా బాగుండేదేమో! అని ఇప్పుడనిపిస్తోంది. వచ్చినప్పటి నుండే మాష్టారూ! నాకీ దుస్థితి సంప్రాప్తించింది".

'అసలేం జరిగిందయ్యా?' అడిగారు స్వామి.

కన్నీళ్ళను తుడుచుకుంటూ, పెదవుల వణుకును అదుపు చేసుకుంటూ అతను ఇంకా ఇలా చెప్పాడు. 'ఏం లేదు మాష్టారూ! అసలేం జరిగిందంటే ఉద్యోగానికి వెళ్ళబోయేముందు ఇక్కడొక రెండు సంవత్సరాలు ఉద్యోగ ప్రయత్నం చేసుకుంటూ ఖాళీగా ఉండిపోయాను నేను. ఖాళీగా ఉన్న ఆ సమయంలో యూనివర్సిటీలో ఒక ప్రొఫెసర్ గారికి చేరువయ్యాను. ఇంతింతని చెప్పలేనంతగా చేరువయ్యాను. వారి బిడ్డలలో ఒకడినై, ఇంకా చెప్పాలంటే అంతకంటే ఎక్కువైౖ తిరిగాను. ఆయన మాటే నా బాటగా సాగాను. వారి ఇల్లే నా దినచర్యకు కేంద్రమయింది.

ఆ కథ అలా నడుస్తూ ఉండగా, ఆయన నాకొక మహిమాన్వితుణ్ణి గురించి చెప్పడం ప్రారంభించారు. ఆ మహిమాన్వితుడు సాక్షాత్తు అవతార మూర్తేనని నా హృదయంలో ముద్రవేశారు. ప్రక్కన కూర్చోబెట్టుకొని ఆ మహిమాన్వితుని పూజించటం ఎలాగో నేర్పారు. ఆ మహిమాన్వితుని స్మరణలోనే దినచర్యను నడుపుకోమని ఆదేశించారు.

'నేను ఎవరంటే ఇష్టపడుతున్నానో, ఆయనకు ఇష్టదైవం కదా ఈ మహిమాన్వితుడు' అని నేనూ ఇష్టపడసాగాను. ఆయన చెప్పినట్లుగా ఆ మహిమాన్వితుని పూజలో, స్మరణలో జీవితాన్ని నడపసాగాను.

ఇంతలో నాకు ఉద్యోగము వచ్చింది. చాల దూర ప్రాంతంలో వచ్చింది. వెళ్ళాలా! వద్దా? అన్న మీమాంస వచ్చింది. నేను ఆలోచించడ

మెందుకు? అని నేను ఇష్టపడే ఆ ప్రొఫెసర్‌గారినే అడిగాను. ఆయన 'ఇదంతా ఆ మహిమాన్వితుని అనుగ్రహమే' — నన్నారు. మహిమాన్వితుని ఛాయాచిత్రాన్ని చేతికిస్తూ, ఇదే ఇక నిన్ను నడిపిస్తుంది' అన్నారు. నేను వారికి నమస్కరించి, వెళ్ళి ఉద్యోగంలో చేరాను. వారిచ్చిన ఆ చిత్రాన్ని పెట్టుకొని, వారి ఆదేశం మేరకు ఆ స్మరణలోనే దినచర్యను గడపసాగాను.

నాకూ, ప్రొఫెసర్‌గారికి మధ్య ఉత్తరాలు నడుస్తూ ఉండేవి. క్రమంగా నేను ఆ ఉత్తరాలలో ఒక మార్పును గమనించాను. మొదట్లో ఆయన మహిమాన్వితుని గురించి ఎక్కువగా వ్రాస్తూ చివరగా యోగ క్షేమాల గూర్చి కొద్దిగా వ్రాసేవారు. కాని, కాలం గడుస్తున్నకొద్దీ, ఉత్తరాలలో మహిమాన్వితునికి చోటు తగ్గుతూ వచ్చింది. క్రమంగా ఆ ప్రసక్తే రావడం మానేసింది. నేనువ్రాసే ఉత్తరాలలో ఆ ప్రస్తావన ఎంతతెచ్చినా, వారినుండి నాకు వచ్చే ఉత్తరాలలో ఆ ప్రస్తావన ఉండేదికాదు. "ఏమిటా ఇది" అనుకున్నాను. అంతకంటె ఇంకా ఏమీ నేను అనుమానించలేదు. ఎందుకని అంటే నేను వారిని అనుమానించలేను గనుక.

ఇంకా కొన్నాళ్ళకి ఉత్తరాలు రావటంకూడా తగ్గింది. ఎప్పుడో ఒకసారి, అరసారి మాత్రమే ఆయననుండి ఉత్తరాలు వస్తూ ఉండేవి. అప్పుడూ నేను అనుమానించలేదు. బహుశ పనుల వత్తిడిలో ఉండి వ్రాయలేకపోతున్నారు అనుకున్నాను. ఆయన్ని ఇబ్బంది పెట్టడం ఎందుకని నేను వ్రాయడం కొంత తగ్గించాను. ఇలా మా మధ్య ఒక విధమైన మౌనం కొంతకాలం రాజ్యమేలింది. ఆయన నా కందించిన ఆ మహిమాన్వితుని స్మరణలోనే ఈ మౌనాన్ని తట్టుకొనే ప్రయత్నం చేశాను. ఆ స్మరణను మరింత అధికం చేశాను. ఆ స్మరణ లేనిదే ఉండని స్థితికి వచ్చాను. అది మరి, ఆయన నా జీవితానికి కానుకగా ఇచ్చింది కదా ఆ స్మరణ! ఆయన మీద నాకున్న ప్రేమనంతా, ఆయన చూపించిన ఆ మహి

మాన్వితుడి పైకే మరలించాను. దేశంకాని దేశంలో అలా ఆ స్మరణలోనే బ్రతుకు గడిపాను.

ఇక్కడికు రాగానే వెంటనే ఆయన దగ్గరకు వెళ్ళాను. ఆశ్చర్యం వేసింది. ఆ ఇల్లంతా ఇప్పుడు క్రొత్తగా ఉంది. మహిమాన్వితుడి ఫొటో లన్నీ అక్కడ ఇప్పుడు మాయమైపోయాయి. ఆ స్మరణ లేదు. ఆ ప్రస్తావన లేదు, అసలా ఊసే అక్కడ లేదు. కుటుంబ సభ్యులంతా కూడా క్రొత్తగా కనిపించారు నాకు. వారు నన్ను మామూలుగానే పలకరించారు గాని, నాకేమిటో అంతా క్రొత్తగా ఉన్నట్లనిపించింది. కారణం అది వరకు సంవత్సరాల తరబడి అక్కడే మరొక వాతావరణంలో తిరిగిన వాడిని కనుక! 'ఏమిటీ పరిస్థితి?' అని ప్రస్తావించలేకపోయాను. ఎందువల్ల నంటే ఆయన చూపులు అలా ఉన్నాయి. 'పొరపాటున ఆ ప్రస్తావన ఏమైనా తెస్తావేమో. ఇక్కడ అలాంటివాటికి అవకాశం లేదు' అన్నట్లుగా.

నాకు బుర్ర తిరిగిపోయింది. నేను ఎక్కడున్నానో నాకు తెలియని పరిస్థితి ఏర్పడింది. తట్టుకునే పరిస్థితిలో లేను, కాని ఈ విషయంలో నన్ను పట్టుకొని ఓదార్చేటందుకు మాత్రం ఎవ్వరూ సిద్ధంగా లేరని బోధపడింది. ఏమీ తోచక అక్కడ నుండి వెళ్ళాలని లేకపోయినా వెళ్ళిపోయాను.

ఆ తరువాత కొన్నాళ్ళకి వారికీ, నాకూ ఆత్మీయులైనవారి ద్వారా జరిగిందేమిటి? అన్నది తెలుసుకోగలిగాను. అదేమిటీ? అంటే, ఈ ప్రొఫెసర్‌గారు తన బిడ్డలకు ఆ మహిమాన్వితుని సాన్నిధ్యంలో, సారథ్యంలో నిర్వహించ బడుతున్న కాలేజీలలో చేర్పించారట, పనిపెట్టా తీసుకు వెళ్ళిమరీ! ఆ పిల్లలు చాలా చురుకైనవారు. తెలివైనవారు. కేవలం విశ్వాసంతో సరి పెట్టుకునేవాళ్ళు కాదు వాళ్ళు. ఆ కారణాన, అక్కడ చదువుకుంటూనే ఆ మహిమాన్వితుని చర్యలను సూక్ష్మంగా పరిశీలించడం మొదలు పెట్టారు. ఈ మహిమలను ఆయన ఎలా చేస్తున్నాడు? అని వాళ్ళు తీవ్రంగా పరిశీలించ

సాగారు. పరిశీలిస్తే వాళ్ళకు తేలింది ఏమిటి? అంతే, ఏ వస్తువులనూ ఆయన సృష్టించడం లేదు. గదులలో ప్రత్యేకించి భద్రంగా ఏర్పాటు చేయ బడినవాటిని, తన చేతులలోనికి రప్పిస్తున్నాడంతే. ఆ వస్తువులన్నీ వివిధ మార్గాలద్వారా సేకరించిగాని, లేదా ప్రత్యేకించి కొనిపించిగాని, అక్కడ చేర్చుతున్నవే! ఈ అంశం తెలియడంతో ఆ కుర్రవాళ్ళ విశ్వాసం యొక్క మూలాలు కదలిపోయాయి. ఆ పైన వారు మరింత దగ్గరగా ఆయనను పరిశోధించి, తాము గ్రహించినది సత్యమేనని మరల మరల రూఢి చేసుకున్నారు. రూఢి అవుతున్నకొద్దీ, వారికి ఆయనంటే ఏహ్య భావం కలగడం మొదలుపెట్టింది. ఇక అక్కడ ఉండలేకపోయారు. ఇంటికి వచ్చి తల్లిదండ్రులను కూర్చోబెట్టి, తాము పసిగట్టిందంతా చెప్పు కొచ్చారు. తల్లిదండ్రులు బిడ్డల్ని నమ్మారు. ఇక అంతే! మహిమాన్వితు డికి ఆ ఇంటిలో చోటు లేకుండా పోయింది. ఆ స్మరణ అక్కడనుండి నిష్క్రమించింది. వారిప్పుడు ఆయన నెవరైనా తలిస్తేవాలు మండి పడు తున్నారు. ఇలా వాళ్ళు మహిమాన్వితునితో చెల్లు చీటీలు పుచ్చుకున్న తరువాత నేను ఇక్కడికి రావడం, ఆ ఇంటికి వెళ్ళడం జరిగింది. గుండె పిండేసినట్లయింది నాకు. ఏం చేయాలో ఏమీ పాలుపోని స్థితిలో పడి పోయాను.

మాష్టారూ! ఇప్పుడు చెప్పండి, నేనేం చేయాలో. ఇప్పుడు చెప్పండి, నేనా స్మరణను కొనసాగించాలా? మానాలా? సాగుతున్న స్మరణ కాబట్టి కొనసాగించాలనిపిస్తుంది. దాని నెవరు నాకు అందించారో, వారే మానే శారు కాబట్టి, నేనూ మానేస్తే ఎలా ఉంటుంది? అనిపిస్తుంది. అలవాటుపడి పోయిన నాకు ఆ మహిమాన్వితుని రూపం గుర్తుకొస్తూ ఉంటుంది. ఆ వెంటనే వీళ్ళిప్పుడున్న పరిస్థితీ గుర్తు కొస్తుంది. ఇప్పుడు నేనేం చేయాలి? వాళ్ళనీ ఈ స్మరణ చేయండి అని చెబుదాము అంటే మా కంటే నీ కెక్కువ తెలుసునా? అని అడగరూ! పోనీ నేను కూడా వారితోపాటు

మానేద్దామంటే ఇన్నినాళ్ళ అభ్యాసం నన్ను విడిచిపెట్టడం లేదే! ఈ సంఘర్షణలో నేను నలిగిపోతున్నాను. నా మనస్సు అలసి పోతున్నది. ఏదో చూస్తున్నవాళ్ళకి తిరుగుతున్నట్లు కనిపిస్తున్నాను తప్ప, ఈ సంక్షోభానికి నేనే తట్టుకోలేక పోతున్నాను. మాష్టరుగారూ! ఏం చేయాలో మీరే చెప్పాలి ఇప్పుడు. నన్ను ఒడ్డుకు చేర్చవలసినవారు మీరే! అంటూ అతడు స్వామి పాదాలపై వాలిపోయాడు.

అతణ్ణి లేవనెత్తి ప్రక్కన కూర్చోబెట్టుకుని, వెన్ను నిమురుతూ, కన్నులలోనికి చూస్తూ ఇలా అన్నారు స్వామి: 'ఇంతకూ ఇబ్బంది ఎక్కడ వచ్చింది? అంటే మహిమల్ని విశ్వాసానికి పునాదులుగా, తీసుకోవటం వల్ల వచ్చింది. వాళ్ళి మహిమలను చూస్తూ ఏవేవో ఊహించుకున్నారు. ఏవేవో కథలు చెప్పుకున్నారు. ఏవేవో ప్రచారాలు చేసుకున్నారు. తీరా దగ్గరకు వెళ్ళి చూసేటప్పటికి ఆ మహిమలు వాళ్ళనుకున్న పంథాలో జరగటం లేదు. దానితో వాళ్ళ నమ్మకం పునాదులు కదిలిపోయాయి. అంతే! వాళ్ళు ఆయన్ని ద్వేషించసాగారు.

నిజమైన మహిమలు జరుగుతాయి తప్ప, చేయబడవు. తమనుండి ఆ మహిమలు జరుగుతున్నట్లుగా ఆ మహాత్ములకు కూడా ఎరుకలో ఉండకపోవచ్చును. అవి లోకహితార్థమై వారినుండి జరుగుతూ ఉంటాయి. ఆ మహాత్ములు వాటిని పెద్దగా పట్టించుకోరు కూడా. ఎందుకనంటే వారి దృష్టి లోకహితం మీదనే ఉంటుంది కనుక! ఇక మహిమలు చేయబడుతున్నాయి అంటేనే వాటికి ఆధారం ఎక్కడో అక్కడ ఉన్నదీ అని అర్థం. జరిగే మహిమలకు దైవం ఆధారమైతే, చేయబడే మహిమలకు ఈ చేసే పెద్దవాడు ఏదో ఒక విధమైన పెద్ద ఏర్పాటు చేసుకునే ఉంటాడు అని అర్థం.

ఇంకా కొంచెం పైకి వెళ్ళిచూస్తే అసలు ఈ సృష్టిలో మహిమ

అనేదే లేదు. 'మహిమ' అని ఏదైనా చెప్పవలసింది ఉంది అని అంటే అది ఈ సృష్టియొక్క వ్యక్తీకరణమే. ఈ సృష్టి వ్యక్తమవటమే ఒక మహిమ. 'ఏతావానస్య మహిమా' అని వర్ణిస్తున్నది పురుషసూక్తం. చూస్తే మొత్తాన్ని ఈ దైవం యొక్క మహిమగా చూడు. లేదా! అసలు నీవు ఆశ్చర్యపడేది ఏదీ ఈ సృష్టిలో లేదు! అన్నది పెద్దలమాట. మన ఉద్దేశంలో మహిమ అంటే ఏమిటి? మనకింకా అంతుపట్టని దాన్ని మహిమ అంటున్నాం. మనమింత వరకు అలవాటుపడని దానిని చూస్తే ఆశ్చర్య పడుతున్నాం. అదేదో అంతుపడితే, దానిని చూడటానికి మనం అలవాటు పడితే, అదీ ఈ సృష్టిలోని ఒకానొక లక్షణమని మనకు తెలుస్తుంది. ఇప్పుడు చెప్పు. మనం వాడుతున్న 'మహిమ' అనే మాటకు అర్థం ఏమిటి? 'మనకింకా తెలియనిది' అని తెలియనిదానిని చూచినప్పుడు తెలుసుకునే ప్రయత్నం చేయడం జిజ్ఞాసువుల లక్షణం. వెర్రిగా గంతులువేస్తూ కేరింతలు కొట్టడం ఆవేశపరుల లక్షణం. దివ్యజ్ఞాన సమాజ స్థాపకురాలైన బ్లావెట్స్కీ అంటుంది కదా ఒకచోట- 'అసలు ఆశ్చర్యపడ వలసిందిగాని, మహిమగా పరిగణించవలసింది గాని ఈ సృష్టిలో ఏదీలేదు. అలా ఏదైనా కనబడుతూ ఉన్నదీ అంటే దానిని మనం అర్థం చేసుకోవలసి ఉన్నది అని. అలా చెప్పటమే కాదు. అలా చెబుతూనే. మనం అనుకుంటున్న మహిమ లెన్నింటినో ఆవిడ స్వయంగా చేసి చూపించింది కూడా! చేసి చూపిస్తూ, అవి ఎలా నిర్వహింపబడతాయో శాస్త్రీయంగా వివరణ చేసిందామె.

అనాదిగా మనవాళ్ళు వ్యక్తులద్వారా వ్యక్తమయ్యే దివ్యమైన గుణ గణాలను బట్టి ఆయా వ్యక్తులను దివ్యాంశ సంభూతులుగా దర్శిస్తూ వస్తున్నారు. గుణగణాలనుబట్టి గాక, కేవలం మహిమలూ, మాయలు పట్టుకొని వాటినే దివ్యత్వంగా పరిగణించి పరుగెత్తటం అనేది ఈ కలియుగ లక్షణం.

దివ్యత్వం వ్యక్తమయ్యేది ప్రవర్తనలో. ఒక వ్యక్తిలో దివ్యాంశ వెలుగుతున్నదా? లేదా? అని చెప్పవలసింది అతని ప్రవర్తనను బట్టి, జీవన విధానాన్ని బట్టి. అంతేగాని మహిమలు, ఇతర విషయాలను బట్టి కాదు. ప్రవర్తన జీవన విధానాలపై నుండి ఇతర విచిత్ర అంశాలపైకి దృష్టి మళ్ళడం దిగజారిన మన జీవనస్థాయికి నిదర్శనం. పవిత్రమైన వారి ప్రవర్తనను గమనించుకుంటూ, మన ప్రవర్తనను మంచిగా మలచుకోవ డానికి ప్రయత్నించాలి గాని, మహిమలు మొదలైన వాటిని మాత్రమే పట్టు కొని అదే దివ్యత్వమని ప్రేలాడితే ఇదిగో ఇలాగే జరుగుతుంది.

ఇక నీవు చెప్పిన మహిమాన్వితుడి విషయానికి వస్తే, మీవాళ్ళు క్రొత్తగా కనిపెట్టి, కంగారు పడిపోవలసింది ఏమీలేదు. కొంచెం ఆవే శాన్ని తగ్గించుకొని, ముందుకు చూసి ఉంటే వారికి ఈ అంశం ఎప్పుడో తెలిసి ఉండేది. రకరకాల కంపెనీల వస్తువులు ఆయన గాలిలోనుండి తీసి ఇస్తున్నాడు. ఆ వస్తువులపైన ఆ కంపెనీల పేరు, వివరాలూ, ముద్రలూ అన్నీ యథాతథంగా ఉంటున్నాయి. అంటే అర్థమేమిటి? ఇవేవీ నేను సృష్టించలేదు. ఇవన్నీ ముందుగా తెప్పించి అట్టిపెట్టబడినవే. మీ కివ్వాలని పించి, మీకు తీసి ఇస్తున్నాను అనేనా! ఇంకేమయినా ఉందా దాని అర్థం? ఆయన్ని గురించి మనమే ఏవేవో అనేసుకొని, మళ్ళీ కొన్నాళ్ళకి మన వైపు దిగిన తరువాత 'చూడండీ, ఆయన అలా లేదు' అంటే ఆయనేం చేస్తాడు? పాపం ఆయన అప్పుడు ఎలా తీస్తున్నాడో, ఇప్పుడూ అలాగే తీస్తున్నాడు. ఇవన్నీ ఆవేశపరులు తాముగా కోరి సృష్టించుకుంటున్న ఇబ్బందులు.

'అయితే అవి ఆయన అలా ఎందుకు తీయాలి? అవతల గదిలో పెట్టిన దానిని వెళ్ళితెచ్చి ఇవ్వవచ్చును గదా! లేదా కొన్ని తెచ్చి తనదగ్గర అట్టిపెట్టుకుని ఇవ్వవచ్చుగదా! అనవచ్చు కొందరు. అది ఆయనకు సంబం

ధించిన అంశం. ఆయన అలా తీయడమనేది ఒక కళగా అభ్యాసం చేశాడు. అనేక విద్యలలో అదొక విద్య. ఆ విద్యను అభ్యసించి జనంమీద ప్రయోగించ దలచాడాయన. ప్రయోగం ఫలించింది. జనం పెద్ద ఎత్తున ఆయనకు దగ్గరయ్యారు. జనంతోపాటు ధనమూ ఆయనకు చేరువైంది. జనాన్ని, ధనాన్ని కలిపి, సమాజానికి అవసరమైన మంచి పనులు కొన్నింటిని చేయించడం ప్రారంభించాడాయన. మంచి పనులు ప్రారంభం కావటంతో ఆయనకు కొంత మంచి పేరు రావడం ప్రారంభించి, క్రమంగా ఆ పేరు పెరగసాగింది. జనాన్ని ఆకర్షించడానికి ఈ విద్యను ఎందుకు ప్రదర్శించాడు అన్నదానికి ఆయన ఆలోచన ఆయనకు ఉండి ఉండవచ్చును. కేవలం మంచి మాటలు చెప్పి, మనం ఎందరిని మళ్ళించగలం? ఇలాంటిదేదో అవలంబిస్తే జనం వద్దన్నా మనదగ్గరకు చేరుతారు అనుకున్నాడేమో ఆయన. లేదా ఈ విద్యను ప్రదర్శించడం వల్ల, ఇది ఒక దివ్యత్వంగా పరిగణింపబడటం వల్ల తొందరగా తననుకున్నది సాధించగలననుకున్నాడేమో! అది ఆయన చెప్పాలి. మొత్తంమీద జన సమీకరణ బాగా చేశాడు. ధన సమీకరణ బాగా చేస్తున్నాడు. జనశక్తి, ధనశక్తుల సద్వినియోగం కూడా బాగానే చేస్తున్నాడు. ఇంతవరకూ అందరూ అంగీకరించవలసిందే. తప్పక ఆయనను అభినందించ వలసినదే!

అయితే ఇంకా కొంచెం పైకి వెళ్ళిచూస్తే ఒకే ఒక సూక్ష్మాంశమున్నది. అదేమిటీ అంటే, 'తనకు అలవడిన విద్యను ఆయన సద్వినియోగం చేస్తున్నాడా? సద్వినియోగం చేసుకుంటున్నాడా? అన్నది. సద్వినియోగం చేయడం అంటే దైవానికి సమర్పణగా, నిష్కామకర్మగా ఆచరించటం అన్నమాట. సద్వినియోగం చేసికోవడం అంటే ఆ సత్కార్యాచరణలో కొంత కామం అంటే కోరిక కలిగి ఉండటం అన్నమాట. ఆ కామం భౌతికమైనదే కానక్కరలేదు. మానసికమైనది కావచ్చు. భౌతికమైనా, మానసికమైనా కోరిక కోరికే! కీర్తి ప్రతిష్ఠలు లభించాలను కోవటం

కూడా కోరికే. ఇంకెవరికీ లభించనంతగా మనకు లభించాలను కోవడం ఇంకా పెద్దకోరిక. అలాంటిదేదైనా ఆయనలో ఉన్నదా? లేదా? అనేది అది ఆయనకూ, దైవానికీ సంబంధించిన అంశం.

ఎందుకని ఈ అంశాన్ని వివరించవలసి వస్తున్నదీ అంటే, అనేక సార్లు ఆయన తనను ఒక అవతారమూర్తిగా ప్రకటించుకుంటున్నాడు. నిజంగా అవతారమూర్తే అయి ఉన్నప్పటికీ అది మనం గ్రహించుకోవాలి గాని, ఆయన ప్రకటించుకోవలసిన అంశం కాదుకదా! అలా పదే పదే ప్రకటించుకోవటం చూస్తూ ఉంటే, అవతారమూర్తి అని అనిపించుకోవాలనే కోరిక ఈయనలో ఉన్నదీ అని అనిపించక మానదు. అదే నిజమైతే అది ఒక బంగారు సంకెల. ఎందువల్ల ఇలా చెప్పవలసి వస్తున్నదీ అంటే రామకృష్ణాది అవతారమూర్తు లెవ్వరూ ఇలా పదే పదే తాము అవతార మూర్తులమని ప్రకటించుకోలేదు. ప్రజలే వారి అవతార తత్త్వాన్ని దర్శించి కీర్తించుకున్నారు. ఈ అంశం గమనింప తగినది. తాను అవతార మూర్తిగా ప్రసిద్ధి చెందాలని ఆయనకు అనిపించి, అందుకు తన కలవడిన ఈ విద్యను ఉపకరణంగా వాడుకొని, జన ధనాలను సమీకరించి, పదిమందికీ పనికివచ్చే మంచి పనులను శ్రద్ధగా చేస్తున్నాడాయన అని అనుకోవడానికి అవకాశ ముంది. ఒకవేళ అదే నిజమయితే అది ఆయనకు సంబంధించిన అంశం. దైవం ఆయనను సరిచూడవలసిన అంశం. దేశానికీ, ప్రజలకూ సంబంధించినంత వరకూ మాత్రం ఆయన మంచిమాటలే చెపుతున్నాడు. మంచి పనులే చేస్తున్నాడు!

ఇక నీ స్మరణకు సంబంధించి అంటావా? దానిని నీవు నిశ్చింతగా కొనసాగించుకోవచ్చు. ఎందువల్లనంటే ఈ సృష్టి మొత్తం దైవస్వరూపమే. ఇందులోని ఏ వస్తువునుగాని, ఏ వ్యక్తినిగాని దైవానికి ప్రతీకగా స్వీకరించే అవకాశం నీకుంది. నీవు దేనిని స్వీకరించి చిత్తశుద్ధితో ఆరాధిం

చినా దైవం నీకు తప్పక ప్రసన్నమవుతాడు. కనుక నీవు అలవాటుపడిన స్మరణను నీవు మానవలసిన పనిలేదు. నీవు అలవాటుపడిన రూపాన్ని త్యజించవలసిన అవసరమూ నీకు లేదు.

ఇ. కె. మాష్టరుగారు ఒక చిత్రమైన వాక్యం చెపుతూ ఉండేవారు. 'రాతిని దేవునిగా మలచుకుని, తద్వారా దైవాన్ని దర్శిస్తూ, మానవుడు తరిస్తున్నాడు. మానవుడు తరిస్తున్న ఆ సమయంలోనే ఆ దేవునిగా మలచ బడిన రాయి, తన పరిణామక్రమంలో తానూ ముందుకు వెళుతున్నదీ' అని. అలాగే నీవు ఒక వ్యక్తి రూపంలో దైవాన్ని దర్శించావు. ముందుకు సాగుతున్నావు. సాగిపో. నీవు ఎవరిలో అయితే దైవాన్ని దర్శిస్తున్నావో, ఆ వ్యక్తికీ ఒక సాధనా, ఒక ప్రయాణమూ ఉన్నాయి. అది అతడు చూసుకుంటాడు. అతడిపైనున్న దైవం చూసుకుంటాడు. కనుక నేను కొలుస్తున్న ఇతనిలో దైవాంశ ఎంత అని నీవు కొలుస్తూ కూర్చుండవలసిన అవసరం లేదు. అనుభూతి నీకు లభించడమనేది నీవు పూజిస్తున్న వ్యక్తిలో విచ్చుకున్న దైవాంశ ఎంత అన్నదానిపైన ఆధార పడి ఉండదు. నీలో జరుగుతున్న సాధనపైన ఆధారపడి ఉంటుంది. కనుక మనం చూడవలసింది మనవైపే. మన ప్రయాణంవైపే. ఏమంటావ్?

ఆ యువకుని కన్నులవెంట ఆనందం బాష్పాలై కురుస్తోంది అతని కన్నుల్లో కృతజ్ఞతా భావం మెరుస్తోంది. జోడించబడిన అతని చేతులు, సాధనలో కుదురుకున్న అతని యోగస్థితిని తెలియజేస్తున్నాయి. స్వామి హస్తం అతని వెన్నును నిమురుతోంది.

# దగ్గరగా చూశాను

ఆ రోజు ఆదివారం. స్వామి విజయవాడలో ఉన్నారు. అది తెలిసి సోదర బృందంలో చాలమంది స్వామిని చూడవచ్చారు. సాయంత్రం ప్రేయరు చక్కగా సాగింది. తరువాత కార్యక్రమమంటూ ప్రత్యేకించి లేకపోవడంతో స్వామితో కలసి కబుర్లు చెప్పుకోవడమే కార్యక్రమంగా రూపొందింది. సరససల్లాపాలతో ఆ సమయం రసవత్తరంగా నడుస్తున్నది.

మధ్యలో ఒకామె అన్నది. "మొన్న అమ్మ చదివి వినిపించింది భారతం - ధర్మాద్వైతం. ఎంత బాగుందో! చదువుకున్న దానికంటే ఎవరైనా చదువుతుంటే వింటూ ఉంటే బాగుంటుంది".

ఆమె తృప్తిగా చూస్తున్నది.

స్వామి ఇలా అన్నారు : "నీవు చెప్పినదానిలో ఎంతో నిజం ఉంది. చదువుకున్న దానికంటే, ఎవరిచేతైనా చదివించుకొని విన్నప్పుడు చాల బాగుంటుంది. చదువుతున్నప్పుడు కనపడేని పదాలు. చదివించుకొని వింటున్నప్పుడు ఆ పదాలు శబ్దాలవుతున్నాయి. ఆ శబ్దాలు మన మనస్సుకు ఆయా దృశ్యాలుగా గోచరింప జేస్తున్నాయి. అందుకే మన పెద్దలు పురాణ పఠనాలను ఏర్పాటు చేశారు. పురాణం చెప్పేటప్పుడు ఏం చేస్తారు? ఇద్దరు వ్యక్తులు వేదికమీద కూర్చుంటారు. ఒకరు మూలగ్రంథం చదువుతూ ఉంటారు. మరొకరు వ్యాఖ్యానం చేస్తూ ఉంటారు. గ్రామస్థులందరూ వింటూ ఉంటారు. మనం ఒక్కళ్ళమే కూర్చుని ఆ పురాణాన్ని చదువుకుంటే అంత అనుభూతి కలుగుతుందా!"

"కలగదండీ" - అన్నదామె.

"అంతేకాదు. ఈ పురాణ ప్రవచనంలో ఇంకో ప్రయోజనం ఉంది. చదువుకోవాలి అంటే చదువు రావాలి. చదువుకోవటం చేతకావాలి. అదే

పురాణ ప్రవచనం వినటానికి ఇవేమీ అక్కరలేదు. హాయిగా మనస్సు పెట్టి వింటేచాలు. ఆ మనస్సును కూడా ఒకసారి అటువైపు పెడితేచాలు. ఆపైన ప్రవచనకర్తల కంఠనాదం, వ్యాఖ్యాన వైభవమే దానిని నిలబెట్టు కుంటుంది. ఒక విధమైన యోగస్థితి పురాణ ప్రవచనం జరుగుతున్నంత సేపూ అందరూ అనుభవిస్తారు. ఎంత అదృష్టమది!" అన్నారు స్వామి.!

అందరూ ఆనందంతో వింటూ ఉన్నారు.

అంతలో ఒకామె అన్నది: 'నా పరిస్థితే మరీ దారుణం మాష్టారూ! వచ్చిన చదువా అంతంత మాత్రం. పోనీ కూడబలుక్కొని చదువుకుందా మంటేనా ఒకటే కళ్ళ నొప్పులు. పుస్తకాలుండీ ప్రయోజనం లేకుండా ఉంది".

ఆమె దీనంగా చూస్తోంది.

స్వామి ఇలా అన్నారు. "మీ అమ్మాయి ఉందిగా, అమ్మాయి చదువుతూ ఉంటే నీవు వినవచ్చుగదా".

"ఆ! దాని చదువుతోటే దానికి సరిపోతోంది. ఇంక నాకెక్కడ చదివి వినిపిస్తుంది. దాని చదువొకటి అది చదువుకుంటే చాలు. ఈ ఉద్దేశ్యంతోనే దానికి పనులుకూడా ఏమీ చెప్పను, ఇంతచేసినా దానికి వచ్చిన చదువే కనపడటం లేదు" అన్నదామె బాధగా.

స్వామి చిరునవ్వుతో ఇలా అన్నారు: "ఇంత చేసినా అమ్మాయికి చదువురావటం లేదంటావు! రాకుండా ఉండటానికి చేయవలసినదంతా చేశావు".

ఆమె ఆశ్చర్యంగా చూసింది.

స్వామి ఇంకా ఇలా అన్నారు. "కదామరి! నీ చదువు నువు చదువుకో, నీ చదువు నీవు చదువుకో!" అంటూ ఆ అమ్మాయికి మీరు

చేస్తున్నదేమిటో తెలుసునా! ఒంటరిదాన్ని చేయడం. ఇంట్లో మీరు కలవ నివ్వరు. మనసు విప్పి మాట్లాడే అవకాశం ఇవ్వరు. అప్పుడా అమ్మాయి ఏం చేస్తుంది. సహవాసలగత్తెలవైపు మొగ్గుచూపుతుంది. ఆ సహవాస గత్తెలు మంచివాళ్ళయితే ఫరవాలేదు. వాళ్ళది చెడ్డ సంస్కారమైతే ఏమవు తుంది? అమ్మాయి జీవితం మనం ఊహించని మలుపులు తిరుగుతుంది. అప్పుడు నెత్తీ, నోరు కొట్టుకొని ఏం లాభం?

చదువంటే వాళ్ళ క్లాసు పుస్తకాల్లో మాత్రమే ఉన్నదనీ, చదువు చెప్పేవాళ్ళంటే వాళ్ళ టీచర్లు మాత్రమేనని మనం భ్రమపడుతున్నాం. భ్రమపడి కావలసిన ఫీజులు కట్టి, పుస్తకాలు కొనిపెట్టి కళ్ళు మూసుకొని కూర్చుంటున్నాం. మనం కళ్ళు తెరిచేటప్పటికి కథలు అనుకోని మలుపులు తిరుగుతాయి. అప్పుడిక కలవరపడిపోతాం.

చదువంటే నాలుగు గోడల మధ్య చెప్పింది కాదు. ఇంట్లో పని నేర్చుకోవటమూ చదువే ! నలుగురితో కలసి జీవించగలగడమూ చదువే ! మనం చదువుకోవాలే కానీ, అడుగడుగునా ఉన్నది చదువే. పిల్లలు ఆ వయస్సుకు తగ్గ పనిపాటలు నేర్చుకోవాలి. అలాగే రాబోయే జీవితాన్ని వాళ్ళెలా నిర్వహించాలో ఒక అవగాహన వాళ్ళకు అందేటట్లుగా చూసు కోవాలి. ఏ రాత్రిపూటో పడుకోబోయే ముందు ఒక అరగంటసేపు రామాయణమో, భారతమో, మీ అమ్మాయిని చదివి వినిపించమని అడిగి, అది చదువుతుంటే మీ దంపతులూ, మిగిలినవాళ్ళూ విన్నారనుకో. అప్పుడేం జరుగుతుంది ? మానవ జీవితం అంటే ఏమిటో, దాన్ని నిర్వ హించుకోవడం ఎలాగో అందరకూ కలసి తెలుస్తుంది. అందరూ కలసి ఈ గోష్ఠిలో పాల్గొనడం ద్వారా మీ కుటుంబ సభ్యుల మధ్య ఒక అవ గాహన ఏర్పడుతుంది. ఒక శ్రుతి కుదురుతుంది. ఒకళ్ళకి ఒకళ్ళుగా జీవించడం అంటే ఏమిటో, నలుగురూ కలిసి అనగలుపుకుని జీవించటంలో ఎంత అనుభూతి ఉందో మీకు తెలుస్తుంది. లేకపోతే ఎవరికి వాళ్ళయి

పోతారు. ఒక లాడ్జికీ, మీ ఇంటికీ తేడా ఉండదు. ఎవళ్ళ రూమ్‌లో వాళ్ళు, ఎవళ్ళ గొడవలో వాళ్ళు ఉన్నప్పుడు అది లాడ్జి అవుతుంది కానీ ఇల్లు కాదు. తల్లిదండ్రులు ఆ లాడ్జి ప్రొపరయిటర్‌లు అవుతారు. లాడ్జి ప్రొపరయిటర్‌కూ లాడ్జిలో దిగిన వాళ్ళకూ ఎలాంటి సంబంధం ఉంటుందో మీకూ, మీ పిల్లలకూ అలాంటి సంబంధమే ఉంటుంది. మీ పిల్లల్లో ఎవరు ఎక్కడికి ఎందుకు పోతున్నారో మీకు తెలుసునా ? మళ్ళీ ఎప్పుడు ఏ తీరులో తిరిగి వస్తున్నారో మీకు తెలుసునా ? మరి మీ ఇల్లు లాడ్జి కాక మరేమిటి ?"

ఆమె దీనంగా చూస్తూ, "ఇప్పుడు అంతే జరుగుతోందిగా మాష్టరు గారూ !" అన్నది.

స్వామి స్ఫూర్తివంతంగా చూస్తూ, 'అంతే జరుగుతోందా ? అంతే జరిగేటట్లు మనం చేస్తున్నామా ! మా బంధువుల్లో ఒక కుటుంబముంది. ఆయనకు రెండు వివాహాలు. మొదటి భార్య కాన్పు కష్టమయి చనిపోతే, రెండవ వివాహం చేసుకున్నారు. ఇద్దరు తల్లుల బిడ్డలు కలసి మెలసి ఒకే ప్రాణంగా జీవిస్తూ ఉండేవారు. పెద్దామె బిడ్డ ఈ పినతల్లి భోజనం చేసే టప్పటికి చేతికి వక్కపొడి అందించేవాడు. రాత్రి అయ్యేటప్పటికి ఆ తల్లికి పక్క సర్ది పెట్టేవాడు. తమ్ముళ్ళను, చెల్లెళ్ళను కంటికి రెప్పగా చూచుకునే వాడు. ఆ తమ్ముళ్ళు చెల్లెళ్ళు కూడా ఆ అన్న దేహంలో అవయవాలుగా తాదాత్మ్యం చెంది వర్తించేవారు. ఇందరిని చూస్తున్న ఆ తండ్రి సాక్షి మాత్రుడై ఆనందించేవాడు.

ఇంత పద్ధతిగా, ఇంత ప్రేమతో చిరకాలం వీళ్ళు జీవిస్తూ రావ డానికి కారణ మెక్కడ ఉన్నదా అని దగ్గరగా చూశాను నేను. తెల్లవారు ఝామున నాలుగున్నర అయ్యేసరికి స్నానం చేసి కుటుంబ సభ్యులందరు ఆ ఇంట్లో ఉన్న హాలులోకి చేరుకునేవారు. నాలుగున్నర నుండి అయిదు

గంటల వరకు దైవప్రార్థన చేసుకునేవారు. ప్రార్థన పూర్తి కాగానే తల్లి దండ్రులతో ఆరోజు తమ కర్తవ్యాలను గూర్చి తగుమాత్రం మాట్లాడి, వలసిన సలహాలను అందుకొని దినచర్యలోనికి దిగేవారు. రాత్రి ఎనిమిదిన్నర కల్లా భోజనాలు పూర్తి చేసుకుని ఒక గంటసేపు ఏ భాగవతమో పుచ్చుకుని గొంతెత్తి గానం చేస్తూ ఉండేవారు. ఆ అను భూతిలో పడకలను చేరుకునేవారు. ఇది వాళ్ళ అభ్యాసం. ఈ అభ్యాసమే వాళ్ళను కలిపి ఉంచింది. కలిసి మెలసి ఉండేలా చూసింది. మనం కూడా ఇలా జీవిస్తే బాగుంటుందేమో చూడు మరి.

ఆమె ఆర్ద్రంగా చూస్తోంది. జరిగిన తప్పుకు పశ్చాత్తాపపడుతోంది. నిర్వహించవలసిన కర్తవ్యానికి ఉన్ముఖమైన మనస్సుతో స్వామి పాదాలకు నమస్కరించి లేచింది.

స్వామి ఇలా అన్నారు : "అందరూ ఒకచోట బ్రతకటం చాలదు. ఒకటిగా బ్రతకటం చేతకావాలి. పెద్దవాళ్ళకూ, పిల్లలకూ చక్కటి ప్రతి కుదరాలి. అందరూ కలసి అందరికోసం జీవించాలి. పెద్దలు యువకులతో చేతులు కలపాలి. ఆ యువకులు పిన్నలకు చేతులు అందించాలి. ఎవరికి వారుగా కాక, ఒకరికోసం ఒకరు బ్రతకాలి. అప్పుడు మన కుటుంబమే ఒక దేవాలయమవుతుంది. దేవాలయానికి మనం వెళ్ళేది అందుకోసమే, మన ఇల్లు ఒక దేవాలయంగా చేసుకోవటానికే"!

అందరూ ఇది అందరికీ కావలసిన సమన్వయమే ననుకుంటూ అదో అనుభూతితో నిలిచారు.

# చేయడానికే తపస్సు

తెల్లవారుఝామున నాలుగున్నర అవుతోంది. సోదర బృందంలోని ఒకామె వ్యాధి తీవ్రతకు తాళలేక మందుకని వచ్చారు. స్వామి ఆమెను కూర్చోబెట్టి చూపులతోనే పరిస్థితిని గమనించి కావలసిన మందు వేశారు. మందుపనిచేస్తూ ఉంది.

స్వామి ఆమెను తమ మాటలతో అనునయిస్తున్నారు. మాత్రలు పనిచేశాయో, లేక మాటలు పనిచేశాయో, లేక ఆ రెండూ కలసి పని చేశాయో కానీ, ఆమెకు వ్యాధి తీవ్రత తగ్గింది. క్రమంగా వాతావరణం ప్రశాంతమయింది. మూలుగులు ముచ్చటలుగా రూపొందుతున్నాయి. బాధతో బరువుగా వచ్చినవారు చిరునవ్వుతో తిరిగి వెళ్ళడానికి లేచారు. స్వామి ఆమెను ప్రేమతో సాగనంపుతున్నారు. ఆ సమయం ప్రేమమయం! ఆ సమయం సందేశ మయం!

ప్రశాంతంగా కూర్చొని ప్రసన్నంగా చూస్తున్న స్వామితో ప్రక్క నున్న యువకుడు ఇలా అన్నాడు: "మాష్టరుగారూ! ఇలాంటి సన్నివేశాలు ఎదురైనప్పుడు కంగారు పడిపోయే వాళ్ళే ఎక్కువమంది ఉంటారు. నిలద్రొక్కుకొని చేయవలసింది చేయగలిగినవాళ్ళు ఎంతమంది ఉంటారని అనిపిస్తుంది.

మెరుస్తున్న కళ్ళతో స్వామి ఇలా అన్నారు : చేయవలసింది చేయగలగటం కోసం మానవుడు తపస్సు చేయాలి. ప్రార్థనలు, జపాలు, సాధనలూ, యాత్రలూ, పెద్దల సందర్శనాలూ, వాళ్ళ బోధలకు చెవియొగ్గ టాలూ - అన్నీ దీనికోసమే! చేయవలసింది ఏమిటో తట్టడం కోసమే! ఆ తట్టినదాన్ని చక్కగా చేయడం కోసమే! దీనినే కృష్ణుడు 'కర్మా చరణంలో కౌశలం' అన్నాడు. అప్పుడు అనుభవానికి వచ్చేదే 'యోగస్థితి' అన్నారు.

రాజయోగ మార్గాన సాధన చేస్తూ, మహాత్ములను సమర్పణ బుద్ధితో ఆరాధిస్తున్నకొద్దీ చేయవలసింది చేయగలిగే స్థితి మనకు సిద్ధిస్తుంది. ఈ సాధనా సమర్పణా లేనినాడు చేయదలచింది చేయగలం తప్ప, చేయవలసింది చేయలేము. ఏమంటావు ?

"మీరు ఇస్తున్న శిక్షణంతా ఎందుకో ఇప్పుడు బాగా బోధ పడింది మాష్టారూ !" - అంటూ అంతర్ముఖుడయ్యాడా యువకుడు.

## మాటతోకాదు బాటతో

ఈసారి ఇటువైపు వచ్చినప్పుడు మా ఊరికి తప్పక రావాలి. ఎప్పటినుండో ఆశిస్తున్న కార్యక్రమమిది. ఈసారి మీరు అవకాశాన్ని అనుగ్రహిస్తామంటే తగిన ఏర్పాట్లు చేసుకుంటాం.

స్వామి నవ్వుతూ ఇలా అన్నారు : "తగిన ఏర్పాట్లు చేసుకుంటే రావటానికి నాకేమీ అభ్యంతరంలేదు. అయితే మన సంప్రదాయంలో తగిన ఏర్పాట్లు అంటే ఏమిటో మీకు తెలుసుననుకుంటా? ఇ. కె. మాష్టరు గారు తమ జీవిత కాలంలో ఒక నియమాన్ని పాటించారు. ఎక్కడ సత్కర్మాచరణ సేవా రూపంలో జరుగుతున్నదో, అక్కడ మాత్రమే ఆయన అడుగుపెట్టేవారు. సత్కర్మాచరణకు సిద్ధపడిన చోటుకు గాని, సత్కర్మాచరణ జరుగుచున్న చోటుకుగాని వెళ్ళడానికి ఆయన వెంటనే తమ సంసిద్ధతను తెలియజేసేవారు. మిగిలిన చోట్లకు రమ్మన్నప్పుడు 'చూస్తున్నారుగా, ఈ కార్యక్రమాల ఒత్తిడి' అంటూ చిరునవ్వుతో తప్పుకునేవారు. అంటే "క్రమబద్ధమైన కార్యాచరణతో మాత్రమే నా రాకకై మీరు నన్ను ఒత్తిడి చేయగలరు" అన్న సూచన అందులో ఉన్నది. ఏమంటారు ?

అదే నియమం నాకూ అభ్యాసమైంది. కనుక ఈ ప్రకారం మీరు తగిన ఏర్పాట్లు చేసుకోగలిగితే, రావడానికి నాకు ఎట్టి అభ్యంతరం లేదు. ఈ కార్యక్రమానికి మామూలు వేదికలు, మామూలు మైకులు, మామూలు దండలు చాలవు. గ్రామంలో వేదిక వేయడమే కాకుండా మీ గ్రామాన్నే లోకశ్రేయస్సుకై పనిచేసే ఒక వేదికగా మీరు రూపొందించగలగాలి! నా గొంతు నలుగురికీ వినబడడానికి మైకులు పెట్టడమే కాకుండా, మీ గొంతులే నా గొంతుకు వాహికలు కావాలి! జాతి పునర్నిర్మాణ కార్య క్రమానికి మీ గొంతులు తమవంతు పాత్ర పోషించడానికి సిద్ధం కావాలి! ఈ కార్యక్రమం ఏర్పాటు కావటానికి మామూలు దండలు చాలవు. పూలతో గ్రుచ్చిన దండలు మాత్రమే కాక, ఉత్సాహంతో నిండిన మీ గుండెలతో గ్రుచ్చిన దండలు కావాలి! ప్రేమ అనే దారంతో మీ హృద యాలనే పూలను దండగా గ్రుచ్చి, లోకహితాన్ని నిర్దేశిస్తున్న మీ సారథికి మీరు సమర్పించగలగాలి! ఇదీ తగిన ఏర్పాటు! ఇలాంటి వేదిక, ఇలాంటి మైకులు, ఇలాంటి దండలు రూపొందించుకునే ప్రయత్నంలో మీరు ఉండండి. తగిన సమయంలో తప్పకుండా మీ ఊరు వస్తాను. మీరు నన్ను మాటతో పిలవటం కాదు. మీరు నడిచే బాటతో పిలువగలగాలి! మాటతో వస్తానులే అంటాను. బాటతో పిలిస్తే వస్తాను'లే'! అంటూ చేయి అందు కుంటాను.

అంతలోనే చిలిపిదనం, అంతలోనే కర్తవ్య బోధ ఆ గొంతు నుండి వ్యక్తమవుతూ ఉంటాయి. 'చిలిపిదనానికీ, కర్తవ్య బోధకూ జత ఎట్లా కుదురుతుంది?' అది తెలియాలీ అంటే ఇలాంటి చోట్ల చూడాలి. ఇలా ఆ రెండింటిని మొదట జతకలిపి నడిపినవాడు శ్రీకృష్ణుడు. భగవద్గీ తలో ఎంత చిలిపిదనం ఉందో స్వామి లాంటి వాళ్లు చెబుతున్నప్పుడు మనకు తెలుస్తుంది. అందుకే అంటారు స్వామి, "భగవద్గీతను సీరియస్‌గా మైండ్‌తో చదువుకోవడం కాదు, సరసంగా హృదయంతో చదువుకోవడం చేతకావాలీ" అని.

వింటున్న మిత్రుడి మీద ఈ చిలిపితనం మేళవించిన కర్తవ్యబోధ బాగా పనిచేసింది.

"మాటతో కాక బాటతో పిలిచే రోజు త్వరలో రావాలని ఆశీర్వదించండి మాష్టారూ!" అన్నాడతను.

స్వామి "వస్తుందిలే" అన్నారు.

ఒక్క క్షణం ఆగి చిరునవ్వుతో, "వస్తుందిలే అంటే బోధపడిందా! అది వస్తుందిలే అంటే నీవు కూర్చో. అది వస్తుందిలే అని అర్థంకాదు. వస్తుంది. 'లే' లే! లేచినిలబడు! ఆరోజు అప్పుడు వస్తుంది" అని అర్థం. అంటూ సూటిగా అతనిలోనికి చూశారు.

ఆ మిత్రుడు సిగ్గుపడుతూనే స్ఫూర్తిని పొందుతున్నట్లు కనిపించాడు.

ఆ రోజు వస్తున్నట్లే కనిపించింది.

## ఖర్మ యోగం

స్నేహితుడైన ఒక యువకుణ్ణి కబురు పెట్టి పిలిపించారు స్వామి. చేరవచ్చిన అతనిని చెంత కూర్చొబెట్టుకున్నారు. కుశల ప్రశ్నలు అయిన తరువాత కబురు పెట్టిన విషయాన్ని కదప దల్చుకొని, "ఏమయ్యా! పని పూర్తిచేసి పెడతానని నాకు చెప్పి ఎన్నాళ్ళయింది ? ఎన్నేళ్ళయింది ?" అని అడిగారు.

"నిజమే ననుకోండి. మీకు తెలుసు కదా నా పరిస్థితి. నాకు వెయ్యి పనులు. అన్నీ నేనే చూసుకోవాలి. నాకున్న బాధ్యతలు మీకు తెలియనివి కావు కదా!" అంటూ నసిగాడు అతను.

"అందుకని ఆ వెయ్యి పనుల్లో వేటినీ పూర్తి చేయకుండా వెయ్యి పనులు, వెయ్యి పనులు అంటూ చూస్తూ కూర్చుంటావా? చేయడంలో

పద్ధతి అన్నది ఉంటే వెయ్యి పనులు కాదు, లక్షపనులు చేయవచ్చు. నువ్వు పనిమంతుడవే! కానీ, నీకు పద్ధతి లేదు. లోకం నిన్ను మెచ్చుకోగలదు కానీ విశ్వసించలేదు. నమ్మి నీకు పని అప్పచెప్పలేదు. ఒకవేళ అప్పచెపితే నీ నుండి బయటపడలేదు.

భగవంతుడు నీకు చక్కటి శక్తియుక్తులు ఇచ్చాడు. నలుగురితో కలసిపోగల సహృదయాన్నీ ఇచ్చాడు. ఈ రెండింటిని సద్వినియోగం చేయగల క్రమశిక్షణను మాత్రం నీవింకా సాధించుకోలేదు. లోకం నీ యెడల చూపిస్తున్న అభిమానానికి తగిన పాత్రతను నీవింకా సాధించుకోవలసి ఉంది. లేకపోతే నీ శక్తియుక్తులు, నీ సహృదయం అడవిగాచిన వెన్నెలలా వృథా అవుతాయి. లోకానికవి వినియోగ పడవు. ఇప్పుడు నేనే ఉన్నాను. నీ మీదున్న అభిమానంతో ఇంతకాలం వేచి చూస్తున్నాను. కాని నీకసలు చీమ కుట్టినట్లయినా ఉందా? "ఆయనకు మాటిచ్చాను. ఇప్పటికైనా పని పూర్తికాకపోతే ఎలా?' అని నీకు ఏ కోశాన అయినా అనిపిస్తోందా? నీదీ ఒక యోగంలా కనిపిస్తుంది. ఎవరేమన్నా పట్టించుకోకుండా నీలాగా నీవు ఉండగలుగుతున్నావు బలేవాడివయ్యా! ఇప్పుడయినా, నా కంఠశోషేగాని, గడపదాటితే నీకివేమీ గుర్తుండవు. ఎటువంటి నిశ్చల స్థితిని సాధించావయ్యా! నీకెన్ని చెప్పినా బోడిగుండు మీద నీళ్ళు గ్రుమ్మరించినట్లే. కానీయి! ఏం చేస్తాం!" అంటూ నిట్టూర్చారు స్వామి.

"పని పూర్తి చేయటానికి ప్రయత్నం చేస్తానండీ" అన్నాడతను. "తప్పనిసరై ఇలా చేస్తున్నాను తప్ప మిమ్మల్ని కష్టపెట్టాలనా!" అన్నట్లుగా చూశాడు.

స్వామి ఇలా అన్నారు: పనులు, ప్రయత్నాలు నీవు చేయటం లేదని కాదు. కాని అవి ఎందుకు కావటం లేదో కూడా నువ్వు ఆలోచించావా? పద్ధతి లేకుండా చేసుకోవడం వల్ల ఇదంతా జరుగుతోంది. నీవు చేయవలసిన పనుల్ని ఒకచోట వ్రాసుకో. వాటిలో ముందు వెనుకలను

చక్కగా నిర్ణయించుకో! వరుసగా చేసుకుంటూ రావడం మొదలుపెట్టు. అప్పుడందరికీ న్యాయం చేకూరుతుంది. నీవు చేయగలను అనుకున్న రోజుకు మరికొన్ని రోజులు కలుపుకుని, పనిని అప్పజెప్పే తేదీని చెప్పు. మాట తప్పకుండా ఆ తేదీ లోపున ఆ పనిని అప్పగించు. కాల నియమం పాటించనిదే ఏ కార్యమూ రాణించదు. పద్ధతి తప్పితే అది పని అనిపించు కోదు".

ఆయన వదనం గంభీరంగా ఉంది.

అంతావిని ఆ యువకుడిలా అన్నాడు : వ్యాపారం కదండీ చేసేది, నియమాలు పాటించటమంటే కష్టమవుతుంది" నేనున్న స్థితిని అర్థం చేసుకోండి అన్నట్లుగా చూశాడతను.

స్వామి బాధగా ఇలా అన్నారు: వ్యాపారంలో నియమాలు పాటించ డానికి వీలుకాదా! వ్యాపారంలో వీలుకాదు. ఉద్యోగంలో వీలుకాదు. కుటుంబంలో వీలుకాదు. మరెక్కడ వీలవుతుంది, నియమాలు పాటించ టానికి ? ఉపన్యాస వేదికల పైననా ? అక్కడ కూడా నియమాలు చెప్ప టమేకానీ, పాటించటం ఉండదే! అరగంటలో ముగించండీ అంటే ఆరు గంటలు వాయిస్తామే! మరింకెక్కడ పాటిస్తాం ? మనం ఇరవయ్యోశతాబ్దం భారతీయులం. నియమాలు పాటించం. నియమాలు వల్లిస్తాం. పాటించే తరాలు వెళ్ళిపోయి వల్లించే తరాలు వచ్చాయిప్పుడు!

కర్మయోగంగా ఆచరించవలసిన పనిని ఖర్మయోగంగా మార్చిన ఘనులం మనం! అంటే అవతలివాడికి ఖర్మకాలితే మన దగ్గరకు పనిచేసి పెట్టమని వస్తాడు. ఇంకొకడికి వాడూ ఇలాగే చేసిపెడుతున్నాడుకదా! అందుకని ఆ బలహీనతవల్ల ఇక్కడ మనను అంతగా అనలేక సరిపెట్టు కుంటూ ఉంటాడు. మొత్తం మీద భారతీయులం అందరం ఖర్మయోగంలో రాణిస్తున్నాం. కానీయ్! ఏం చేస్తాం ? భారతీయులందరూ బాగుపడినప్పుడు

నువ్వూ బాగు పడుదువుగానిలే! అదెలాగూ అప్పుడే సాధ్యం కాదు గనుక నీకు తోచినట్లుగా నీవుండవచ్చు.

ఇష్టం వచ్చినట్లు ఉండటానికేగా మనం స్వాతంత్ర్యం తెచ్చుకున్నాం. నీకు దయకలిగినప్పుడు నా పని చేసిపెట్టు. నాకు పని ఉంది. నేను వెళతున్నాను'. అంటూ అక్కడి నుండి వెళ్ళిపోయారు స్వామి.

## పురుష ప్రభలు లేవే!

ఒక రోజున స్వామి తమ పనిలో నిమగ్నమయి ఉన్నారు· ఇంతలో ఒకామె చిన్న వ్యానిటీ బ్యాగ్ చేతబట్టుకొని ప్రవేశించారు. బ్యాగులో నుండి ద్రాక్షపళ్ళు తీసి స్వామి చేతిలో పెట్టి నమస్కరిస్తూ, "మీరు మా శ్రీవారిని తొందరగా పద్ధతిలోనికి తీసుకునిరావాలి. ఇక్కడ పనిలో పాలుపంచుకోనిదే నేను ఉండలేను. ఆయనను ఒప్పించుకుని రావడమే ఒక యజ్ఞం అయిపోతోంది అని బాధపడుతూ చెప్పింది.

స్వామి మందహాసం చేస్తూ 'అలాగా' అన్నట్లు చూశారు.

ఆమె ఇంకా ఇలా అన్నది. "ఒక్కొక్కసారి నాకనిపిస్తూ ఉంటుంది, మగవాడయి పుడితే ఈ గొడవలేమీ ఉండవు కదా!" అని.

నాలిక కరుచుకుంటూ ఆమె మళ్ళీ ఇలా అన్నది. కొంపతీసి అప్పుడు గడుసు పెళ్లాం వచ్చిందీ అంటే అప్పుడూ నేను చేయగలిగేది ఏమీ ఉండదు గదా !

స్వామి నవ్వుతూ "చేయగలిగేది ఏమీ ఉండదు. అంతేకాదు. అప్పుడు ఇప్పుడున్న ఈ మాత్రం సానుభూతి కూడా దొరకదు" అన్నారు.

నిజమేనంటూ తలూపింది. పెదాలు బిగించి వస్తున్న నవ్వును ఆపుకుంటున్నదామె.

స్వామి ఆమెను ఆట పట్టిస్తూ ఇలా అన్నారు : "ఏం ? ఏమంటావ్! నేనన్నది నిజం కాదూ? ఇప్పుడయితే, 'పాపం ! ఆడవాళ్ళు అణచిపెట్టబడు తున్నారు, అని లోకమూ సానుభూతి చూపిస్తుంది. మీరూ చెప్పుకోవడానికి బోలెడంత అవకాశముంటుంది.

అదే గడుసు పెళ్లాం పిడికిలికి దొరికిపోయిన మగవాడున్నాడనుకో. వాడు ఎవడికి చెప్పుకుంటాడు ? చెప్పుకోక ముందే వీధీ, వాడా అంతా వాడికి తాటాకులు కడుతూ ఉంటారు. 'చూశావా ! పాపం ఆ మగాడి జీవితం. ఎంత ఘోరమో!' అని. ఆడవాళ్ళయితే ఏ మహిళా ప్రభలోనో వ్రాస్తూ మగ వాళ్ళను పట్టుకొని ఉతికి ఆరేస్తున్నారు. మరి మగాళ్ళేమి చెయ్యాలి ? వాళ్ళకు పురుషప్రభలు లేవే ! ఒకవేళ పురుషుల కోసం అలాంటి శీర్షికలు ఎవరైనా పెట్టినా, అవి చదివినవాళ్ళు నవ్వుకోవడానికి పనికి వస్తాయి తప్ప, ఈ మగవాళ్ళ బాధల్ని తీర్చడానికి పనికిరావే. ఏమంటావ్ ?" అన్నారు.

"మీరు మరీ ఆట పట్టించేస్తున్నారు" అన్నది ఆమె ఉడుక్కుంటూ.

"సరదాగా అన్నాను గానీ ఆడేమిటి ? మగేమిటి ? సరిగ్గా చూస్తే కనబడేవి మంచీ, చెడూ - ఈ రెండే.! అవి ఆడవాళ్ళలోనూ ఉంటాయి. మగవాళ్ళలోనూ ఉంటాయి. భార్యను అణచిపెట్టే భర్తలున్నట్టే, భర్తపైన స్వారీ చేసే భార్యలూ ఉంటారు. సింహంలాంటి భర్తా, గోవులాంటి భార్యా ఉన్నట్లే, మేకలాంటి భర్తా, పులిలాంటి భార్యాకూడా తారసపడుతూనే ఉంటారు. ఏమంటావ్ ? బాగుందా వివరణ" - అంటూ చిన్నగా నవ్వారు స్వామి.

ఒప్పుకుందామని ఉన్నా ఒప్పుకోవడానికి అభిమానం అడ్డువచ్చి, ఉడుక్కుంటూ కూర్చున్నదామె.

# వెన్ను తట్టేవాడుంటే !

ఒక రోజు రాత్రి, సమయం పది గంటలు దాటుతుంది. స్వామి ముంజులూరులోని మన కార్యక్షేత్రంలో ఉన్నారు. ప్రశాంతమైన వాతావరణం. ఆరుబయలు. పైన చుక్కలు. క్రింద పూల మొక్కలు. స్వామి పడక కుర్చీలో కూర్చొని ఉన్నారు. ఉన్న నలుగురూ చుట్టూ చేరారు. గాలి వీస్తోంది చల్లగా. కూర్చున్నవారిలో ఏవేవో భావాలు కలుగుతున్నాయి మెల్లగా. వారిలోని ఒకతను స్వామితో మాట్లాడటానికి ఉద్యుక్తుడవుతున్నాడు.

'ఏమిటి ? చెప్పు' - అన్నట్లుగా చూశారు స్వామి అతనివైపు.

"మాష్టరుగారూ ! మనం తలపెట్టిన కార్యక్రమాలలో జరగవలసినవి చాల ఉన్నాయి కదా !"- అన్నాడతను. స్వామి నవ్వుతూ : జరగవలసిన కార్యక్రమాలు చాల ఉన్నాయి. అవి జరగవలసినవై ఉన్నాయి. అందులో మనం మన తలపెట్టాం. అంతే. ఏమంటావ్ ?" అన్నారు.

"ఏమంటాను. మేము ఏది అడిగినా మా ప్రశ్ననే సమాధానంగా ఇట్టే త్రిప్పి చెబుతారు మీరు అంటాను. అడగటానికి ఇందులో ప్రశ్న ఏముంది అనిపించేటట్లు చేసేస్తారు మీరు". అన్నాడతను నవ్వేకుంటూ.

"బాగుంది. ఇంతకూ నీవు అడగదలచినదేమిటో అడుగు" అన్నారు స్వామి.

"అడగమన్నారు కాబట్టి అడుగుతున్నాను. ఈసారి అడిగినదాన్ని త్రిప్పి చెప్పడమే కాదు, మరికొంచెం విప్పిచెప్పాలి కూడా" అన్నాడతను.

'అలాగే ! తప్పకుండా చెబుతాను' అన్నారు స్వామి వాత్సల్యంగా.

"మన నుండి ప్రారంభమైన కార్యక్రమాలు పెద్ద ఎత్తున జరగ

వలసినవి. వీటన్నిటి నిర్వహణకు కావలసిన ఆర్థిక వనరులను ఒనకూర్చు కునే మార్గమెలా అన్నది నేను తెలుసుకో గోరిన అంశం" అన్నాడతను.

స్వామి ఏం చెబుతారో అని ఉత్సుకతతో చూస్తున్నాడా యువకుడు.

స్వామి ఇలా అన్నారు : ఏ కార్యక్రమమైనా చక్కగా నిర్వహింప బడటానికి మొదట కావలసింది కార్యకర్తలు. నమ్మకస్తులు, దృఢ వ్రతులు అయిన వ్యక్తులు కార్యకర్తలుగా రూపొందినపుడు కార్యక్రమం దానికదిగా నడిచిపోతుంది. పని జరగడానికి ముందు కావలసింది మనుషులు. మనిషి ఉంటే 'మనీ' ఉన్నట్లే. 'మనిషి' అన్న పదంలోనే 'మనీ' కూడా ఉన్నది కదా ! ఏమంటావ్ !

ఆ యువకుడు చిన్నగా నవ్వుతూ బోధపడుతోందన్నట్లుగా తల ఊపాడు.

స్వామి ప్రేమగా చూస్తూ ఇంకా ఇలా అన్నారు. "ఇక నీ పెద్ద ఎత్తున అన్నమాటకు నేను జవాబు చెప్పాలి. చెబుతాను. ఒకసారి ఒకాయన నాతో ఒకమాట అన్నారు. ఆయన అన్నమాట నిజమే ననిపిస్తోంది. ఆయనేమన్నాడో తెలుసా ? ఈ దేశంలో దాతలకు కొదవలేదు. కానీ, దాతలు తమ ధనాన్ని సద్వినియోగం చేసే నమ్మకస్తులైన కార్యకర్తలున్న సంస్థలు ఒక పట్టాన దొరక్క ఇవ్వటానికి ముందుకు రాలేక పోతున్నారని. ఎంత చక్కగా చెప్పాడో చూశావా ?

ఇందుకు నేనొక ఉదాహరణ చూశాను. 1977లో దివిసీమలో ఉప్పెన వచ్చింది నీకు తెలుసుకదా ! మన కళ్ళముందు జరిగిన జల ప్రళయమది. జననష్టం, ధననష్టం పెద్ద ఎత్తున జరిగింది. చిత్రమేమిటంటే సహాయ కార్యక్రమాలు కూడా అన్నివైపుల నుండి అంత పెద్ద ఎత్తునా జరిగాయి. అప్పుడేం జరిగిందో తెలుసా ? దాతృత్వ స్వభావం కలిగిన వాళ్ళు, తాము ఈయదలచిన ధన సంపదల్ని ప్రభుత్వాని కీయకుండా,

'రామకృష్ణా మిషన్' లాంటి స్వచ్ఛంద సేవా సంస్థలకు సమర్పించు కొన్నారు. అంటే ఏమిటన్నమాట ? ప్రభుత్వం పైన కన్నా స్వచ్ఛంద సేవా సంస్థలపైన వాళ్ళు తమ విశ్వాసాన్ని ఉంచారన్నమాట. వాళ్ళు ఉంచి నట్లుగానే ఆ స్వచ్ఛంద సేవా సంస్థలు చక్కటి క్రమశిక్షణతో ఆ నిధులను సద్వినియోగం చేశాయి. మనం కూడా అలాంటి విశ్వాసాన్నే ప్రజల నుండి చూరగొనగలగాలి.

మనకు లభించిన శక్తియుక్తుల్ని, క్రమశిక్షణతో సద్వినియోగం చేస్తున్న కొద్దీ, ఆర్థిక వనరులు ప్రజల నుండి వాటికవిగా ఆనందోత్సాహాలతో నడిచి వస్తాయి. మన ప్రవర్తన క్రమశిక్షణాయుతమై, సేవా భావంతో లోకహిత కార్యక్రమాలపైపు మళ్ళుతున్న కొద్దీ, లోకరూపంలో వ్యక్తమవుతూ ఉన్న ఆ దైవం మనను అభిమానిస్తాడు. మనకు సహాకరిస్తాడు. మనతో సహావసిస్తాడు. ఏమంటావ్ ?"

ఆ యువకునితోపాటు అందరూ ఒక విధమైన దివ్యానుభూతిని పొందారు. ఏదో నూతన చైతన్యం తన కౌగిలిలోనికి వారిని స్వీకరించి నట్లయింది. ఆ చైతన్యమే మనతో సహాకరించటం కోసం ఇలా స్వామిగా రూపుకట్టిందా! అని అనిపించింది. వెన్ను తట్టేవాడుంటే వెనుకబడేవాడు ఎవడుంటాడు అని అనిపించింది.

మధురమైన ఆ సన్నిధిలో, మంద్రమైన ఆ అనుభూతిలో మౌనంగా ఉండిపోయాం కొంతసేపు. మౌనాన్ని వారు పాటించలేదు. మౌనమే వారిని తనలోనికి స్వీకరించింది.



## అమలుపరచండి

సినీ రంగంలోని పాటల రచయితలలో స్వామికి సన్నిహితులైన వారు ఒకరు ఉన్నారు. ఆయన తరచు స్వామిని వచ్చి కలుస్తూ ఉండటం, అనేక అంశాలపైన స్వామితో ముచ్చటిస్తూ ఉండటం, ఆచరణకు కావలసిన సూచనలను స్వామినుండి అందుకుంటూ ఉండటం. వాటిని అమలు పరుస్తూ వచ్చిన ఫలితాలను ఎప్పటి కప్పుడు స్వామికి చెపుతూ ఉండటం చేస్తూ ఉంటారు.

ఒకరోజు మధ్యాహ్నం ఆయన వచ్చి కూర్చొని మాటల మధ్యలో, 'మీరీసారి మళ్ళీ నాకు అవసరమైన సూచనలు చేయండి. ఇంతవరకు మీరు చేసిన సూచనలన్నీ నేను అమలుపరుచుకుంటూ వస్తున్నాను కదా! అలా అమలు పరుస్తున్నందు వలన నాలో చక్కని మార్పు వస్తున్నట్లు నేను గమనించాను. మీరూ గమనించినట్లు చెపుతున్నారు కదా ! కాబట్టి ఈసారి మీరు అవసరమనిపించిన సూచనలు చేస్తే శ్రద్ధగా వాటిని అమలుపరిచే ప్రయత్నం చేస్తాను' అన్నాడు.

ఆయనలోని ఆర్తిని గమనించిన స్వామి సరస గంభీరవదనులై ఇలా అన్నారు : చూడండీ! మీ మనస్సులో ఏ మూలనో 'నాది కాని పనిని నేను చేస్తున్నాను! అన్న భావన ఉంది. ఆ భావన వీలు దొరికినప్పుడల్లా మీ మనస్సు పైపొరలలోనికి వచ్చి, అవకాశమున్నంతసేపు మిమల్ని కలవరపెట్ట గలుగుతోంది. ఆ భావనను సన్యసించండి. మీరు దైవాన్ని నమ్మినవారు. ధర్మాన్ని అనుష్ఠిస్తున్నవారు. అలాంటప్పుడు మీది కాని పని మీ దగ్గరకు ఎలా వస్తుంది? మీ జీవ లక్షణంతో ముందుకాలంలో పెద్ద ఎత్తున కార్యక్రమాన్ని రూపొందించదలచిన దైవం, దానికి కావలసిన వేదికను మీ చుట్టూ ఇప్పుడిలా ఏర్పాటు చేస్తున్నాడు-' అని గమనించండి. కనుక ఇక అలాంటి భావనను రానీయకండి.

అలాగే నన్నట్లుగా వినమ్రతతో తల ఊపారాయన.

స్వామి ఇంకా ఇలా అన్నారు : చూడండి. మరొక్క నియమాన్ని కూడా మీరు పాటించండి. జీవితంలో పతనమైపోతున్నవారు మీకు తారస పడినప్పుడు, వారు మీకెంత ఆప్తమిత్రులైనా సరే, మనం చెప్పిన మాట వినిపించుకుంటారు అన్న విశ్వాసం మీకు ఉన్నప్పుడే వారికి మాటతో చెప్పండి. లేనప్పుడు చెప్పకండి. వారిని గూర్చి దైవాన్ని ప్రార్థించండి. 'అవతలివారిలో మనం చెప్పింది రిసీవ్ చేసుకునే రిసీవింగ్ పోల్ ఏర్పడి ఉన్నది' అని మనకు రూఢి అయినప్పుడే మనం చెప్పదలచింది వారికి మాటలతో చెప్పాలి. 'వారిలో అలాంటి రిసీవింగ్ పోల్ ఇంకా ఏర్పడలేదు, అని మనకనిపించినప్పుడు వారిని మంచి దారిలోనికి మళ్ళించమని దైవాన్ని ప్రార్థిస్తూ, మన ప్రేమతో వారిని స్పృశించడమే మనం చేయ వలసిన పని. చూడండీ! వాక్కు అనేది వ్యక్తీకరణల్లో ఒకటి మాత్రమే! దానితోనే అన్నింటినీ సాధించాలని లేదు. దానికి అవకాశమున్నచోట దానిని వినియోగించుకుంటాం. మిగిలినచోట్ల మనలో మిగిలిన వ్యక్తీకరణ మార్గా లున్నాయే! వాటిని వినియోగించుకుంటాం. కనుక సిద్ధంగా లేని వారికి నోటితో చెప్పి ఇబ్బంది కలిగించకండి.

'అన్నింటికన్నా మించినది మనలోని సంకల్ప శక్తి. ఆతడు బాగు పడాలని మనకు ఒక సంకల్పం కలిగింది. ఆ సంకల్పం కన్నా మించిన దంటారా మన వాక్కు? ఆ సంకల్పం యొక్క ఒకానొక కిరణమే కదా! అదీ చూడండీ! అరవిందుడు ఇప్పుడు నేను చెప్పిన లాంటి సంకల్ప శక్తితోనే స్వాతంత్ర్యోద్యమానికి దోహదం చేశాడు. జాతి జనుల గుండెలలోనికి సంకల్పరూపుడై ప్రవేశించాడు. తన పుట్టినరోజు పండుగ నాడు భారతమాత బంధనాలను ఊడగొట్టాడు. కనుక సంకల్పశక్తికి ఉన్న బలం అమోఘమైనది. ఇప్పుడు నేనున్నాను. జాతి పునర్నిర్మాణ ఉద్య మాన్ని తలపెట్టాను. భౌతికంగా నేను ఎంత చేయగలను? ఎందరికి చేయ గలను? ఎన్ని చోట్లకు వెళ్ళగలను? ఎంతమందికి చెప్పగలను? ఇవన్నీ

సాధ్యమైనంతవరకు వాళ్ళు వంచి చేస్తాను. కాని, వీటి అన్నింటినీ మించిన సంకల్పశక్తితో మానవజాతిలోనికి నేను వ్యాపిస్తున్నాను. ఈ సత్యాన్ని గమనించండి. గమనించి అమలు పరచండి. అప్పుడు ఎవ్వరూ 'హర్టు'కారు. అందరూ 'ఎలర్ట్' అవుతారు.

చివరిగా ఒక సూచన. 'మీరు వేసుకున్న ఈ వేషంలో కూడా మార్పు రావాలి. మీ జీవ లక్షణానికి తగిన వస్త్రధారణ మీరు చేయాలి. ఇప్పుడు మీరు అందరూ వేసుకుంటున్న డ్రస్సులనే అందరిలాగానే వేసుకుంటున్నారు. ఇందులో కొంచెం మార్పు తీసుకురండి. మీకు తగిన మార్పు తీసుకురండి. ఆహార్యాన్ని మన జీవ లక్షణానికి తగినట్లుగా మలచుకోవడం కూడా అవసరమే. కర్తవ్య నిర్వహణకు అది కూడా దోహదం చేస్తుంది'.

అలాగేనంటూ వినమ్రుడై మళ్ళీ తల వంచాడాయన. కొద్ది క్షణాల తరువాత ఇలా అన్నాడు : ఈ క్షణాలు నా జీవితంలో మరుపు రానివి. సంధ్యావందన సమయంలో ఎంతో ప్రయత్నం మీద ఏ కాసిని క్షణాల్లో అనుభవించే దివ్యానుభూతిని ఇప్పుడు, ఇక్కడ, ఇలా జాగ్రద వస్థలో ఉండగానే, ఇంద్రియాలతో ఇన్నింటినీ గమనిస్తూనే, ఇంతసేపటి నుండి నిరాఘాటంగా అనుభవిస్తున్నాను. నిజంగా నాకు చాలా ఆనందంగా ఉంది. ఈ క్షణం నుండే మీరిచ్చిన ఈ సూచనలను అమలు పరచేటందుకు సంసిద్ధుడనవుతున్నాను.

కొద్దిక్షణాలు సన్నివేశంలోని అందరూ అదే అనుభూతిని పొందుతూ అలాగే ఉండిపోయారు.



# ఆరాలు తీస్తోందా

'ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి ? మా కథంతా మీరు విన్నారు కదా! ఈ సమాజం మమ్మల్ని వెన్నాడుతోంది. వెన్నాడి వేధిస్తోంది. మేము ఎవరి సొమ్ము తిన్నామని ఈ వేధింపు. ఎవరినేమన్నామని ఈ వేధింపు. మా బ్రతుకేదో మేం బ్రతకడానికి ప్రయత్నిస్తుంటే బ్రతక నివ్వరే? అద్దిచ్చినా ఇల్లు ఇవ్వడానికి కూడా కష్టంగా ఉంది ఈ సమాజా నికి. ఈ సమాజం మామీద ఎందుకింత కక్ష కడుతోంది?', ఇలా తీవ్రంగా మాట్లాడుతూ ఊగిపోతున్నదామె. ఆమె ప్రక్కన ఆమె భర్తకూడా ఉన్నాడు. దీనంగా ఏదో ఆలోచిస్తున్నాడు. వాళ్ళిద్దరిదీ వర్ణాంతర వివాహం, ప్రేమ వివాహం. గత కొన్ని సంవత్సరాలుగా కుటుంబపరం గాను, సమాజపరంగానూ ఇబ్బందులు పడుతున్నారు వాళ్ళు. అతనిదీ కొంచెం తట్టుకునే స్వభావం. ఆమెది కొంచెం ఆవేశాత్మకమైన తత్త్వం. స్వామితో వివరంగా మాట్లాడటానికి ఇలాంటి అవకాశం కోసం ఆమె ఎప్పటినుండో ఎదురు చూస్తున్నది. అతను కూడా స్వామితో అన్నీ చెప్పు కొని ఉపశమనాన్ని పొందాలని చూస్తున్నాడు. ఇవాళ వాళ్ళకి దొరికింది. ఇప్పటికి దాదాపు రెండు గంటల నుండీ వాళ్ళు చెబుతూనే ఉన్నారు స్వామికి. స్వామి ఓర్పుగా వింటున్నారు. సామాన్యంగా ఎదుటివాళ్ళు చెప్పటం పూర్తయ్యేదాకా స్వామి పెదవి విప్పరు. ఇక అవతలవాళ్ళు ఎప్పటికీ ఆపరు అని తోస్తేమాత్రం మధ్యలో వాళ్ళను ఆపి, కథ నడి పించటం కోసం మాట్లాడుతారు. మీరు చెప్పవలసిందంతా పూర్తయిందా ? అన్నట్లు చూశారు స్వామి.

'ఇంతకంటె ఇంకేమి చెప్పగలం' అన్నట్లు చూశారు వాళ్ళు. స్వామి ఇలా అన్నారు : మీ పరిస్థితి నాకర్థమైంది. నేను చెప్పబోతున్న ఈ మాటలు మీరు ప్రశాంతంగా వినండి. లోకరీతికన్నా కొంత భిన్నంగా

ప్రవర్తించారు మీరు. దానితో లోకం మిమ్మల్ని తప్పు పట్టింది. దానికి మీరు బాధపడుతున్నారు. ఇక్కడ కొన్ని అంశాలను మనం సూక్ష్మంగా ఆలోచించాలి. లోకరీతికన్న భిన్నంగా ప్రవర్తించినపుడు ఇలా ఎందుకు ప్రవర్తించవలసి వచ్చింది? అని లోకం అడుగుతుంది. దానికి తగిన జవాబు దొరికితే లోకం ఇక మాట్లాడదు. లేదా దొరికేంతవరకూ అది ప్రశ్నిస్తూనే ఉంటుంది. మీరెందుకిలా చేయవలసి వచ్చిందా అని. ఆ ప్రశ్నించడాన్నే మనం తప్పు పడుతోంది అంటున్నాం. కక్ష కడుతోంది అంటున్నాం. నిజమే పరిస్థితి అంత దారుణంగానూ ఉంటుంది. ప్రశ్నకు జవాబు దొరికితేమాత్రం కథ మలుపు తిరుగుతుంది. మీకు నేను చెప్పేవి రెండంశాలు. నిజంగా మీరు ప్రేమించి పెళ్ళిచేసుకొని ఉంటే ఈ లోకం యొక్క సతాయింపును మీరంతగా పట్టించుకోవలసిన పని లేదు. పట్టించుకోరు కూడా! మీలో ఎక్కడో ప్రేమపాలు తగ్గితేనే ఈ ఘోషలు మీకు వినబడే సందు దొరుకుతుంది. ఇక రెండో అంశం. ఈ మీరేర్పరుచుకున్న అనుబంధం ఆధారంగా లోకహితాన్ని గనుక మీరు పెద్ద ఎత్తున సాధించినట్లయితే లోకం ఇక మిమ్మల్ని ప్రశ్నించదు. ఎందుకని ప్రశ్నించదు? దాని ప్రశ్నకు జవాబు దొరికింది కనుక! ఈ పని చేయటానికి మీరు పుట్టారు అని అది గ్రహించింది గనుక!

కనుక మీరు శ్రద్ధ పెట్టవలసింది ఈ రెండు అంశాల మీదనే. ఒకటి మీరు ఏ ప్రేమతో దగ్గరయ్యారో ఆ ప్రేమ మీ మధ్య రోజు రోజుకు పెరగాలి తప్ప తగ్గకూడదు. అది నిజంగా ప్రేమే అయితే పెరగడానికే ఇష్టపడుతుంది. తరగడానికి దానికి ప్రాణమొప్పదు. రెండవది, ఏర్పడిన ఈ అనుబంధాన్ని లోక శ్రేయస్సును సాధించడానికి అంకితం చేయడం! అలా చేయగల్గిననాడు సమాజం మిమ్మల్ని తప్పు పట్టదు సరిగదా, ఆరాధిస్తుంది. అలా ఆరాధన పొందే స్థితికి ఎదిగేటందుకు మీరు సిద్ధపడేవరకూ అది ఆరాలు తీస్తూ కూర్చుంటుంది.

ఈ సందర్భంలో మీకొక ఉదాహరణ చెప్తాను. ఈ ఊర్లోనే ఒక వేశ్యకు పుట్టిన బిడ్డ పెరిగి పెద్దదై డాక్టరైంది. డాక్టర్ ప్రాక్టీస్ పెట్టిన తరువాత పేరు మోసిన ఒక వ్యాపారస్తుని వివాహం చేసుకుంది. అప్పటికే ఆమె వైద్య వృత్తిలో నిలబడి తన సామర్థ్యాన్ని సేవా భావంతో సద్వినియోగంచేస్తూ ఉండటంతో ఈ సమాజం వారి వివాహానికి హర్షించి కానుకలను అర్పించందే తప్ప తప్పు పట్టలేదు. క్రమంగా ఆమె హస్తవాసి మంచిదనే పేరు వచ్చింది. సమాజంలోని అన్నివర్గాలవాళ్ళు ఆమె సేవను పొందుతూ ఆమెను ఒక దేవతగా చూడసాగారు. ఆమెచేత పురుడు పోయించుకోవాలన్న కోర్కెతో భాగ్యవంతులూ, ఉన్నత వంశాలవారు, కోరి మరీ వస్తుంటారు. ఆమె హస్తవాసి అంతటిదీ! ఆమె విషయంలో సమాజం ఎందుకని తప్పు పట్టలేదు. పట్టకపోగా ఎందుకని ఆరాధించింది? ఆలోచించండి! ఊరికే ఉత్తి పుణ్యానికి మార్పులు చేస్తే ఎందుకు చేయవలసి వచ్చింది అని ప్రశ్నిస్తారు. అది సహజం. ఆ మార్పువల్ల పెద్ద ఎత్తున ప్రయోజనం వ్యక్తమైనప్పుడు ఇందుకు గదా ఈ మార్పు జరిగిందని గ్రహించి హర్షిస్తారు. ఆరాధిస్తారు. ఆమె కథ మనకు తెలియచెప్తున్న సత్యమిదే! మీ దాంపత్యాన్ని మీరూ అలా సద్వినియోగం చేసుకోండి. అప్పుడు ఈ లోకమే మీకు జేజేలు పలుకుతుంది. సమాజం ఎదగాలని మీరంటున్నారు. సమాజంచేత ఆరాధింపబడే స్థాయికి మీరు ఎదగాలని నేనంటున్నాను.

కొన్ని క్షణాలు నిశ్శబ్దం. ఆ దంపతులు ఆత్మ పరిశీలనకు అవకాశం కల్గిస్తున్న నిశ్శబ్దమదీ.

స్వామి మళ్ళీ ఇలా అన్నారు : నాకనిపిస్తుంఢికదా! మనిషి ఒక స్థాయి దాటి ఎదిగేవరకే ఈ సమాజం, ఈ మనిషి ఎక్కడివాడు ? ఏ కులంలో పుట్టాడు ? ఏం చేస్తున్నాడు ? ఎంత సంపాయించాడు ? ఇలాంటి వన్నీ అడుగుతుంది. ఆ స్థాయి దాటి ఎదిగిన తర్వాత ఈ సమాజం అత్త

దిని ఏమీ అడగదు. వివేకానందుడు, గాంధీమహాత్ముడు, లాల్ బహదూర్, అంబేద్కర్ లాంటి వాళ్ళ విషయంలో వారికి నమస్కరించేటప్పుడు వారిని గౌరవించేటప్పుడు ఈ సమాజం వారెక్కడ పుట్టారని చూస్తున్నదా? ప్రశ్నిస్తున్నదా? వైష్ణవ సంప్రదాయానికి ప్రవక్తలైన ఆళ్వారులలో నిమ్నజాతుల వారెందరో ఉన్నారు. మరి వారికి కులం అడ్డు వచ్చిందా? ఆలోచించండి.

ఇవాళ ప్రతిమనిషి తనని నలుగురూ గుర్తించాలని, గౌరవించాలనీ కోరుతున్నాడు. అలా కోరడంలో తప్పులేదు. కానీ, ఆ గుర్తింపు, గౌరవం లభించాలీ అంటే అతడు ఆ లోకం యొక్క హితాన్ని కోరి జీవించాలి. అందుకతడు సిద్ధపడాలి! ఏమంటారు?

మనం నిజంగా సమాధానం కోరిన వాళ్ళమయితే ఒక అంశానికి సంబంధించి అన్ని కోణాల నుండీ పరిశీలించాలి. ఏదో ఒక కోణం నుండి చూడటానికి అలవాటు పడిపోయి, అదే కరక్ట్ అనుకుంటే, ఇంకో కోణం నుండి చూసేవాడితో ఘర్షణ తప్పక వస్తుంది. ఇంకో కోణం నుండి చూసే వాళ్ళతో మనం ఏకీభవించక పోవచ్చు. కానీ వాళ్ళకలా ఎందుకనిపిస్తుంది? అన్న దాని మీదల మనకు అవగాహన ఉండాలి. అవగాహన ఉన్నచోట ఘర్షణకు తావులేదు. ఇలాంటి అవగాహన పెంపొందించుకున్న నాడు ఒక అంశాన్ని గూర్చి అన్ని కోణాల వారి ఆలోచనలను మనం అవగాహన చేసుకోగల్గుతాం. ఆ అవగాహనతో మన కర్తవ్యానికి రూపు దిద్దుకోగల్గుతాం. ఇక అక్కడ రాగద్వేషాలకు తావుండదు. ఇలాంటి అవగాహనతో ముందుకు సాగడానికే మన పెద్దలు 'విశ్వప్రేమ' అని పేరు పెట్టారు. ప్రేమ మార్గాన పయనించండి అన్నారు. కొంచెం పై నుంచి చూస్తూ ప్రేమతో అందరినీ అర్థం చేసుకోండి అన్నారు. కనుక మీ జీవితాలు సమాజాన్ని ద్వేషించడానికై వెచ్చబెట్టకండి. సమాజం చేత 'భేష్' అనిపించుకునే స్థితికి ఎదగడానికై మీరు దీక్ష పూనండి.

కోరి వచ్చారు మీరిక్కడికి. మీకు కావలసిన సమాధానం దొరికింది అనుకుంటున్నాను. మీ శ్రేయోభిలాషిని నేను. మీ శ్రేయస్సును కోరి చెప్పాను. మిమ్మల్ని సమర్థించలేదు నేను. అందుకు మీరేమీ అనుకోరు కదా! సమర్థిస్తే నేను మీకు సపోర్టర్ నవుతాను. మీరేం చేస్తే బాగుం టుంది అన్న అంశం చెప్పాను. ఒక గైడ్‌గా ప్రశాంత జీవనానికి మీకు మార్గం చూపదలిచాను. ఏమంటారు ?

ఆ దంపతుల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి : అప్రయత్నంగా ఒకేసారి చేతులు జోడించి వారిలా అన్నారు. సమర్థించేవారు, వ్యతిరేకించేవారు కూడా ఎక్కువ సంఖ్యలోనే దొరుకుతారు మాస్టరుగారూ! గైడ్ చేసేవారు లేకనే ఇంతవరకూ మేం శోభననుభవించాం. ఇపుడు మాకాలోటు తీరింది. మీరొక్కరూ మాకు వేయిమంది పెట్టు. మీ చల్లటి చూపులతో మమ్మల్ని పెంచండి. మనుష్యులను చేసి నిలబెట్టండి. మీతో కలిసి నడిచే అవకాశాన్ని వ్వండి" అంటూ స్వామి పాదాలకు నమస్కరించారు వాళ్ళు.

ఇక మీరు బెంగపడవలసిన పనిలేదు. పాజిటివ్ థింకింగ్‌తో ముందుకు సాగండి. ఆ థింకింగ్‌ను అనుగ్రహించే ప్రేయరుకు సమయ మైంది. రండి! అంటూ ప్రేయరు హాలులోనికి దారితీశారు స్వామి.



## మీకేనా - నాకూనా

సోదర బృందంలోని వారొకరు తమ ఇంట్లో పెట్టుకోవడం కోసం మాష్టరు గార్ల ముగ్గురి ఫోటోలను ఫోటో ఫ్రేములలో నీట్‌గా ఫిట్ చేయించారు. చూస్తున్నవారిలో కొందరు 'మన మాష్టరుగారి ఫోటో చాలా బాగా ఉంది' అని మరీ మరీ చూస్తున్నారు. ఏదీ అది? అని అడిగి తీసుకుని ఆ ఫోటోను అలా చూస్తూ ఉండిపోయారు. స్వామి కూడా కాసేపు చుట్టూవున్న సోదర బృందం ముఖాలలో ఆశ్చర్యానందాలు వెల్లువెత్తుతున్నాయి. స్వామి తమ ఫోటోను తామే అంత ఇదిగా చూస్తున్నందుకు "చాల బాగా వచ్చింది. చక్కగా ఉంది" అన్నారు స్వామి ఆ ఫోటోను చూస్తూనే. ఆ మాటలకు ఆ బృందంలోని ఒకరిద్దరికి నవ్వొచ్చింది. "ఎందుకు నవ్వుతున్నారు?" అన్నారు స్వామి.

"మీ ఫోటోను చూసి మీరే అలా అంటున్నారు కదా! అందుకనే" అన్నారు.

ఫోటోను ప్రక్కనున్న వారికి అందిస్తూ స్వామి ఇలా అన్నారు: "ఒకసారి రమణమహర్షి ఆశ్రమంలో ఒక చిత్రం జరిగింది. ఆయన సోఫాలో విశ్రాంతి తీసుకుంటున్నారు. భక్తులు ఆయన పాదాలు వత్తుతున్నారు. వచ్చిపోయే భక్తులకు మహర్షి పాదాలకు కాసేపయినా సేవ చేసుకోవాలని తపన. ఆ సేవ చేసుకుంటే పాపం పోతుంది. పుణ్యం వస్తుంది. మానవ జీవితానికి పరమావధి ఏదో దాని కదిగా నడిచి వస్తుంది. అని వారి విశ్వాసం. పాదసేవ జరుగుతూ ఉండగా మధ్యలో మహర్షి చుట్టూ ఉన్నవారిని చూస్తూ, 'కాసేపు మీరలా ఉండండర్రా' అన్నారు. వారంతా ఒక్కసారిగా ఆశ్చర్యపడుతూ అలా కొంత దూరంగా కూర్చొని ఉన్నారు. ఇంతలో మహర్షి ఒక్క ఉదుటున ముందుకు వంగి తమ కాళ్ళను తామే నొక్కుకోవడం ప్రారంభించారు. భక్తకోటికి మరింత

ఆశ్చర్యం వేసింది. వారి స్థితిని గమనించిన మహర్షి ఇలా అన్నారు. 'పుణ్యమంతా మీకేనా ? నాకూ రావద్దూ ?' అని. అలాగే నేను ఇప్పుడు అంటున్నాను. 'ముచ్చటంతా మీకేనా ? నాకూ రావద్దూ,' అని. సోదర బృందం ముఖాలలో సంతోషం సంబరం జరుపుకుంటోంది.

## పంచాంగం కథ

డిస్పెన్సరీలో కూర్చుని ఉన్నారు స్వామి. వైద్యసేవ ఇక ప్రారంభం కాబోతుంది. ముందుగా కార్యకర్తలతో ముచ్చటలాడుతున్నారు స్వామి.

ఆ ముచ్చటల్లో భాగంగా ఒక కార్యకర్త అడిగాడు. 'మాష్టరుగారూ, మాటిమాటికీ పంచాంగాలూ అవీ చూడటం అవసరమంటారా ?

చిరునవ్వు నవ్వుతూ స్వామి ఇలా అన్నారు. పనిచేయటంలో పద్ధతి ఉంటే, పంచాంగంతో పెద్ద పని ఉండదు. జరగవలసిన సంఘటన, దాని ముహూర్తాన్ని అదే నిర్ణయించుకుంటుంది. ఈ సత్యాన్ని తెలియజెప్తూనే జిల్లెళ్ళమూడి అమ్మ, 'అయ్యిందే ముహూర్తం నాన్నా!' అంది. ఆ మాటలో చాల అర్థం ఉంది.

పంచాంగానికి ఇంత ప్రాధాన్యమిస్తారు కదా! మనవాళ్ళు అంత ప్రాధాన్యమూ ప్రవర్తనకిస్తే ఎంత బాగుంటుందీ అనిపిస్తుంది నాకు. మన ప్రవర్తనను మనం సరిచూసుకుంటున్నప్పుడు దినచర్యలో ఏ సన్నివేశానికి తగిన ముహూర్తం ఆ సన్నివేశానికి ప్రకృతి చేత ఏర్పాటు చేయబడుతూనే ఉంటుంది. అప్పుడు ఆ జాగ్రత్తలో ప్రకృతే పడుతుంది.

పనులు అవ్వటానికి, కాకపోవటానికి మెలికలేవో మన ప్రవర్తనలోనే ఉంటాయి. మనిషి ఆ మెలికలను సరిచేసుకోవటంమీద తన శ్రద్ధనంతా

పెట్టగలగాలి. కానీ, తన చేతిలో లేని గ్రహగోళాల మీద చూపిసంత ఆత్రృతగా, తన చేతిలో ఉన్న ప్రవర్తనవైపు చూడలేక పోతున్నాడతను. ప్రవర్తనను సరిచూసుకుంటున్న వాడికి గ్రహగతులు వాటి కవిగా కలిసి వస్తాయి. లేనప్పుడు మనం ముహూర్తం పెట్టినా, దానిని తప్పించటం ఎలాగో వాటికి బాగా తెలుసు. గ్రహాలు తనకు కలిసిరావాలని అంతగా కోరుకుంటున్నాడు కదా! ఆ గ్రహాలు మనిషితో ఏమంటున్నాయో తెలుసునా ? 'మనిషీ ? నీకు నీవు కలిసిరావడం చేతనయితే, మేమందరం నీకు కలిసి వచ్చినట్లే' అని.

'ఇదీ పంచాంగం కథ. ఇక ఇప్పుడు జరుగవలసిన కథలోనికి వెళదామా ?' అంటూ స్వామి కేస్‌షీట్ల ఫైళ్ళను అందుకున్నారు.

## వినాయక విజయం

అదీ వరంగల్లులోని వినాయక చవితి నవరాత్రుల పందిరి. వరంగల్లు ప్రాంతంలో విశేషంగా జరిపే ఉత్సవాల్లో వినాయకచవితి నవరాత్రులు ఒకటి. ఆ పట్టణం పరిధిలోపల ఎన్నెన్నో వినాయకుని పందిళ్ళు వెలుస్తాయి. ఎన్నెన్నో సైజుల్లో వినాయకుడు కూడా ఆ పందిళ్ళలో కొలువు దీరుస్తాడు. ఒక ప్రత్యేకమైన కమిటీ ఈ పందిళ్ళ నన్నింటినీ పరిశీలించి, చివరి రోజున బహుమతులను కూడా ఇస్తుంది. ఆ కమిటీ వారు, తాము ప్రత్యేకంగా నిర్వహించే వినాయకుని పందిరిలో స్వామి ప్రవచనం ఏర్పాటు చేయబడింది. వినాయకుని గూర్చిన విశేషాలను సమన్వయించి శ్రోతలకు అందించారు. స్వామి సృష్టిని నిర్వహించే ముగ్గురమ్మలతోనూ అతనికి ఎలాంటి అనుబంధం ఉన్నదో బొమ్మకట్టేట్లు చెప్పారు. శ్రోతలు పరవశించారు.

ప్రవచనం పూర్తి కాగానే స్వామి వేదిక దిగి ఆ ప్రక్కగా నున్న కుర్చీలో ఆసీనులయ్యారు. నమస్కారాలు చేసేవాళ్ళు నమస్కారాలు చేస్తున్నారు. అభినందనలు తెలిపేవాళ్లు అభినందనలు తెలుపుతున్నారు. తమను తాము పరిచయం చేసుకునేందుకు వచ్చినవారు పరిచయం చేసుకుంటున్నారు. పట్టణ పెద్దల్ని కమిటీ సభ్యులు తీసుకుని వచ్చి మరీ పరిచయం చేస్తున్నారు. కొంచెం దూరంగా కుర్రవాడొకడు నిల్చొని ఉన్నాడు. కొంచెం సందు చూసుకుని 'మీతో మాట్లాడాలని ఉంది' అన్నట్లుగా స్వామి వైపు చూస్తున్నాడతను. ఎవరికి తగినట్లుగా వారితో ప్రవర్తించి, అందరినీ తృప్తి పరచిన స్వామి ఆ పైన ఆ కుర్రవాడిని చూపులతోనే పిలిచారు. అతడు నడిచి వచ్చాడు. వచ్చి వినమ్రుడై నిలుచున్నాడు. పరిచయ వాక్యాలయినాయి.

కొంచెంసేపు నిశ్శబ్దం.

"కావలసినది అడుగు. సందేహమెందుకు ?"- అన్నట్లుగా చూశారు స్వామి అతనివైపు.

ఆ ప్రోత్సాహం అతడందుకున్నాడు. అందుకొని ఇలా అన్నాడు : 'మీరేమీ అనుకోరు కదా !! నేనొకటి అడుగుతాను'

'ఏమనుకుంటాను ? అడిగావనుకుంటాను' - అన్నారు స్వామి.

కుర్రవానికి నవ్వొచ్చింది. కొంత ఈజ్‌లోనికి వచ్చాడు. వచ్చి ఇలా అన్నాడు : 'ఈ పాతకాలపు పండుగలు ఇంకా ఎందుకండీ !' ఈ పురాణాలూ, ఇతిహాసాలూ ఇంకా అవసరమంటారా ? రాముడు, కృష్ణుడు అంటూ ఇంకా చెప్పుకోవాలంటారా ? ఏనాడో జరిగిన ఆ కథలెందుకు ? ఈ మధ్య జరిగిన కథల్ని చెప్పుకుంటే చాలదా ? శివాజీ ఉన్నాడు. రాణా ప్రతాపుడున్నాడు. అలాంటి వీరుల చరిత్రలు చాలవా ! మనం ప్రేరణ పొందడానికి ? వాటిని విడిచి ఎక్కడికో వెనక్కి వెళ్లాలంటారా ? నా

కెందుకో అవన్నీ అవసరం లేదనిపిస్తుంది. మీలాంటి పెద్దలేమో వాటిని గురించి విశేషంగా చెబుతూ ఉంటారు. నాకనిపిస్తుంది కదా! మీ లాంటి పెద్దలు కూడా ఆ పాత కథలను విడిచిపెట్టి, ఈ వీర పురుషుల కథలను ఎక్కువగా చెబితే బాగుంటుందని. ఈ వీరులు మన ధర్మానికి ఎంతో చేశారు కదా! వాళ్ళు చేసిన త్యాగాలు, చూపిన ప్రతాపాలు ఎన్నో ఉన్నాయి కదా! ఇవన్నీ చాలవంటారా? ఇంకా వెనక్కి వెళ్ళాలంటారా? వెనక్కి వెళ్ళటం అంత అవసరమంటారా?"

ఆ కుర్రవాడు అలా జిజ్ఞాసతో చూస్తూ నిలుచున్నాడు - స్వామి ఏం చెపుతారోనని.

ఆతడి కన్నులలోనికి సూటిగా చూస్తూ చిరునవ్వుతో స్వామి ఇలా అన్నారు : మంచి ప్రశ్న వేశావు. నీ వన్నట్లు ఒక శివాజీ, ఒక రాణాప్రతాప్ ఈ ధర్మానికి ఎంతో చేశారు. తమ శౌర్య ప్రతాపాలను ధారపోశారు. నిజమే. వారిని స్మరించుకోవటం మన అవశ్య కర్తవ్యం. అయితే, వారు ఏ ధర్మం కోసం త్యాగాలు చేశారో, ఏ ధర్మ రక్షణ కోసం కంకణధారులై ప్రచండశూరులై నిలిచారో, అలా నిలబడటానికి వారికి ఏ ధర్మం ప్రేరణ నిచ్చిందో, ఆ సనాతన ధర్మాన్ని గురించీ, దాని సమగ్ర స్వరూపాన్ని గురించీ, మనం తెలుసుకోవటం ఇంకా అవసరం. అలా తెలుసుకుని ఆ ధర్మానికి మనం అంకితమయినప్పుడే ఒక శివాజీ, ఒక రాణాప్రతాప్ మనని చూసి సంతోషిస్తారు. తృప్తి పడతారు. ఆ ధర్మాన్ని నిజంగా మనం అవగతం చేసుకున్నప్పుడు ఆ వీర పురుషులు ఎందుకంతటి దీక్ష పూనారో మనకు బోధ పడుతుంది. అలాంటి దీక్ష మన నుండి కూడా విజృంభిస్తుంది.

నీవు యువకుడివి. నీ ఆవేశం నాకు నచ్చింది. నేను చెబుతున్న ఈ మంచి మాటలను కూడా నీవు అవగాహన చేసుకోగలవన్న విశ్వాసం నాకుంది. ధర్మమంటే, మన సంప్రదాయమంటే నీకు ఎనలేని అభిమానం ఉందికదా! దాని రక్షణలో ఈ నీ జీవితం ధన్యం కావాలని కోరుకుంటు

న్నావు కదా! అలాంటప్పుడు మనమేం చేయాలో తెలుసునా? ఈ మన ధర్మ స్వరూపాన్ని సాకల్యంగా ఆకళింపుకోవాలి. అందుకు మనం వేదంతో ప్రారంభించి, ఈ వేళ ఈ ధర్మం కొరకు నిలబడి పనిచేస్తున్న మహనీయుల వరకూ, మన ప్రయాణాన్ని కొనసాగించాలి. అలా ప్రయాణం చేస్తున్నప్పుడు మధ్యలో నీవు పేర్కొన్న వీర పురుషులు తగులుతారు. అప్పుడు వారికి నమస్కరించి, వారి నుండి తగినంత స్ఫూర్తిని మనం పొందాలి. పొంది, ముందుకు సాగాలి. మిత్రమా! నీవు పేర్కొన్న వీర పురుషులకు అటు వెనకా, ఇటు ముందూ కూడా కథ చాలా ఉందయ్యా!

సర్వాంతర్యామి యైన భగవంతుడు ఈ సృష్టిగా దిగివస్తున్నప్పుడు ఎన్నెన్ని మూర్తులను ధరిస్తున్నాడో, వేద వాఙ్మయం మనకు వివరిస్తూ ఉన్నది. ఈనాటి మన వినాయకుడు కూడా అలా ఆయన ధరించిన మూర్తులలో ఒకడని ఇంతవరకూ నీవూ విన్నావు కదా! ఈ వినడంలో శ్రద్ధ పెడితే బ్రహ్మ, విష్ణువు, శివుడు, కుమారుడు, వినాయకుడు — ఇలా వీళ్ళందరూ సృష్టి నిర్వహణ కోసం ఆ దైవం ధరిస్తున్న మూర్తులేనని మనకు స్పష్టమవుతుంది. ఏ ద్వారం ద్వారా నైనా ఇంటిలోనికి ప్రవేశించినట్లుగా ఏ మూర్తిని ఆరాధించి అయినా ఆ దైవ సాన్నిధ్యాన్ని మనం పొందవచ్చును అని తెలుస్తుంది. అలా తెలుసుకున్నప్పుడు దేవుడి పేరిట మతాలు ఉండవు. శైవ సంప్రదాయం, వైష్ణవ సంప్రదాయం, శాక్తేయ సంప్రదాయం — అనే అనుష్ఠాన విధానాలుంటాయే తప్ప, ఆ మూర్తుల పేరిట మతాలను సృష్టించుకునే దుర్బుద్ధి మనకు పుట్టదు. ఆ మూర్తులను వేరుగా చూసుకునే అవివేకమూ మనకు కలుగదు. ఇలా వినాయకచవితి లాంటి సంప్రదాయ సిద్ధమైన పర్వదినాలను ప్రతి సంవత్సరం చిత్తశుద్ధితో జరుపుకోవడం అందుకు పనికి వస్తుంది.

ఇక శ్రీరాముడు, శ్రీకృష్ణుడూ మొదలైనవారు భూమిమీద జరుగవలసిన ధర్మ సంస్థాపన కోసం దైవం నుండి వ్యక్తమైన అవతార

మూర్తులు—తాము దిగివచ్చినప్పుడు దుష్టులను శిక్షించడం, శిష్టులను రక్షించటమే కాకుండా నిత్య జీవితంలో ధర్మాన్ని అనుష్ఠించడం ఎలాగో తమ జీవితాల ద్వారా వ్యక్తం చేస్తూ ఉంటారు వాళ్ళు. భూలోక అవసరాన్ని బట్టి ఈ అవతారమూర్తులు కాలకాలాల్లో, దేశదేశాల్లో దిగి వస్తూనే ఉంటారు. ఎక్కడ దిగివచ్చినా, ఆ దేశానికో, ఆ జాతికో పరిమితం కాకుండా అన్ని దేశాలకూ, ఎల్లకాలాలకూ అవసరమైన ఉపదేశాన్ని చేస్తారు వాళ్ళు. సృష్టి, స్థితి, లయాల్లో— 'స్థితి' అనేది అంటే ఈ సృష్టి నిలబడటం అనేది విష్ణుమూర్తి కర్తవ్యం కనుక ఈ అవతారాలన్నీ విష్ణు స్వరూపాలేనని మన పెద్దలు వివరిస్తూ వచ్చారు. వారి వివరణను మనసు పెట్టి మనం అర్థం చేసుకోగలిగిననాడు అవతారమూర్తుల మధ్య మనకు తారతమ్యాలు కనబడవు. వారి పేరిట వేరుగా మతాలను పెట్టుకోవలసిన అగత్యం కూడా మనకు ఏర్పడదు. అవతార మూర్తుల జన్మదినాలను, వారికి సంబంధించిన పర్వదినాలనూ చిత్తశుద్ధితో జరుపుకోవడం వల్ల ఇలాంటి విశాల దర్శనం మరింతగా మనకు కలుగుతుంది. తెలియవలసిన వాస్తవం మనకు తెలుస్తుంది. అప్పుడు క్రైస్తవం మొదలైన మతాలుపోయి, క్రీస్తు మొదలైన అవతారమూర్తులు అందరికీ పనికివచ్చే ఆత్మీయులుగా మిగులుతారు.

ఇక మూడవ అంశం. మనకు నచ్చిన దేవతా మూర్తితోనో, అవతార మూర్తితోనో, మన ఆధ్యాత్మిక ప్రయాణానికి మనం శ్రీకారం చుడతాం. ఆ ప్రయాణం ముందుకు సాగి, నేడు మన కన్నుల ఎదురుగుండా దేవుని మూర్తులుగా పనిచేస్తున్న మహనీయుల చెంతకు మనను చేర్చగలగాలి. అప్పటివరకూ మన ప్రయాణం పూర్తయినట్లు కాదు. ఒక దేవతామూర్తిని గాని, ఒక అవతారమూర్తిని గాని చిత్త శుద్ధితో మన సారా మనం ఉపాసించినప్పుడు ఏం జరుగుతుందో తెలుసునా! ఆ దివ్య మూర్తులు ప్రస్తుతం ఈ లోకంలో దేహాన్ని ధరించి పనిచేస్తున్న ఏ మహా

నీయుడికి మన జీవలక్షణం దగ్గరగా ఉంటుందో, ఆ మహనీయుడి దగ్గరకు మనలను చేరుస్తాడు. ఇన్నాళ్ళు మనం ఉపాసించిన ఆ దేవతా మూర్తి, లేదా ఆ అవతారమూర్తి ఇలా దేహధారిగా రూపొంది, మనకు దగ్గరవుతున్నారని మనం దర్శించ గలగాలి. అంతేగాని వారినీ, వీరినీ వేరుగా చూడకూడదు. వేరుగా చూసే స్థితి నుండి వేరుగా చూసే స్థితికి మనం ఎదగాలి. ఎదగడానికి మనం అంగీకరిస్తే చాలు. కావలసిన ఎదుగుదలను వారే అనుగ్రహిస్తారు. ఇలా వేదంతో ప్రారంభమైన మన ప్రయాణం దేవతామూర్తుల మీదుగా, అవతారమూర్తుల మీదుగా నేడు వ్యక్తమై పనిచేస్తున్న దివ్య పురుషుల వరకూ సాగవలసి ఉంది. నీవు చెప్పిన వీర పురుషులు ఉన్నారే! వారు విష్ణ్వంశ కలిగిన దివ్యమూర్తులు. దేవతా సంప్రదాయం ద్వారా, అవతారమూర్తుల పరంపర ద్వారా భూమికి అందిన దివ్య జీవన మార్గం దెబ్బతిన కూడదని, దాని కొరకు కంకణం కట్టుకుని పనిచేసినవారు, 'విశిష్టమైన ధర్మదర్శనం మనకు లభించింది' - అని అనుకోగానే సరిపోదు. గ్రహించుకోంగానేసరిపోదు. దానిని అనుష్ఠించడానికి మనం మనసా, వాచా, కర్మణా అంకితం కావాలి. అలాగే అది కనుమరుగు కాకుండా రక్షించుకోవటానికి మనం మన ప్రాణాలను త్యాగం చేయడానికైనా సిద్ధం కావాలి. ధరాన్ని అనుష్ఠించే చిత్తశుద్ధీ, ధర్మాన్ని రక్షించుకోవడానికి కావలసిన త్యాగశీలం మనలో నెలకొనాలీ అంటే, మనకు అలవడాలీ అంటే ఈయన ప్రయాణం అలనాటి వేదంతో ప్రారంభించి, ఈనాటి దివ్యమూర్తుల వరకు ఆగకుండా సాగి తీరవలసిందే.

హరిహరరాయలు, బుక్కరాయల చేత విజయనగర రాజ్యాన్ని స్థాపించిన విద్యారణ్యులు, ఛత్రపతి శివాజీని నడిపించిన సమర్థ రామదాసు, ఈ సత్యాన్నే మనకు తెలియజెప్పుతున్నారు అంటే బోధపడిందనుకుంటాను. హరిహరరాయలు, బుక్కరాయలు గాని, ఛత్రపతి శివాజీగాని, అనాదియైన వేదం దగ్గర తమ ప్రయాణాన్ని ప్రారంభించి, తమనాటి మహనీయుల

వరకూ సాగివచ్చి, ఆ మహనీయుల ప్రేరణతో ధర్మానికి రక్షకులై నిలిచిన వారే కదా! ఏమంటావ్ ? అందుకనే అన్నాను. 'అటు వెనకా, ఇటు ముందూ ఇంకా మనం గమనించుకోవలసినది చాలా ఉంది'. అని శివాజీ మొదలైన వీరపురుషుల ధర్మ రక్షణ శీలాన్ని స్మరించుకోవటం ఎంత అవసరమో, ఆ ధర్మరక్షణకు అంకితం కావడానికి వారి జీవితంలో సాగిన సాధనా క్రమాన్ని కూడా గమనించుకోవడం అంతే అవసరం. ఆ గమనించుకోవడం చేతనయిననాడు, వారిలాగ మనం కూడా సాధనలో సాగి, ధర్మరక్షణకు అంకితం కాగలుగుతాము.

ఆ కుర్రవాడు విప్పారిన కన్నులతో అలా స్వామివైపు చూస్తున్నాడు. అతడిలో పొంగుకొస్తున్న పారవశ్యం ఆ కన్నుల చూపుల ద్వారా బయటకు ఉబికి వస్తోంది. "తృప్తికరమైన సమాధానం లభించిందండీ నాకు మిగిలిన వారి మాట ఎలా ఉన్నా, మీరు నాకి దర్శనాన్ని కలిగించడానికే ఇలా వరంగల్లు వచ్చారేమో! అనిపిస్తోందండీ!" అంటూ అతడు తన తృప్తిని వాక్కుల ద్వారా వ్యక్తం చేసే ప్రయత్నాన్ని చేస్తున్నాడు.

స్వామి కనులు మెరుస్తున్నాయి. స్వామి కరాలు ఆ యువకుని వెన్నును తడుతున్నాయి. స్వామి పదాలు, స్వామి పాదాలు ఇక ముందుకు సాగుదామంటున్నాయి.

# అదే గొంతు - అదే కథ

"ఎవరిదిరా ఆ వినిపిస్తున్న ఉపన్యాసం ? మనదా ? మాష్టరుగారిదా?" అడిగారు స్వామి తన గదిలోనికి ప్రవేశిస్తూ.

ఎదుట నిలబడిన సోదరుడు నిశ్చేష్ఠుడవుతున్నాడు.

'ఏం అలా చూస్తున్నావు ? ఏమిరా సంగతి ?'

'మాష్టరుగారూ ! నిజంగా మీరు కూడా గుర్తు పట్టలేరా ? ఆ ఉపన్యాసం ఎవరిదో' అడిగాడు సోదరుడు.

'నేనే కాదు. ఇ. కె. మాష్టరుగారు కూడా గుర్తుపట్టలేరు ?'

ఆ సోదరుడు మరింత నిశ్చేష్టతను పొందుతున్నాడు.

'అలా కూర్చోబెడతాను' అంటూ అతన్ని కూర్చోబెట్టి, మిగిలిన వారిని కూడా వచ్చి కూర్చోమని ఇలా చెప్పారు స్వామి. ఒకసారి పర్యటన కార్యక్రమాన్ని ముగించుకొని వచ్చిన తర్వాత విశ్రాంతిగా పడుకుని ఉన్న మాష్టరుగారిని సమీపించి ఇలా అన్నాను : "మాష్టరుగారూ ! నేను మీకు ఇప్పుడొక క్యాసెట్ వినిపిస్తాను. అది ఎవరిది అన్నది మీరు గుర్తుపట్టి చెప్పాలి" అని.

'పెట్టు. ట్రై చేద్దాం' అన్నారు మాష్టరుగారు.

పెట్టాను.

కొద్ది నిముషాలు గడిచింది. మాష్టరుగారలా వింటూనే ఉన్నారు!

'మాష్టరుగారూ ? చెప్పండి' అన్నాను.

'చెప్పడం కష్టమేనోయ్' అన్నారు మనసారా నవ్వారు.

కనుక నాకే కాదు. ఇ.కె. మాష్టరుగారికి కూడా ఈ విచిత్ర పరిస్థితి తప్పలేదు.

నిశ్చేష్టత నుండి కోలుకుంటున్న సోదరుడు ఇలా అడిగాడు. మీ ఇద్దరి గొంతులో గల ఈ పై చిత్రిని మొదటగా మీరెప్పుడు గమనించారు

గతంలోనికి చూస్తూ స్వామి ఇలా చెప్పారు: అది కూడా ఒక చిత్రమైన సన్నివేశమే. సోదర బృందంలో నందుల రమణగారని ఉన్నారు. ఆ రమణగారి శ్రీమతి సావిత్రమ్మగారు. ఈ దంపతులు మాష్టరుగారికీ, మాష్టరుగారి కార్యక్రమాలకీ చాల సన్నిహితంగా ఉండేవారు. నన్ను కన్న బిడ్డలాగా చూసుకునేవారు. వాళ్ళ అమ్మాయిలు 'అన్నయ్యా, అన్నయ్యా' అంటూ పరవశించిపోతూ ఉండేవాళ్ళు. ఆ అమ్మాయిలలో ఒకమ్మాయి పేరు కమల. ఆ కమల ఏం చేసిందీ, ఒకరోజున నేను వాళ్ళింట్లో ప్రేయరు ఇస్తూ ఉండగా టేప్ చేసింది. ప్రేయరు అయిపోయిన తర్వాత అందరూ విశ్రాంతిగా కూర్చుని ఉన్నప్పుడు, ఆ చేసిన టేప్‌ను ఆన్ చేసింది. అందరికీ ఒక్కమాటుగా గగుర్పాటు కలిగింది. ఆ టేప్‌లో నుండి మాష్టరుగారి గొంతు వినబడుతోంది. టేప్ చేసిన ఆమె కూడా అలా ఆశ్చర్యపోతూ కూర్చుండిపోయింది. నానుండి మాష్టరుగారి గొంతు వెలువడుతున్నదీ అని మొదటగా నేను గమనించిన సన్నివేశం అది. టేపు నడుస్తున్న కొద్దీ కమల పారవశ్యంతో పొంగిపోతున్నది. అన్నయ్యా? మీదచ్చు మాష్టరుగారి గొంతే. కాదు. కాదు. మాష్టరుగారి గొంతే మీ నుండి ఇలా వెలువడుతోంది. యూ ఆర్ వెరీ లక్కీ అన్నయ్యా! వుయ్ ఆర్ వెరీ లక్కీ అన్నయ్యా! మీరదృష్టవంతులు. మీతో ఉన్న మేము అదృష్ట వంతులం. నాకివాళ ఎంతో ఆనందంగా ఉంది. ఎంతో ఆనందంగా ఉంది. అంటూ ఇంటికి వస్తున్న వాళ్ళందరికీ మరల మరల ఆ టేపును వినిపించ టమే పనిగా పెట్టుకున్నదామె.

ఆనాడు కమల పొందిన ఆనందం క్రమంగా అందరిదీ అయింది. ఒకసారి మాష్టరుగారు విదేశయాత్రకు వెళ్లారు. వారు వెళ్ళిన రెండు మూడు రోజులకు ఒకానొక ఆధ్యాత్మిక కార్యక్రమంలో కె. యస్. దత్తుగారి

అధ్యక్షతన నా ప్రవచనం జరిగింది. ప్రవచనము మైకుల ద్వారా దూర ప్రాంతాలకు కూడా వినబడుతోంది. ఆ దూరప్రాంతాల నుండి పిల్లా మేక లతో సహా ఆడా, మగా ఎందరో, ఎందరెందరో పరిగెత్తుకొని రావడం కనిపించింది. ప్రవచనం పూర్తికాగానే ఆ పరిగెత్తుకొని వచ్చిన వాళ్లు, "మా చెవులకు మాష్టరుగారి గొంతు వినబడిందండీ! అంతే. పరుగెత్తు కుంటూ వచ్చేశాం. వారు విదేశాలకు వెళ్ళలేదేమో అనుకున్నాం. వెళ్లారని మాకూ తెలుసు. కాని, ఈ గొంతు విన్న తర్వాత వెళ్ళలేదనిపించింది. ఇప్పుడు వచ్చి, చూసి మరీ ఆశ్చర్యపోతున్నాం". అంటూ ఉప్పొంగిపోతు న్నారు. వారి పారవశ్యంలో పాలు పంచుకుంటూ దత్తుగారు : మాష్టరుగారు మనలను ఎలా విడిచి పెడతారు. అందుకనే ఇలా కృష్ణస్వామిగారిగా రూపొంది ఇలా మనను అక్కున చేర్చుకుంటున్నారు. నేనొక మాట అడుగుతాను చెప్పండి. మీరు మాష్టరుగారి గొంతువిని పరుగెత్తుకొని వచ్చారు. కాని మాష్టగారు మీరుద్దేశించిన రూపంలో ఇక్కడ లేరు. లెక్క ప్రకారం మీరు డిసప్పాయింట్ అవ్వాలి. కాని అలా అవ్వలేదు. అంతకు రెట్టింపు ఆనందాన్ని మీరిప్పుడు పొందుతున్నారు. అవునా ? కాదా? అవునవు నన్నట్లుగా తలలూపారు వాళ్లు.

ప్రాంగణం అంతా అలా పరవశిస్తూ ఉండగా, డి.ఐ.జి. రామకృష్ణ శెట్టిగారు వారిని చూస్తూ, 'మీరు చాలా దురదృష్టవంతులు. మీరు మన మాష్టరుగారిని 'మిస్ అయ్యారు' అన్నారు. 'వ్వాట్ వ్వాట్' అన్నారాయన.

'వాట్, అంటారేమిటి సార్ ? యూ మిస్‌డ్ ఎ లాట్. రియల్లీ యు మిస్‌డ్ అవర్ మాష్టర్.' - అన్నారు మళ్ళీ దత్తుగారు. క్రమంగా జరిగిన సన్నివేశాన్ని బోధపరచుకొని 'అరరే! బలే సన్నివేశాన్ని మిస్ అయి పోయానే' అనుకుంటూ సారీ చెప్పారాయన.

ఏటా జనవరిలో జరిగే గురుపూజల్లో ఇలాంటి చిత్రాలు చాలా జరిగేవి, నా ప్రవచనం ప్రారంభ కాగానే అన్నివైపుల నుండి బిలబిలా

పరుగెత్తుకుంటూ వచ్చేవారు సోదర బృందం. మాష్టరుగారు మాట్లాడుతున్నారని పరిగెత్తుకుంటూ వచ్చేవారికి ఈ చిన్న శరీరం కనబడేది. వారి ఆశ్చర్యానందాలకు అవధులుండేవి కావు. ప్రతి గురుపూజల్లోనూ వేదికకు దూరదూరంగా అనేకమైన పనుల్లో నిమగ్నమై ఉండే కార్యకర్తలకు ఇప్పుడు డయాస్ మీద మాట్లాడుతున్నదెవరు ? మాష్టరుగారా ? కృష్ణస్వామిగారా ? అన్న సస్పెన్స్ ఎప్పుడూ ఉండేది. ఒక్కొక్కసారి వాళ్ళా సస్పెన్స్‌కు తట్టుకోలేక వాళ్ళల్లో ఎవరో ఒకరిని మాట్లాడుతున్నది ఇంతకూ ఎవరో అని వేదిక దగ్గరకు పంపించేవారు.

కాలచక్రం గిర్రున తిరిగింది. మాష్టరుగారు భౌతికకాయాన్ని విడిచిపెట్టడం జరిగింది. అనేకచోట్ల సంస్మరణ సభలు జరిగాయి. దాదాపుగా అన్ని సభల్లోనూ నేను మాట్లాడటం జరిగింది. ఈ గొంతు ఆయనది. ఈ ఉపాధిని నిలబెట్టుకున్నది ఆయన. ఈ ఉపాధిలో తన గొంతును భద్రపరచుకున్నది కూడా ఆయనే. అలాంటి ఈ గొంతును విని, చేరినవారు కొంతలో కొంత ఉపశమనాన్ని పొందడం గమనించాను నేను గుంటూరులో జరిగిన సంస్మరణ సభలో ఈ గొంతును విని ఒకామె మూర్ఛపోయింది. ఆమె మాష్టరుగారి దగ్గర చదువుకున్నదట. సంస్మరణ సభకని వచ్చింది. ఆ సభలో ఈ గొంతు వినబడింది. ఇక ఆమె తట్టుకోలేకపోయింది. మూర్ఛపోయింది. ఇలాంటివి ఎన్నెన్నో సన్నివేశాలు ఆ సంస్మరణ సభల్లో. విజయవాడలో ఒక యువకుడు నా వళ్ళంతా తడుముతూ బోరున ఏడ్చేశాడు.

'స్వామీ ! ఈ గొంతు మాష్టారిదే. మాష్టారు ఈ గొంతులోనే ఉన్నారు. మీరు దేశం నలుమూలలా పర్యటించండి. ఈ గొంతును వాడవాడలా వినిపించండి. నాలాంటి తప్త జీవులు ఎందరో ఉంటారు. ఈ గొంతుతో వారి నందరినీ సేద తీర్చండి. మీరు బాగుండాలి. మీరు మాతో ఉండాలి. మీరు మాకింకా దగ్గరైపోవాలి. అప్పటికిగాని మాకీ తపన

చల్లారదు. అప్పటికిగాని మా బ్రతుకులకు తెల్లారదు అంటూ తన చేతు లతో చుట్టివేస్తున్నాడతను. తన కన్నీళ్ళతో ఈ ఉపాధికి అభిషేకం చేస్తున్నాడతను.

ఇంతలో గుంటూరులో మాష్టరుగారి రచనలపై ప్రత్యేకమైన జ్ఞాన యజ్ఞం నిర్వహింపబడింది. ఈ యజ్ఞానికి ప్రధాన నిర్వాహకులు శ్రీ జి. ఎల్. ఎన్. శాస్త్రిగారు. ఏడు రోజులపాటు జరిగిన యజ్ఞంలో నాల్గవ రోజనుకుంటా నా ప్రవచనం. మాష్టరుగారి రచనలైన లోకయాత్ర, ఇష్టా గోష్టిల గురించి మాట్లాడటం జరిగింది. ఆ రోజు సభలో ప్రముఖు లందరితోపాటుగా నడవేదమని చెప్పదగిన బ్రహ్మశ్రీ సర్వా శేషయ్య గారు కూడా కూర్చొని ఉన్నారు. ఆయన జి. ఎల్. ఎన్. శాస్త్రిగారికి పిల్లనిచ్చిన మామగారు. ప్రవచనం సాగుతున్నంతసేపు మాష్టరుగారి సాన్నిధ్యం సభకంతటికీ నిండుగా అనుభవానికి వచ్చింది. మీరు ఇంకా కొంతసేపు మాట్లాడాలంటూ కాగితాలు వ్రాసి పంపించారు సభలోనివారు. 'ఇప్పటికే కాలం చాల అయింది. బస్సులసలు ఉండవేమో' అన్నాన్నేను. మీరు వాటిని వేటిని గూర్చి ఆలోచించవద్దు. మీరు మాట్లాడటమే మాకు కావలసింది. ఆ మాష్టరుగారి గొంతును ఎంత వింటే అంత తృప్తి తీరు తుంది వారికి. ప్రవచనం పూర్తయిన తరువాత శాస్త్రిగారితో కలసి కారులో ఇంటికి వెళ్ళుతూ సర్వా శేషయ్యగారు అన్నారట. 'ఇవాళ చాల సుదినం. మన సంప్రదాయంలో జీవేశ్వరుల అనుబంధాన్ని వివరిస్తూ సామీప్యము, సారూప్యము, సాయుజ్యము అన్న మూడు స్థితుల్ని చెప్తుంటారు. ఇంత కాలం ఈ స్థితులను గూర్చి వినటం, అధ్యయనం చేయటమే జరుగుతూ వస్తున్నది. ఈ రోజున కృష్ణస్వామిగారు మాట్లాడుతున్నప్పుడు ఆ మూడు స్థితులయొక్క నిజస్వరూపము నాకు సాక్షాత్కరించింది. నాకు అనుభవా నికి వచ్చింది. ఈ నా సంతోషాన్ని మీరు రేపు వారికి తెలియజేయండి. నాకు చాల ఆనందం కలిగిందని చెప్పండి'.

ఆ మరునాడు శాస్త్రిగారు ఆనందబాష్పాలు తమ కనులలో తిరుగుతూ ఉండగా, ఆ మహనీయుని అనుభూతిని గూర్చి నాకు వివరించారు. నాకు చాల సంతోషం కలిగింది. వినమ్రుడనై వారికి నేను మనస్సులోనే నమస్కరించుకున్నాను. ఇలా ఈ గొంతును గూర్చి చెప్పుకుంటూ పోతే రోజులూ, నెలలు కూడా మనకు తెలియకుండా గడిచిపోతాయి. ఇంతకూ నేను చెప్పేది ఒకటే. అలాంటి ఈ గొంతును అనుక్షణం నేను ఆరాధించుకుంటున్నాను. ఆ గొంతును విని దగ్గరైన మీరు కూడా దీనిని ఆరాధించుకోండి.

చుట్టూ కూర్చున్న సోదర బృందం ఆ కాసేపటిలో నవరసాలు అనుభవించినట్లయింది. ఆ గొంతును గూర్చి తెలుసుకోవలసిన అంశాలు కొన్నింటిని, ఆ గొంతు ద్వారానే తెలుసుకోగలిగాం అన్న తృప్తి వారి ముఖాలలో కనబడుతోంది. ఆ దేహంతో ప్రాక్ - పశ్చిమ సమన్వయానికి బాటలు వేసిన ఈ గొంతు, ఈ దేహంతో జాతి పునర్నిర్మాణానికి శంఖారావమై వెలువడుతూ ఉన్నదని గుర్తించిన సోదరబృందం తమని తాము ఆ గొంతునకు సమర్పించుకుంటున్నట్లుగా గోచరించసాగారు.

# ఆ అంచునుండి ఈ అంచుకు

అరబ్బు దేశాలనుండి వచ్చిన డాక్టరు ఒకాయన స్వామిని చూడ వచ్చాడు. ఆయన విజయవాడ వారేనట. డాక్టరుగా పనిచేస్తూ, కొంతకాలం ఆ దేశాలలో ఉండి వద్దామని వెళ్ళారట. అక్కడి పరిస్థితులను గూర్చి, సంస్కృతీ సంప్రదాయాలను గూర్చి సంభాషణలు నడుస్తున్నాయి.

స్వామి ఇలా అడిగారు : ఆ దేశాలలో మిగిలిన మతాలవారికి ఎలాంటి స్వేచ్ఛనిస్తారు ?

డాక్టర్ ఇలా చెప్పారు : "మిగిలిన మతాల వారికి స్వేచ్ఛ అనే ప్రసక్తి లేదక్కడ. ఇంక ఏ మతాలవారు, వారి మతాలకు సంబంధించిన గుడి గోపురాలను, మందిరాలను కట్టుకునే అవకాశం లేదక్కడ. ఇతర మతాలకు చెందిన సమావేశాలను బహిర్గంగంగా నడుపుకునేందుకు అవకాశం లేదు. అలాగే ఇతర మతాలకు చెందిన ఊరేగింపులను, ఇతర సమావేశాలను కూడా అనుమతించరు. ఇక మనమేదైనా జరుపుకుంటే మన ఇళ్ళల్లో జరుపుకోవలసిందే! సర్వ సాధారణంగా సన్నిహితంగా మెలిగే అవకాశమున్న కుటుంబాల వారందరూ ఒక్కొక్కసారి ఒక్కొక్కళ్ళ ఇంట్లో గుంభనగా ఉత్సవాలను నిర్వహించుకుంటూ ఉంటారు. దైనందిన జీవనానికి నిత్యమూ కావలసిన సౌకర్యాలకు అక్కడ ఏ లోటూ లేదు. ఇక్కడ దొరికేవన్నీ అక్కడా దొరుకుతాయి. ఇక్కడ నుండే అక్కడకు వస్తూ ఉంటాయి. వృత్తి పరంగా కూడా మంచి గౌరవమే లభిస్తుంది. కాని ఎక్కడో ఏదో అసంతృప్తి. 'మనకు కావలసినంత స్వేచ్ఛ లేదు ఇక్కడ' అనే భావన నిరంతరం కలుగుతూనే ఉంటుందక్కడ. విజయవాడ లాంటి ఊళ్ళో ఏదైనా మర్డర్ లాంటిది జరిగినప్పుడు కర్ఫ్యూ విధిస్తారు చూడండి. అప్పుడు మన మనస్సులకు ఎలా ఉంటుంది ? మామూలుగా అలా ఉంటుందక్కడ! అక్కడికి వెళ్ళిన తర్వాత భారత

దేశం అంటే భారతీయుడికి బాగా అభిమానం పెరుగుతుంది. ఏమున్నా, ఏం లేకపోయినా స్వేచ్ఛ ఉంది కదా మనదేశంలో అనిపిస్తుంది. స్వేచ్ఛ యొక్క విలువ కూడా తెలిసివస్తుంది. అలాగే ఇక్కడినుండి అక్కడ కొచ్చిన భారతీయుడు మన సంస్కృతికి మానసికంగా బాగా దగ్గరవుతాడు.

ఆయన మాటలను సావధానంగా వింటున్న స్వామి ఇలా అన్నారు : బాగా చెప్పారు. స్వేచ్ఛను గురించి మీరు చెప్పిన మాటలు చాలా బాగున్నాయి. అలాంటి స్వేచ్ఛను మన జాతి ఎన్ని దశాబ్దాలపాటు పోరాటాన్ని సలిపి సాధించుకొన్నదీ మనకు తెలుసు. కాని ఈ రోజున మన దేశంలో స్వేచ్ఛ అన్నది అనేక విధాల దుర్వినియోగం చేయబడుతున్నది. ఇది చాల బాధాకరమైన అంశం. ఏ స్వేచ్ఛ ప్రపంచంలోని అనేక దేశాలలో ఇవాల్టికీ ఇంతగా లభించడం లేదో ఆ స్వేచ్ఛను మనం దుర్వినియోగం చేస్తున్నాము. అంటే ఇక ఆలోచించండి. ఇవాళ భారతదేశంలో ప్రధానమైన సమస్యలన్నీ ఈ స్వేచ్ఛా దుర్వినియోగం వల్లనే రూపు కట్టుకున్నాయి అని చెప్పవచ్చు. ఈ దుష్ట ఫలితాలతో ఇవాళ దేశం అట్టుడికిపోతున్నది. మన పెద్దలు స్వేచ్ఛను సాధించిపెట్టారు. బాగున్నది. ఆ స్వేచ్ఛను సద్వినియోగం చేయటం ఎలాగో మన జాతికి మనం నేర్పుకోవలసి ఉన్నది. ఇందాక మీరడిగారు. 'మీ కార్యక్రమాలు ఏమేమిటి మాష్టారూ! అని' మానవధర్మ శిక్షణ నిర్వహిస్తున్న ప్రణాళికలో స్వేచ్ఛను సద్వినియోగం చేసుకోవటం ఎలాగో ఈ జాతికి నేర్పుకోవడం అన్నది కూడా ఒక ప్రధానమైన అంశం!'

ఏ దేశానికీ లేనన్ని ప్రకృతి వనరులు మన దేశానికి ఉన్నా చూడడానికి ఈ దేశం రోతగా ఎందుకని కనబడుతుంది ? ఒకసారి అమెరికా నుండి ఒక పాప అప్పటి మన ప్రధానమంత్రి అయిన శ్రీమతి ఇందిరా గాంధీకి ఒక లేఖ వ్రాసింది. నేను భారతీయుల బిడ్డను. భారతదేశమంటే నాకు అమితమైన అభిమానం. ఈ మధ్య నేను నా తల్లిదండ్రులతో కలిసి

భారత దేశానికి వచ్చాను. ప్రధానమైన నగరాలలో తిరిగాను. తిరుగుతున్నప్పుడు ఆ రోడ్లను చూస్తుంటే చాల బాధవేసింది. రోడ్లపైన మనుష్యులతో పాటు పశువులు కూడా తిరుగుతున్నాయి. ఆ పశువులు వదలిన మల మూత్రాలతో రహదారులు దుర్గంధాన్ని వెదజల్లుతున్నాయి. చిత్రం ! మనుషులు కూడా పశువులను అనుసరిస్తూ కనిపించారు. ఆ రోడ్లపైన నడవాలీ అంటే నాకు భయంవేసింది. బాధ కలిగిందీ, రోతపుట్టిందీ. అని నా దేశం ఎందుకిలా ఉందా ? అనిపించింది, ఆ కలిగిన బాధను ఆపుకో లేక మీకు ఈ లేఖ వ్రాస్తున్నాను అన్నది. ఆ పాప వ్రాసిన లేఖయొక్క సారాంశము. దానికి మన ప్రధానమంత్రి జవాబు వ్రాస్తూ అంటుందికదా ! 'పాపా ! నీవు చెప్పిన దృశ్యాలు నిజమేనమ్మా ! కాని మన భారతదేశం బీదదేశం. ఆర్థికంగా వెనుకబడిన దేశం ఇది. అలాంటి ఈ దేశంలో నీవు చూసిన దృశ్యాల లాంటివి తప్పవు' అని. నాకు ఆశ్చర్యం వేసింది. దేశం ఆర్థికంగా వెనుకబడటానికిన్నీ, రోడ్లు ఇలా ఉండటానికిని సంబంధం ఏమిటి ? అని. ఆ పాప వ్రాసిన దృశ్యాలన్నీ మన శ్రద్ధలేని తనానికి అద్దం పడుతున్నాయి. దేశం యెడల మన కెలాంటి భక్తి శ్రద్ధలు ఉన్నవో మనకు తెలియజెప్పుతున్నాయి. ఇది నా దేశం. ఇది బాగుండాలి. అందంగా ఉండాలి. ఇక్కడ అందరూ సుఖంగా ఉండాలి. ఎవరికీ ఇబ్బంది కలుగ కూడదు-అన్న ఆలోచన మనలో ఉన్నప్పుడు ఈ దేశం ఇలా ఉండదు. ఆ ఆలోచన మనలో లేనప్పుడు, మనకు రానప్పుడు అమితమైన ఆర్థిక వనరులున్నా ఇంకా ఇంతకింత చండాలంగ తయారవుతుంది. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత, స్వేచ్ఛ మనకు లభించిన తరువాత మనకు దేశం ఎడల, దేశం యొక్క అవసరాల యెడల శ్రద్ధ తగ్గిపోయింది. ఎవరు ఏమయిపోయినా పరవాలేదు. మన పని అయిపోతే చాలు. ఎవరు ఏమయిపోయినా పరవాలేదు. మనం బాగుంటే చాలు' అన్న భావన మన మనస్సులలో విజృంభిస్తూ రాజ్యమేలుతున్నది. ఇలాంటి భావన కలిగిన మనిషి, లెక్కలేనన్ని విధాలుగా స్వేచ్ఛను దుర్వినియోగం చేస్తున్నాడు.

తనకు తోచినట్లల్లా వాడుకుంటున్నాడు. తనకు లాభించేట్లుగా మలచుకుంటున్నాడు. ఇవాళ అతను తన కొరకు ఏదైనా చేసేందుకు సిద్ధంగా ఉన్నాడు. ఆశ్చర్యం.... ఒకప్పుడు ఈ దేశం కొరకు తానేమయిపోయినా పరవాలేదన్న భారతీయుడు, ఇవాళ తన కొరకు ఈ దేశం ఏమయిపోయినా పరవాలేదన్న స్థితికి వచ్చాడు. ఆలోచించండి, మనమెక్కడ ఉన్నామో?

స్వామి మాటలు ఆకళింపు చేసుకుంటున్న ఆ డాక్టరు నిట్టూర్చాడు. 'నిజమే మాష్టారూ! మీ మాటలు వింటుంటే ఒకాయన చేసిన ఒక చక్కటి కామెంట్ గుర్తుకొస్తున్నది. "జపనీయులు బీదవారు. కాని జపాన్ దేశం సంపన్నమైంది. భారతదేశం బీదదేశం. కాని భారతీయులు భాగ్యవంతులు" అన్నాడాయన. మనదేశంలో ఉన్న సంపదంతా ఇళ్లల్లోకి వచ్చేస్తుంది. ఆ ఇళ్ళల్లో ఎవరికీ కనబడని చోటుల్లోకి వెళ్ళిపోతోంది. దేశం బీదదై పోతుంది. ప్రజలు మాత్రం సంపన్నులౌతున్నారు. దేశంలో ఏ సౌకర్యాలు ఉండవు. కాని ప్రజలకు మాత్రం ఇళ్లల్లో అన్ని సౌకర్యాలూ ఉంటాయి. అన్ని భోగభాగ్యాలూ ఉంటాయి. ఇది చాల చిత్రమైన దృశ్యం మాష్టరుగారూ. మన దేశాన్ని మనమే కావాలని ఇలా చేసుకుంటున్నాం. ఇప్పుడున్న దృశ్యమది.

నిట్టూర్పు విడుస్తూ ఇలా అన్నారు స్వామి : స్వాతంత్ర్య సమర కాలంలో భారతీయుని ప్రవర్తన త్యాగానికి పరాకాష్ట. స్వాతంత్ర్య అనంతరం భారతీయుని ప్రవర్తన స్వార్థానికి పరాకాష్ఠ. అప్పుడు ఆ అంచున నిలబడిన భారతీయుడు, ఇప్పుడు వచ్చి ఈ అంచున నిలబడ్డాడు.

మరి ఇప్పుడిక మార్గమేమిటంటారు? నాకు మాత్రం 'మీవంటి ఉద్యమ శీలురే ఈ దేశంలో కావలసిన మార్పును తీసుకొని రాగల సమర్థులు అనిపిస్తుంది' అన్నాడాయన.

అతని ఆశాభావాన్ని అందుకుంటూ స్వామి ఇలా అన్నారు : మన కృషి వేగాన్ని పుంజుకొని, విస్తృతమైన పరిధిలో అనేక ముఖాల సాగవలసి ఉంది. అప్పుడు ఆ రావలసిన మార్పును, ఆ కావలసిన

మార్పును ఎదిగి వస్తున్న ఈ యువతరంలో నుండే మనం చూడటానికి వీలవుతుంది. అందుకు మీలాంటివాళ్ళందరూ కలసివచ్చి, చేతులు కలప వలసి ఉంటుంది.

'తప్పకుండా మాష్టరుగారూ ! ఆ ఉద్దేశంతోనే మిమ్మల్ని పరిచయం చేసుకుందామని ఈ రోజు ప్రత్యేకంగా వచ్చాను' అని నమస్కరిస్తూ సెలవు తీసుకున్నారు.

## కథ సుఖాంతమౌతుంది

ఒక సోమవారంనాడు సద్గోష్ఠి అనంతరం సోదరుడొకరు ఇలా అడిగారు : స్వామీ! ఈ మధ్య మేము ఒక స్వామీజీ ఉపన్యాసానికి వెళ్ళాం. ఆయన 'మానవసేవే మాధవసేవ' అనటం తప్పు అని చెప్పారు. చేయవలసింది మాధవసేవేగాని మానవసేవ కాదూ!' అని చెప్పారు. అందుకాయన ఒక వివరణ కూడా చెప్పారు. 'మానవులందరూ గుణ దోషాలతో నిండి ఉంటారు. వారికి సేవచేస్తే మనకు కూడా ఆ గుణ దోషాలు అంటుకుంటాయి. కనుక చేయవలసింది మానవసేవ కాదు. నిర్గుణుడైన మాధవసేవే మనం చేయాలి' అన్నారు. ఈ వాక్యాలు విన్న తరువాత మాకేమిటోగా అనిపించింది. అందుకని మీరే మాకు సందేహ నివృత్తి చేసి, పుణ్యం కట్టుకోవాలి.

చేతులు జోడిస్తూ నిలబడ్డ ఆ సోదరుణ్ణి చూస్తూ స్వామి ఇలా అన్నారు : ఈ వాక్యాలు చెప్పిన ఆ పెద్దాయన నిజంగా ఆ వాక్యాలను విశ్వసిస్తూ ఉన్నట్లయితే, ఇక ఆధ్యాత్మిక ఉపన్యాసాలు చేయకూడదు. ఎందుకనంటే వారి దగ్గర జ్ఞానముంది. విషయ పరిజ్ఞాన ముంది. పదిమందికి చెప్పగలిగిన నేర్పు ఉంది. ఆ నేర్పుతో ఆయన వేలాదికి మంచి మాటలు చెప్పటమనే సేవచేస్తున్నాడు. తాము చేయగలిగిన మంచి

పని అదీ, మంచి విషయములు మనుషులకు చెప్పగలగటం! అది ఆయన పెద్ద ఎత్తున చేస్తున్నారు. ఎందరో అందుకు సంతోషిస్తున్నారు. మరి వారు చేస్తున్న ప్రవచన సేవ ఈ గుణదోషాలతో నిండియున్న మానవాళికే కదా! మీరు చెప్పిన వారి వాక్యాలను వారే కనుక విశ్వసిస్తే ఈ గుణదోషాలతో ఉన్న మనుష్యులకు ఉపన్యాసాలు చెప్పడం మాని ఏ కొండగుహల లోకో వెళ్ళి నిర్గుణుడైన పరబ్రహ్మాను ఉపాసిస్తూ కూర్చోవాలి. మరి వారట్లా చేయడం లేదు కదా! ఉపన్యాసాలిస్తున్నారు. జ్ఞాన యజ్ఞాలు నడుపుతున్నారు. సత్సంగాలు పెడుతున్నారు. కిందా మీదా పడుతున్నారు. ఇదంతా వారు గుణదోషాలున్న మనుషులతోనే చేస్తున్నారు. ఆ గుణదోషాలున్న మనుషుల కోసమే చేస్తున్నారు. మరి అవి వారి కంటుకుంటున్నాయో లేదో వారే చెప్పాలి.

ఇంతకూ నేను చెప్పవచ్చేదేమంటే వారు చేయగలిగిన మంచిపనిని వారు ఈ గుణదోషాలున్న మనుష్యులకే చేస్తున్నారు. మనం చేయగలిగిన మంచి పనిని కూడా అలాగే చేస్తామంటే 'తప్పు. అది వద్దు' అంటున్నారు; ఇది ఎట్లా పొసుగుతుంది? ఆయన కాదు. మనం కాదు. చివరకు అవతార మూర్తే దిగివచ్చినా పనిచేయవలసింది ఈ గుణదోషాలున్న మనుషులతోనే! సేవించవలసిందీ ఈ గుణదోషాలున్న మనుషులనే! అయితే వారు చెప్పినట్లు మనుషులలో గుణదోషాలుండటం సహజమే. ఆ గుణదోషాలు అంటుకోకుండా వారిని సేవించట మెలాగో నేర్పడానికే పెద్దలు ఉన్నది. తోటివారి గుణదోషాలు మన కంటకుండా వారిని సేవించగలగడమే కర్మాచరణంలో కౌశల మంటే! గుణదోషాలను చూసి పారిపోకూడదు. ఆగిపోకూడదు. ఆ గుణదోషాలు అంటకుండానే వారిని స్పృశించి, పరవశింపజేయగలగాలి. ఆ పారవశ్యంలో, వారు అంగీకరిస్తే, ఆ గుణదోషాలనుండి వారు బయటపడే మార్గాన్ని వారికి ఉపదేశించగలగాలి. సంగం అన్నదీ లేకుండానే సంఘసేవ చేయగలగాలి. అయినా సర్వాంతర్యామియైన దైవా

నికి అంటుకున్నవాడు మరొకదానికి అంటుకునే ప్రసక్తే ఉండదు. మరొకటి అన్నభావనే అతనికి ఉండదు. అనన్యంగా అతడిని చింతిస్తూ, లోకరూపంలో నున్న అతడికి మనం చేయగలిగింది శ్రద్ధా భక్తులతో చేయ డమే మన కర్తవ్యం. చేయడానికి కావలసిన సంకల్పం కలిగిస్తున్నది అతను. ఆ సంకల్పం కార్యరూపం ధరించడానికి కావలసిన శక్తియుక్తుల్ని అందిస్తున్నదీ అతను. ఆ కార్యక్రమ ఫలాన్ని ముచ్చటగా స్వీకరిస్తున్నదీ అతడే! ఇంకా అంటుకునేదేమిటి ? ఒకవేళ అంటుకుంటే అతడే అంటు కోవాలి. అతడు అంటుకోవటం కన్నా మనకు కావలసిందేమిటి ? ఇలా మన స్వధర్మ నిర్వహణ లోకరూపంలోనున్న అతడికి సేవగా సాగుతూ ఉండగా అతడే అంటుకుంటాడు! అతడే మనని అందుకుంటాడు! మనను తనలోనికి స్వీకరిస్తాడు, మనను తనమయంగా చేసి తన్మయస్థితిని అనుభ వింప చేస్తాడు! స్వధర్మాన్ని, జగద్ధితమైన సేవగా నిర్వహించటంలో నైపుణ్యాన్ని అభ్యసించి, ఇలాంటి తన్మయస్థితిలో తేలియాడమని భగవ ద్గీతలో కృష్ణుడు ఉపదేశిస్తున్నాడు. భగవద్గీత అంతటా పరచుకొని ఉన్నది ఈ సందేశమే! ఇపుడు మీరు చెప్పిన ఆ పెద్దాయన కూడా ఆ కృష్ణ స్మరణలో మునిగిపోవాలని చూస్తున్నవారే. తగిన సమయంలో వారికి కూడా శ్రీకృష్ణుడే సమన్వయాన్ని అందిస్తాడు. అప్పుడు వారు గుణదోషా లకు అతీతంగా ఉంటూ, మానవ రూపంలో ఉన్న మాధవుణ్ణి ఎలా సేవిం చాలో పరవశించి చెపుతారు. తొందర పడతారేం ? వారి జీవితమనే నాటకంలో కొద్ది రంగాలే ఇప్పటికి నడిచింది. వారి అంతరంగం వికసించ టానికి, ఆవిష్కరింపబడటానికి ముందు ఇంకా చాలా రంగాలున్నాయి. జరుగవలసిన నాటకం ఇంకా చాల ఉంది. కథ చివరకు సుఖాంతమే అవు తుంది.

ఆ అడిగిన సోదరుడు పులకించిపోయాడు : 'అదే కోరుకుంటున్నాను స్వామీ. నాటకం సుఖాంతం కావాలనే'! - అంటూ నమస్కరించాడు.

# ధర్మతేజం దమిస్తుంది

మీ దగ్గరకు వచ్చినవాళ్లు పూర్తిగా కొనసాగకుండా మధ్యలో కొందరు ఎందుకు దూరమవుతున్నారు ? అలా నిలబడలేని లక్షణం ఉన్న వాళ్లని అసలు మీరెందుకు రానిస్తున్నారు ? కొన్నాళ్లు ఇక్కడుండి పనిచేసి, మీరే లోకంగా మీచుట్టూ తిరిగి, ఇప్పుడక్కడ జంక్షన్‌లో నిలబడి, ఇక్కడి కొచ్చేపోయేవారిని నిలబెట్టి మీ గురించి నోటి కొచ్చిన వన్నీ చెబుతున్నారూ అంటే ఎలా ఉంటుంది ? అసలు ఇలాంటి దృశ్యాలకి ఎందుకు అవకాశ మిస్తున్నారు ? కనీసం ఆ దృశ్యాలను దమించే ప్రయత్నం కూడా మీరెందుకు చేయటం లేదు ? నాకు ఏమిటో అంతా అయోమయంగా ఉంది. మీ రంటే నామనస్సు పరవశించి పోతోంది. మీ చుట్టూ ఇలాంటి సన్నివేశాలను అది ఊహించలేకపోతోంది. ఊహించలేని ఆ మనస్సు ఇలాంటివన్నీ జరుగుతుంటే చూసి తట్టుకోగలదా ? అసలు ఈ సన్నివేశాలు ఇలా జరగడంలో మర్మమేమిటో నాకు చెప్పండి. మీరుగా చెబితే నామనస్సు కాస్త కుదుటపడుతుందేమో ! అలా అడుగుతూ బాధా వేశంతో ఊగిపోతున్నాడొక యువకుడు.

ప్రశాంత వదనులై నూటిగా చూస్తూ స్వామి ఇలా అన్నారు : మీరడిగిన ఈ సన్నివేశాల కథలో అనేకమైన సూక్ష్మాంశాలు ఇమిడి ఉన్నాయి. మీ రడిగారు కాబట్టి చెబుతున్నాను. సావధాన చిత్తులై వినండి. ఇలా మధ్యలో వెళ్లిపోవడానికి ప్రధాన కారణాలలో ఒకటి ఆంధ్రత్వం. ఆంధ్రులు ఆరంభశూరులు అన్నపేరు ఉన్నది కదా ! అలా అనబడంలో అర్థం ఏమిటి ? 'వీళ్లల్లో ఎక్కువ మంది ఆరంభించకుండా ఉండలేరు. ఆరంభించింది కొనసాగించలేరు' అని ఏదో ఒక ఆవేశంలో ప్రారంభిం చేస్తారు. పని ప్రారంభించడానికి ఆవేశం సరిపోతుందిగాని, పనిని కొన సాగించటానికి ఆవేశం ఒక్కటే చాలదు. అందుకు పరిపూర్ణమైన

మానసిక సంసిద్ధత కావాలి. చక్కని క్రమశిక్షణ కావాలి. వినయ విధేయతలు కావాలి. నిరంతర కృషి కావాలి. అన్నింటినీ మించి త్యాగశీలం ఉండాలి. ఇన్ని అర్హతలు ఉంటేగాని ఒక పనిని కొనసాగించ గలిగిన స్థితి ఏర్పడదు. ఆవేశంతో ప్రారంభించిన వాడు ఈ లక్షణాలన్నీ అవసర మయ్యే సరికి క్రమంగా జంకుతాడు. ఈ లక్షణాలను అభ్యాసం చేసుకోవల సిందిపోయి, ఇన్ని లక్షణాలు ఇక్కడ అవసరమైతే ఇంక మనమేమి చేయగలం ? కనుక ఏవో ఒక వంకన ఇక్కడి నుండి తప్పుకుందామని చూస్తారు. వాడు మంచివాడయితే తనకు ఖాళీ లేదనో, వీలు కావడం లేదనో, వేరే పనులు ఏవో తగిలాయనో, లేదా ఉన్నపనులలోనే వత్తిడి పెరిగిందనో చెప్పి అక్కడ నుండి తప్పుకుంటాడు. వాడు కుసంస్కారి యైతే తన మీద పెట్టుకోకుండా, ఆ పెట్టే వంక లేవో ఆ ఉద్యమం మీద పెడతాడు. అక్కడ పద్ధతి లేదనో, ప్రవర్తన సరిలేదనో, సేవాభావం కొరవడిందనో, నైతిక విలువలు లేవనో, తానాశించినట్లుగా అక్కడ జరగడం లేదనో ప్రచారం మొదలుపెట్టి అక్కడి నుండి తప్పుకుంటాడు. ఇంతకీ ప్రధాన కారణం అసంపూర్ణత్వం. ఆ అంశాన్ని సూటిగా ఒప్పుకోవడానికి వాడికి దమ్ముండదు. నేను ఈ పనిని కొనసాగించలేక పోతున్నాను అని ఒప్పుకోవాలీ అంటే దానికి ధైర్యముండాలి. అలా ఒప్పుకోగలిగిన వాడు తనను తాను పరిశీ లించు కుంటాడు. క్రమంగా సంస్కరించుకుంటాడు. ఒక మంచి కార్య కర్తగా రూపొందగలుగుతాడు. నేటి సమాజంలో ఆత్మపరిశీలన తక్కువ. మనిషి తనను తాను పరిశీలించుకోవడం కన్నా, తనను తాను సమర్థించు కోవడానికే ప్రయత్నం చేస్తున్నాడు.

ఇక రెండవ అంశం. రమణ మహర్షి ఒక మాట చెప్పాడు. "ఈ ఆశ్రమంలోనికి ప్రవేశిస్తూ ప్రతివాడూ ఇక్కడి వాతావరణం బాగుంది. నేను ఇక్కడి నియమాలకు బద్ధుడనై ఉండాలి. ఉంటే బాగుపడతాను.

కనుక ఇక్కడ ఉన్నన్ని రోజులూ విధేయుడనై ఉంటాను." అనుకుంటూ ప్రవేశిస్తాడు. మూడు నాలుగు రోజులు గడుస్తాయో లేదో అతని పద్ధతి మారిపోతుంది. ఆశ్రమ నియమాల ప్రకారం తాను నడుచుకోవాలనుకున్న వాడు కాస్తా, ఈ ఆశ్రమంలో ఉన్నవాళ్లందరు మనం చెప్పినట్లుగా వింటే బాగుండును, అనుకుంటాడు. కొద్దిరోజుల్లోనే అతడిలో అంత మార్పు వస్తూ ఉన్నది. ఇది చిత్రం. ప్రతి ఒక్కడికీ అనిపించినట్లల్లా ఆశ్రమాన్ని నడపడం ఎలా సాధ్యమౌతుంది. ఆ సాధ్యా సాధ్యాలతనికి పట్టవు. తన కనిపించిన ప్రకారం ఆశ్రమం నడవటం లేదు కాబట్టి ఆశ్రమంలో పద్ధతులు బాగుండలేవు. వీళ్ళాళ్లు బాగుండలేవు అంటూ ఏవేవో నిందలు వేయడం ప్రారంభిస్తాడతను. రమణ మహర్షి చెప్పిన ఈ మాటలు అక్షర సత్యాలు. చిత్రమైన ఈ మార్పు మనుషులలో రావడంకూడా, వారిలో కొందరు బయటకు వెళ్లిపోవడానికి దోహదం చేస్తున్నది. ఆ వెళ్లిన వాళ్ల ఊరుకోరు కదా ! కొంత కాలం పాటు అలా నిలదీస్తూనే ఉంటారు. కనబడ్డ ప్రతివాడికీ పనిగట్టుకొని చెబుతూనే ఉంటారు. ఈ సందర్భంలో కూడా కావలసింది ఆత్మపరిశీలనే. 'మనం ఏమనుకుంటూ వెళ్లాం అక్కడికి ? ఏమనుకుంటూ వచ్చేశాం అక్కడి నుండి ? ఎందుకని అక్కడ ఇమడలేక పోయాం ? మనలో ఇంతలో ఇంత మార్పు ఎలా వచ్చింది ? ఇలా కూడని మార్పులకు మనం లోనైపోతూ ఉంటే, ఇక్కడ కాకపోతే ఇంకెక్కడయినా మనం ఎంత వరకు మనగలం ? ఇలాంటి ఆత్మపరిశీలన మనిషి చేసుకోవాలి. చేసుకుంటే తను బాగుంటాడు. చేసుకోక పోతే తాత్కాలికంగా ఎదుటివాళ్లను ఇబ్బంది పెడతాడు.

ఇక మూడవ అంశం. ఒక గురువుకు శిష్యులు దగ్గరౌతారు. గురువు వారికి శిక్షణ నివ్వడం ప్రారంభిస్తాడు. ప్రారంభించిన తొలినాళ్లలో సన్నివేశాలన్నీ అనుభూతి ప్రదంగా బాగానే ఉంటాయి. కొన్నాళ్లయేటప్పటికి వాళ్లలోని పూర్వ సంస్కారాలు కదలడం మొదలుపెడతాయి. ఆ పూర్వ

సంస్కారాలలో మంచి సంస్కారాలు ఉన్నవాళ్లు అనుభూతిలో మరింత గాఢతను పొందుతూ సమాజానికి పనికివచ్చే కార్యకర్తలుగా రూపు దిద్దుకోవడం మొదలు పెడతారు. ఆ పూర్వ సంస్కారాల్లో కూడని సంస్కారాలు ఉన్నవాళ్లు కొంతకాలంపాటు మానసికంగా వికృత స్థితులను అనుభవిస్తారు. ఎన్ని జన్మలనుండో నిక్షిప్తమై ఉన్న రాగద్వేషాలూ, ఈర్ష్యాసూయలు, మద మాత్సర్యాలు మొదలైన కుసంస్కారాలన్నీ ఇప్పుడు ఒక్కసారిగా వెల్లుబికి పైకి వస్తాయి. వీటిని తట్టుకోగలిగిన వారు ఎవరు ? కుటుంబ సభ్యులా ? సమాజమా ? వారి నందరినీ ఈ కు సంస్కారాల బారినుండి రక్షించడానికై ఆ వెల్లుబికిన ప్రవాహాలను గురువు తనవైపుకు త్రిప్పుకుంటాడు. అంతే. అప్పటి నుండి కొంతకాలం వరకు ఆ వెల్లుబుకుతున్న వారందరూ తమ తమ కుసంస్కారాలతో గురువును దుమ్మెత్తి పోస్తారు. నానావిధ వికారాలన్నింటినీ ఆయనపైకే ప్రయోగిస్తారు. గురువు వాటిని ఆనందంగా స్వీకరిస్తాడు. ఇప్పటికైనా వాళ్లు కదలగలుగు తున్నారు కదా! అని సంతోషిస్తారు. ఆ కుసంస్కారాల లోతులను బట్టి ఎంతకాలం వారు గురువును ద్వేషిస్తారన్నది నిర్ణయమౌతుంది. అలా కావలసినంత కాలాన్ని తీసుకున్న తర్వాత వాళ్లు మామూలు మనుషులై, గురుమూర్తికి దగ్గరై నమస్కరిస్తారు. శిష్యులను రూపుదిద్దుతున్న వేళలో గురువుకు ఇలాంటి విచిత్రమైన స్థితి గతులు తప్పవు. అన్నింటికీ సిద్ధమయ్యే అతడు గురుత్వమనే బాధ్యతను స్వీకరిస్తాడు. పవిత్రమైన ప్రేమతో అన్ని స్థాయిలలోని వారినీ సహిస్తాడు. వారితో సహవసిస్తాడు. చూసేవారికి ఈ దృశ్యాలన్నీ బాధను కలిగించవచ్చు. ఇబ్బందికరంగానూ ఉండవచ్చు. గురువునకు మాత్రం ఈ సన్నివేశాలన్నీ కర్తవ్యంలోని భాగాలు.

వీటికి పైన ఒక సూక్ష్మం ఉంది. మహాభారతంలో భీష్మాచార్యుడు ధర్మజునికి ఉపదేశించిన సూక్ష్మాంశమిది. ఇద్దరు మనుష్యులు ఎలా కలుస్తున్నారు, ఎలా విడిపోతున్నారు? ఈ కలయికలు, విడిపోవటాలు వెనుక

గల కథ ఏమిటన్నది వివరిస్తూ భీష్ముడంటాడు కదా! ఒక నదీ ప్రవహిస్తూ ఉంది. ఆ నదికి రెండు వైపులా పెద్ద పెద్ద చెట్లు ఉన్నాయి. ఆ చెట్లు తన కాలం పూర్తయిన తరువాత ఎండి మ్రానులై విరిగి ఆ నదిలో పడుతున్నాయి. పడి ఆ ప్రవాహంలో కొట్టుకుపోతున్నాయి. ఇక్కడే గమనించవలసిన చిత్రం వుంది. ప్రయాణం చేస్తున్న ఆ చెట్ల మ్రానులను ఆ ప్రవాహమే దగ్గరయ్యేట్టు చేస్తుంది. ఆ దగ్గరయిన రెండు మ్రానులు కొంతకాలంపాటు కలిసి ప్రయాణం చేస్తాయి. అటుపైన ఏవో ఒక క్షణం నుండి ఆ ప్రవాహమే ఆ మ్రానుల్ని ఎడం చేయడం మొదలుపెడుతుంది. ఇక అవి క్రమంగా ఎడమై దేని మానాన అవి ప్రయాణం చేస్తుంటాయి. మళ్ళీ ఎప్పుడో ఆ ప్రవాహమే కలుపుతుంది. ఇక్కడ కలయికలూ, విడిపోవడాలు మ్రానుల వశంలో లేవు. ప్రవాహగతిపైన ఈ కలయికలూ, విడిపోవడాలు ఆధారపడి ఉన్నాయి. సరిగ్గా మానవుల కథా అంతే! ఈ మానవులు ఆ మ్రానుల లాంటివారు. ఈ మ్రానులను నడిపించే ప్రవాహమే కాలము. కాల ప్రవాహగతిపైన మానవుల కలయికలూ, ఎడబాటులూ ఆధారపడి ఉన్నాయి. ఇదీ అసలు సత్యం. భీష్మాచార్యుడు చేసిన ఈ ఉపదేశం చాల లోతయినదీ. ఈ యదార్థాన్ని గురించి వర్ణిస్తూనే పురాణ ఇతిహాసాలు అనేకచోట్ల 'సర్వము కాలవశము' అని చెబుతూ ఉంటాయి. అకారణంగా ఒక మనిషి మనకు దూరమైనప్పుడు గుర్తు తెచ్చుకోవలసింది ఈ ఉపదేశాన్నే. మళ్ళీ ఆ కాల ప్రవాహానికి తెలుసు, మనను ఎప్పుడు కలిపి నడిపించాలో! కాలగతి ఒక పట్టాన అంతుపట్టేది కాదు. కాని, మన ప్రవర్తన సరైనది అయినంతవరకు అది ఏది చేసినా మనకొరకే చేస్తుంది. మన వ్యక్తిత్వానికి మెరుగు పెట్టడానికే చేస్తుంది. మనని మరింత సమర్థులుగా రూపుదిద్దడానికే చేస్తుంది. మనను మరింత పవిత్రులుగా నిలబెట్టడానికే చేస్తుంది.

'మీరు చెబుతున్నవన్నీ నాకు బోధపడుతున్నాయి. కాని ఈ దారుణమైన దృశ్యాలవల్ల ఉద్యమం తాత్కాలికంగానైనా దెబ్బ తింటు

న్నట్లు కనబడుతోంది కదా! మరి దీనికి పరిష్కారం ఎలాగ?' అని మీరనవచ్చు. నాకు రామాయణంలోని ఒక సన్నివేశం గుర్తొస్తున్నది. ఇతడు శత్రువుకి తమ్ముడు. అంత తొందరగా ఇతనిని నమ్మకూడదు అని విభీషణుడి గూర్చి సుగ్రీవుడు అంటాడు. అప్పుడు శ్రీరాముడంటాడుకదా: శరణువేడిన ప్రతివాడికీ అభయం పట్టడం నా వ్రతం. అలా శరణువేడిన వారినెవ్వరినీ నేను అనుమానించను. నాకు ఆత్మీయులుగానే పరిగణిస్తాను. వారి రక్షణ భారాన్ని నేను స్వీకరిస్తాను. నీవన్నట్లుగా కొంతకాలం పోయే సరికి వారిలో ఒకరికి బుద్ధి వక్రించిందనుకో. అప్పుడు వారిని దమిస్తాను. ఈ వాక్కులు నాకు బాగా నచ్చాయి. మన దగ్గరకు ఎందరో ఎన్నెన్నో విధాలుగా వస్తారు. వారిలో అన్నిస్థాయిల వాళ్ళూ ఉంటారు. వారికి అభయంపట్టి చేయూతనివ్వడం నా కర్తవ్యం. వారికి చేయవలసింది చేసి పెట్టడం నా ధర్మం. అలాంటి స్థితిలో వారిలో ఎవరికైనా బుద్ధి వక్రిస్తే వారు తప్పకుండా ఈ ఉపాధినుండి వ్యక్తమవుతున్న ధర్మతేజంచేత దమింపబడతారు. ఇంక అలాంటప్పుడు మనం అడుగడుగునా మనను చేర వస్తున్న వారిని అనుమానించడం ఎందుకు? చేరవచ్చిన ప్రతివారినీ అనుమానించడం దారుణమైన అంశం కదా! అలా అనుమానిస్తే నానా జాగ్రత్తలు పడటంకన్నా, రాముడిలాగ నిలబడటమే సాక్ష్యం. మనం ఎవరినీ అనుమానించకూడదు. చేరవచ్చిన ప్రతి వ్యక్తినీ దేవుని రూపంగా భావించి మనం సేవ చేయవలసిందే. అతడు మధ్యలో వేరు విధంగా ప్రవర్తిస్తాడంటారా? అతణ్ణి దమించేటందుకు ధర్మతేజం ఎలాగూ ఉండనే ఉన్నదికదా! మనం ఆచరిస్తున్న ధర్మమే మనకు రక్ష. ఎట్టి పరిస్థితుల లోను మనలను నిలబెట్టుకునేది ఆ ధర్మమే'.

'మీ వివరణ బాగుంది. మీ విశ్వాసం ఇంకా బాగుంది. ఈ పాత్ర ధరించిన మీరు ఇలా నిలబడటమే బాగుంటుంది. మీరిలాగే ప్రవర్తించాలి. అప్పుడే మాకు ఆదర్శం దొరుకుతుంది. ఇప్పుడు నాకు చాల సంతోషంగా, తృప్తిగా ఉంది. ఏది, ఏమిటి అన్నది తెలుసుకున్న తర్వాత నాకు చాల హాయిగా ఉంది' అంటూ పరవశించిపోయాడు ఆ యువ మేధావి.

# స్టోరీ ఆఫ్ డాగ్

మహాభారతాన్ని గూర్చి మంచి కబుర్లు చెబుతున్నారు స్వామి. ఆయన చేతిలో మహాభారతంపైన విశ్లేషిస్తూ, ఎవరి చేతనో వ్రాయబడిన పుస్తకం ఒకటి ఉంది. ఇలాంటి పుస్తకాలు ఎన్నెన్నో స్వామి దగ్గరికి వస్తూ ఉంటాయి. అందులో కొన్నింటిని స్వామి మెచ్చుకుంటారు. కొన్నింటిని చూస్తూ నవ్వుకుంటారు. ప్రస్తుతం స్వామి పెదవుల వెంట చిరునవ్వు వెలువడుతోంది.

'ఏమిటి మాష్టరుగారూ ! నవ్వుతున్నారు ?' అడిగాడు ఒక సోదరుడు.

'ఏమీ లేదురా. పెద్దలు వ్రాసిన గ్రంథాలు ఎలా చూసినవాడికి అలా కనబడతాయి. అందులో మహాభారతం మరీను. మన కనిపించిన ఈ అంశం చెప్పడానికే వ్రాయబడింది ఇది' అని అనిపిస్తుంది. ఎవరికి వారికి ఇలా అనిపించే లక్షణం దీనిలో ఉందని నన్నయ్య తన అనువాదాన్ని ప్రారంభిస్తూనే చెప్పి మరీ ప్రారంభించాడు.

ఒక చిత్రం చెప్పనా ? ఒక రోజున ఒకాయన మహాభారతం మీద ఉపన్యసిస్తున్నాడు. ఆయన మంచి విద్వాంసుడు. యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా కూడా పనిచేస్తున్నాడు. ఆయన ఏమన్నాడో తెలుసునా ? 'ఈ మహాభారతాన్ని కుక్కకు సంబంధించిన కథగా చెప్పవచ్చు. ఎందుకని అంటే ఈ ఇతిహాసం కుక్కతో ప్రారంభమై, కుక్కతోనే పూర్తవుతుంది. నాకనిపిస్తుంది మహాభారతం ఒక కుక్క కథ. కుక్కచేత నడిపించబడిన కథ. కుక్క కొరకే రచింపబడిన కథ' అని.

అందరూ ఆశ్చర్యపోతున్నారు. మహాభారతాన్ని 'స్టోరీ ఆఫ్ గాడ్' అంటారు కదా ? ఈయన 'స్టోరీ ఆఫ్ డాగ్' అంటున్నాడేమిటా ? అని.

"మీ రాశ్చర్యపడనక్కరలేదు. ఈయన మాటలు వినండి. మీకే తెలుస్తుంది" అంటూ ఆయన మళ్ళీ ఇలా కొనసాగించాడు. మొదట జనమే జయుని పరీక్షించడం కోసం ఒక కుక్క వస్తుంది. అతడు చేసిన యాగం యొక్క స్థాయిని అతనికి తెలియజెపుతుంది. కథంతా అయిపోయిన తరువాత ధర్మరాజు వెంట ఒక కుక్క నడుస్తుంది అతడిలోని ధర్మనిష్ఠ ఎంతటిదీ ? అన్నది అందరికీ తెలియ చెబుతుంది. ఇలా కుక్క యొక్క పర్యవేక్షణలో భారతమంతా నడిపించబడినట్లనిపిస్తుంది నాకు. మహాభారతం అధ్యయనం చేయగా, చేయగా నా మనస్సు చివరకు ఈ కుక్కపైన లగ్నమైంది. అసలు ఈ కుక్క ఏమిటి ? కుక్కంటే ఏమిటి ? మహాభారతంలో వ్యక్తమవుతున్న ఈ కుక్కయొక్క తత్త్వమేమిటి ? ఈ కుక్క దేనికి సంకేతంగా గ్రహించబడింది ? ఇలాంటి అంశాల మీద పరిశోధన చేయడానికి ఈ జీవితాన్ని అంకితం చేయాలని నిర్ణయించుకున్నాను మహాభారతం మీద జరుగుతున్న పరిశోధనలకు ఇప్పటికిగాని ఒక పరిపూర్ణత రాదని నా ఉద్దేశం. అంటూ ఆనందబాష్పాలు రాల్చాడు ఆయన.

"ఇలా ఎవరి మనస్సు దేనిమీద లగ్నమౌతుందో ఎవరు చెప్పగలరు ? ఎవరికి ఎక్కడ అనుభూతి కలుగుతుందో ఎవరు చెప్పగలరు ? ఎవరి అనుభూతి వారిది. 'మహాభారతము-కుంతి' అని గ్రంథము వ్రాసినట్లే, 'మహాభారతము- కుక్క' అని ఈయన వ్రాస్తారు. మొత్తంమీద ఈ పరిశోధనల పుణ్యమా అని ఎక్కడెక్కడి అంశాలూ బయటకు తోడబడుతున్నాయి. ఈ తోడబడుతున్న అంశాలలో ఏవి మనిషికి తోడ్పాటా యన్నది తర్వాతి సంగతి' అంటూ స్వామి చేతిలోని గ్రంథాన్ని ప్రక్కన పెట్టారు. పెడుతూ ఇలా అన్నారు: ఈ 'పరిశోధనలు చేసేవారు ఇదికూడా ఒక గమనించవలసిన అంశం' అని చెబితే బాగానే ఉంటుంది. ఇదే అసలు గమనించవలసిన అంశం అని చెబుతున్నారు. అక్కడే ఇబ్బంది వస్తున్నది. మమకారంతో కూడిన అతిశయోక్తులకు చోటు ఏర్పడుతున్నది.

పరిశోధనలో అతిశయోక్తులకు చోటుండకూడదు. అలా చోటీయబడితే ఆ పరిశోధనలో మనమే కనబడతాం. అసలు అంశం కనబడదు'

జాగ్ మైండెడ్‌గా అయిపోయారు అందరూ కాసేపు.

## రామాయణం - రాయంతీలు

'మాష్టరుగారూ ! ప్రస్తుతం మీరు సావధానంగానే ఉన్నారనుకుంటూను' అంటూ ప్రవేశించారు సోదర బృందంలోని ఒకామె.

'ఏ, ఏమిటి కథ ?' అన్నారు స్వామి.

ఏమీ లేదు. ఓ చిన్న ఇది. తరచు వినబడుతున్న మాటలు కొన్ని ఉన్నాయి. వాటిని గూర్చి మిమ్మల్ని తరచి అడగాలని' అన్నదామె.

"అడుగుమరి. ఆలస్యమెందుకు !' అన్నారు స్వామి.

ఆమె గొంతు సవరించుకుంటూ ఇలా అన్నారు : రామాయణాన్ని గురించి ప్రవచనాలు చేసేవాళ్ళు తరచు కొన్ని మాటలు చెబుతుంటారు. ఆ మాటలు దాదాపు ఇలా ఉంటాయి. 'రామాయణము చాల పవిత్రమైంది. నిత్యమూ పారాయణము చేయదగ్గది. మొత్తం కాకపోయినా ఒక కాండనైనా పారాయణం చేయవచ్చు. కాండంత కాకపోయినా ఒక సర్గనైనా పారాయణం చేయవచ్చు. అదీ చేయలేకపోతే కనీసం ఒక శ్లోకమైనా సరిపోతుంది. వీటిలో ఏది చేసినా ఒక పుణ్యం వస్తుంది' ఈ మాటలు నిజమేనంటారా ? ఒక్క శ్లోకం చదివినా రామాయణం మొత్తం చదివినట్లే నంటారా ?

చిరునవ్వు నవ్వుతూ స్వామి ఇలా అన్నారు : అదే నిజమైతే రామాయణంలో ఇన్ని వేల శ్లోకాలను వ్రాసిన వాల్మీకి పిచ్చివాడై ఉండాలి.

ఆయన కూడా రాముని గాథను గూర్చి ఒక శ్లోకం వ్రాసి ఊరుంతుచే సరిపోయేది కదా ! అంత పుణ్యమూ వచ్చేది. మోక్షమూ వచ్చేది. హాయిగా ఈ రచనా, ఈ హడావిడీ లేకుండా ఉండేది. మరెందుకనో ఆయన అలా చేయలేకపోయాడు. బహుశ అప్పటికి ఈ చెప్పేవాళ్ళెవరూ లేరేమో ! ఒకవేళ ఉండి ఉంటే, వాళ్ళ మాటలు ఆ వల్మీకి వినివుంటే, ఆయనకు పుణ్యం మాట ఎలా ఉన్నా మనకీ రామాయణం మాత్రం లేకుండా పోయేది.

'మీరు మరీ మాష్టారూ ! బలే ఆట పట్టించేస్తారు' అన్నదామె.

చిరునవ్వులను మరింతగా వెలువరిస్తూ స్వామి ఇలా అన్నారు : "పాపం వాళ్ళ ఉద్దేశం మంచిదే. అందుకు వాళ్ళు అనుసరిస్తున్న విధానమే అర్థం లేనిదిగా తయారై, అసలు వాళ్ళు ఆశించిన ప్రయోజనమేదైతే ఉన్నదో దానిని నెరవేరకుండా చూస్తున్నది. 'రామాయణం పవిత్రమైంది. రోజూ పారాయణం చేయదగినది ! అని ప్రజలకు నచ్చచెప్పాలన్నది వారి కోరిక. ఆ నచ్చచెప్పడం ఎలాగా అన్నది ఆలోచించారు వాళ్ళు. మొత్తం చదవమంటే బద్ధకిస్తారని ఒక కాండ చదవమన్నారు. దానికి బద్ధకిస్తారేమోనని ఒక సర్గైనా చదవమన్నారు. ఇంకా రాయితీ చాలలేదని అనుకుంటున్నారేమోనని ఒక శ్లోకమైనా చదవండి. చాల పవిత్రమైంది. మిమ్మల్ని పునీతం చేస్తుంది' అని భక్తి ఆవేశంలో గొంతెత్తి అరిచారు. నిజానికి ఏం చేయాలి ? పవిత్ర గ్రంథాల అధ్యయనం ఎడల ప్రజలకున్న బద్ధకాన్ని వదలగొట్టాలి. వదల గొట్టాలంటే ఏంచేయాలి ? ఆ రామాయణ గాథలోని మాధుర్యాన్ని రుచి చూపించాలి. ఎంతగా రుచి చూపించాలీ అంటే, ఆ విన్నవాడు పూర్తిగా చదువుకోలేకుండా ఉండేటతగా రుచి చూపించాలి. అప్పుడు రోజూ చదువుకుంటాడు. పారాయణం చేస్తాడు. పవిత్ర గ్రంథాల పరమార్థాన్ని జీవితంలో అన్వయించుకోవడం నేర్చుకుంటాడు. అలా వాళ్ళ బద్ధకాన్ని వదిలించే అనుభూతిప్రదమైన మార్గాన్ని

చూడాలి గాని, ఆ బద్ధకాన్ని గౌరవిస్తూ అర్థంలేని రాయితీలన్నీ ఇస్తూ పోకూడదు.

ఇలా చెప్పేవాళ్ళల్లో బద్ధకాన్ని గౌరవించే వాళ్లతో పాటుగా ఆయా రచయితల యెడల పరభక్తితో చెప్పేవారు కూడ ఉంటారు. ఒక ప్రొఫెసర్‌గారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో మాట్లాడుతున్నారు. ఆయనకు నన్నయ్యగారంటే అమితమైన అభిమానం. అంతవరకూ మనకూ ఆనందమే. అభ్యంతరమేమీ లేదు. కాని ఆ మితిమీరిన అభిమానంతో ఆ నన్నయగారికే అన్యాయం చేయడం మొదలు పెట్టాడాయన. మొదలుపెడుతూ ఇలా చెప్పాడు: మహాభారతంలో పద్దెనిమిది పర్వాలున్నాయి. అందులో మొదటి రెండున్నర పర్వాలు నన్నయగారు అనువాదం చేశారు. కవిత్రయంలో నన్నయను మించినవారు లేరు. నన్నయగారి రచన వేదాన్ని మరిపిస్తుంది. మరిపిస్తుంటేమిటి ? అసలు వేదమే. అందుకని తెలుగు భారతంలో ఆ రెండున్నర పర్వాలు మనం చదువుకున్నా చాలు. రెండున్నర పర్వాల దాకా ఎందుకు ? నన్నయగారు వ్రాసిన మొదటి పద్యం వ్రాసినా చాలు. మొదటి పద్యందాకా కూడా అక్కరలేదు. ఆ పద్యానికి మొదట ఉన్న 'శ్రీ' అన్న అక్షరం చదివినా చాలు. అదీ కూడా అక్కరలేదు. నన్నయ్యగారు వ్రాసిన ఆది, సభా పర్వాలు మీ ఇంట్లో ఉన్నా చాలు. మీరు తరిస్తారు. నేను చెబుతున్నాను. నన్నయ అంటే ఇది ! ఇలా కొనసాగింది ఆ వీరావేశం.

ఏతావాతా జరుగుతున్న దేమిటంటే ఇటు శ్రోతలలోని బద్ధకాన్ని గౌరవిస్తున్న వాళ్ళుగాని, అటు రచయితలపైన వీరభక్తిని ప్రదర్శిస్తున్న వారుగాని, మొత్తంమ్మీద రచయితలకూ, సమాజానికి కలిపి తీరని అన్యాయం చేస్తున్నారు. వారికి ఎంత భక్తైనా ఉండవచ్చు. గ్రంథం ప్రజల చేత చదివించాలని ఎంత కోరికైనా ఉండొచ్చు. ప్రజల్ని ఇలా తప్పుదారి పట్టించడం మాత్రం భావ్యంకాదు. రచయితలలోని విశిష్టతను గూర్చి

చెప్పండి. గ్రంథాలలోని దివ్యత్వాన్ని గురించి వివరించండి. చేతనైతే ప్రజలకు ఆ గ్రంథాలపైన మక్కువ కలిగేటట్లు చేయండి. ప్రజలు ఆ గ్రంథాలను ఆసాంతం చదువుకుని ఆనందించేటట్లుగా, నిత్యజీవితానికి వాటివి అన్వయించుకునేటట్లుగా ఉండండి. ఇవి ఆ గ్రంథాలను గూర్చి ప్రజలమధ్య మాట్లాడుతున్న వారికి నేను చెప్పదలచిన మాటలు. ఏమంటావ్ ? ఈ నా మాటలు, నీకు కూడా తృప్తి కలిగించాయని అను కుంటాను.

'నాకిప్పుడు చాల తృప్తిగా ఉంది. ఎన్నాళ్లనుంచో ఈ అంశాన్ని గురించి అడిగాలని ప్రయత్నం. ఇవాళ్టికి సానుకూలపడింది. సంతోష మైంది' అంటూ మురిసిందామె.

